ఓరియంట్ లాంగ్మన్స్ ప్రైవేట్ లిమిటెడ్
17. చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 13
నికల్ రోడ్ బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 1
36A. మౌంట్ రోడ్, మద్రాసు 2
కాన్సన్ హౌస్ 24/1. అసఫ్ అలీ రోడ్, న్యూ ఢిల్లీ
గన్ ఫౌండ్రీ రోడ్, హైదరాబాద్
17. నాజిముద్దీన్ రోడ్, ఢాకా

లాంగ్మన్స్ గ్రీన్ అండ్ కంపెనీ
6-7, క్లిఫర్డ్ వీధి, లండన్ W. 1
న్యూయార్క్. టొరాంటో, కేప్ టౌన్, మెల్బోర్న్

మొదటి ముద్రణ, 1960

వెల: రూ. 1.45

DHARMODDHARANA
Telugu Translation of
RECOVERY OF FAITH
By Dr. S. Radhakrishnan
(Abridged)
Translated by
Baddepudi Radhakrishnamurthi

Telugu Edition: 5000 Copies: April, 1960
Price Re. 1.45
English Edition Copyright:
HARPER & BROTHERS
49, East 3rd Street,
New York 15, New York, U. S. A.

Published under the auspices of
THE SOUTHERN LANGUAGES BOOK TRUST, MADRAS

Telugu: 56



Printed at Sri Rajah Power Press, Madras 14

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభాషాపుస్తక సంస్థలో గడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధవిషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు, వారుచేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒకశాఖ. మనదేశ శ్రేయస్సు కోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లుపడినది ముందుతరాలవారంతా తెలుసుకొని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం – ఈ గ్రంథపరంపరలోని ఇతరశాఖలు. కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతానవహాములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను

గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపజేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాశక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,

ఎ. లక్ష్మణస్వామి మొదలియార్
వైస్ ఛాన్సెలర్.
మద్రాసు విశ్వవిద్యాలయం.

మద్రాసు.
7-10-1958

# తొలిపలుకు

ఘనతవహించిన మైసూరు గవర్నరు
శ్రీ శ్రీ జయచామరాజ ఒడయార్.

ఆధ్యాత్మిక జీవనపు పరమార్థాన్ని యోచించి గ్రహించలేని అసంబద్ధస్థితి ఆధునిక యుగంలో అంతకంతకూ అలముకొంటూన్నది. ఈ దుర్యోగం తొలగాలి అంటే నిత్య సత్య ధర్మోద్ధరణ జరగాలి. ధర్మచింతన నానాటికి సగజారడం సర్వత్రా కన్పిస్తూన్నది. అసలు జీవితంలో ధర్మోపాసనానురక్తియే లేని దుస్థితిలో పడిపోతున్నామా అనిపిస్తూన్నది. మతసంప్రదాయాలు పలుగుపడి ఇలా ప్రబలుతూన్న భౌతిక దృష్టియే ఇంతటి ప్రమాదానికి దారితీస్తున్నది. నిజానికి ఆధునిక విద్యావంతులకు ధర్మచింతనకైన లంకెపలుపులు లేవనాలి. చుక్కాని లేక ఎటుగాలివీస్తే అటువీగిపోయే నావలాంటిది అతనిస్థితి. వాయువు నీటిలోని నావనువలెనే, చలించే ఇంద్రియాలు పురుషుని ప్రజ్ఞను హరిస్తవి,—అన్న గీతావాక్యం ఇదేభావాన్ని వెల్లడిస్తూన్నది.

నీటిపై నావను వెనుగాలిలాగా, దృఢబుద్ధిని ఇంద్రియ వ్యాపారం తుడిచివేస్తుంది. చుక్కాని లేక అలల త్రోద్రోపులకు అల్లల్లాడు నావవలెనే, స్థితప్రజ్ఞ లేని మానవుడు బహువిధ విషయాసక్తుడై భంగపడుతాడు—అంటూ ఇదే భావాన్ని వ్యక్తీకరిస్తాడు థామస్ ఎ. కెంపిస్ పండితుడు. సామాన్య మానవుడు ఇలా పరస్పర విరుద్ధభావపరంపరలో జిక్కి దరి

నెఱుగక స్రుక్కిపోతాడు. అయినా, అతడు శాంతిసౌఖ్యాల వర్ధించకపోడు. మతానికి కొన్ని ప్రత్యామ్నాయాలు కల్పించుకొని చూచారు, కాని, అవి నిరుపయోగాలు అని తేలిపోయింది. విషయాసక్తుడై ఇలు విడిచిపోయి అన్ని విధాల తిరిగి తిరిగి దుర్వ్యయమునబడి దీనుడై ఇంటికి తిరిగివచ్చిన యువకుని కథ బైబిల్‌లో వుంది. అదే రీతిగా ఈనాడు మనము గాంధిజీ అనినట్లు శాంతి సౌఖ్యములకు ఏకైకమూలమైన నిత్యసత్యమతవిశ్వాసపు మహాత్వ్యాన్ని మగిడి అర్థిస్తూన్నాము. ఆధునికులకుగూడా నచ్చే ముచ్చటైన ఫణితిలో ఇలా ధర్మోద్ధరణములోని ఆనందసౌందర్యాలను అభివర్ణిస్తుంది రాధాకృష్ణ పండితుని ఈ రమ్యకృతి.



# ఉపోద్ఘాతము

శ్రీ యమ్. యమునాచార్య, మైసూరు.

మతవిశ్వాసం సమాజాభివృద్ధినిరోధకం అన్న అపోహ ప్రబలి, నైతిక విలువలు నవసి ప్రమోదుపడుతూన్న నేటిమానవ సమాజానికి రాధాకృష్ణమనీషి రచన "ధర్మోద్ధరణ" నవ వసంతోదయం. బాహ్యావర్తన విరుద్ధంగా కన్పిస్తూన్నా, నిజానికి ఆధునిక మానవుడు క్రొత్తమతవిశ్వాసాన్ని సాధించాలి అనిగాని, జారిపోయిన మత సంప్రదాయాన్ని తిరిగి సంతరించుకోవాలి అనిగాని ప్రయత్నిస్తూండటం సుస్పష్టమౌతూన్నదంటాడు రచయిత. ఆధునిక మానవుడు ఆత్మనే అన్వేషిస్తున్నాడు - అంటూ ఇదేభావాన్ని వ్యక్తీకరిస్తాడు డాక్టర్ యూంగ్. ఈ గ్రంథంలో మానవ సంఘం అనాదిగా అనుసరించిన వివిధమత సంప్రదాయాలు వివరింపబడినై. క్రొత్తగా తలయెత్తిన కొన్నిమతాచారాలు సవిమర్శకంగా ఉదాహరింపబడినై. ప్రాచీనములగు ఉపనిషత్తుల నాటినుండి నేటివఱకు బహుముఖాలుగా పరిఢవిల్లిన మతానుష్ఠానపు తెఱగులు విపులీకరింపబడినై. మతవిశ్వాసానికి ఆధునిక కాలంలో ఏర్పడిన ప్రత్యామ్నాయాలు ప్రస్తావింపబడినై. వాటిలోని లోపములు వ్రేలెత్తి చూపబడినై. ఆధునిక యుగంలో వెల్లివిరిసిన శాస్త్రదృష్టి - సాంఘిక చైతన్యం - విశ్వైక్యసూత్రముల రీత్యామత విశ్వాసపు మనుగడకు కల్గిన ప్రమాదాలు వివరింపబడినై. ఈనాటి శాస్త్రదృష్టికి, ప్రపంచసమైక్య సిద్ధాంతానికి, సాంఘికాశయాలకు అనుగుణంగా వర్తించని ఏ మత

మైనా వర్ధిల్లబోదని స్పష్టంచేయబడింది. అయినా, ఆధునిక మానవులు ఇంతక్లిష్ట సమయంలోగూడా ఏదోమతాన్ని, మత ప్రత్యామ్నాయాన్ని. లేక, క్రొత్తరూపంలో వెలసిన ప్రాత సంప్రదాయాన్ని పట్టుకొని ప్రేలాడుతూండటం కన్పించకపోదు.

హిందూమతము. జూడామతము, క్రైస్తవము, టోభా మతము మొదలగు వివిధ మతములలో నేటికిని అనర్ఘ రత్నములవలె నిలచిన ఆధ్యాత్మిక జీవన సూత్రాలను అను సరించి ఆధునిక మానవునకు చక్కని ఆధ్యాత్మిక పునరు జ్జీవన మార్గాన్ని కల్పించవచ్చునని సూచింపబడింది. వర్గ భేదాలు, పిడివాదాలు మాని, వర్తమాన మానవ సమాజపు ఆశయాలకు, పురోగమనానికి అనుకూలమైన ధర్మసూత్రాన్ని నిర్మించవచ్చునని నిర్దేశింపబడింది.

"ప్రపంచ సమీక్షలు" అనే గ్రంథమాలలోని ఒక నవప్రసూనం ఈ "ధర్మోద్ధరణ". వర్తమానయుగంలో సత్యధర్మాన్ని మఱుగుపెట్టి మానవ సంఘానికి అసంబద్ధ స్థితిని కల్పించిన అజ్ఞానతిమిరాన్ని అంతరింపజేయడానికి అనువైన విజ్ఞానభాస్కరుల రచనలను సంతరించి ప్రకటించుట ఈ గ్రంథమాల పరమోద్దేశ్యం.

తత్త్వజ్ఞశేఖరుడగు రాధాకృష్ణుని ఈ రచన ఇందుకు అనుకూలంగా సాగింది. ఇందు గ్రంథకర్త భావాలు సువిదిత మైనై. జీవిత పరమావధి చక్కగా చిత్రించబడింది. కాలాను గతికంగా మార్పులు పొందుతున్న మతాలను, శాస్త్ర రీతులను సాహిత్య - రాజకీయ - సాంఘిక పరివర్తనల ప్రభా

వాలను సంపుటీకరించి సవ్యమైన సత్యధర్మమార్గాన్ని అనుసరించవలసిన ఆవశ్యకత ప్రబోధించబడింది. అన్నిటికన్న మిన్నగా ప్రపంచ సమైక్యము, విశ్వకళ్యాణము మానవ సమాజపు పరమాదర్శమన్న మహితోక్తిని అమృతపు సోనలా అడుగడుగున అందివస్తూన్నది కమనీయమైన ఈ గ్రంథం.

గ్రంథాన్ని సాకల్యంగా చూస్తే కొన్ని ప్రత్యేక విషయాలు కన్పిస్తవి. మన మీనాడు ఒక సందిగ్ధ స్థితిలో జీవిస్తున్నాము. శాస్త్రము, సాంకేతికవిద్య మన జీవన విధానంలో గొప్పమార్పులు తెచ్చినై. అయినా, మానవుని హృదయంలో ఒకవిధమైన తిరుగుబాటు తొంగిచూస్తూన్నది. ఈ సందర్భాలనుబట్టి చూస్తే మానవుని నైతిక - ఆధ్యాత్మిక పురోవృద్ధికి అవసరమైన ప్రధాన సమస్యలు కొన్ని ఆలోచనకేరాక అసలు మఱుగు పడిపోతూన్నవి అని తేలుతూన్నది. బాహ్యావర్తనం, ఆత్మప్రవృత్తి ఏకముఖాన సాగడం ఎంతైనా అవసరం. మానవ సంఘపు భావి భాగ్యోదయానికి ఇది అత్యావశ్యకం.

"ఈ నాడు ప్రాక్ప్రతీచీ ఖండాలలో మానవులందఱూ తమలో అఖండమైన ఐక్యభావం ఇమిడివున్నదని గ్రహించ గల్గుతున్నారు. అది కేవలం తలపులలో, సిద్ధాంతాలలో మాత్రమే. కాని ఐక్యము; అభేద్యమైన ఐక్యము. మానవులందఱికి ఒకేరకపు ఆదిమభావాలు, ప్రవృత్తులు ఉన్నవనే సత్యాన్ని ఇపుడిపుడే గుర్తిస్తున్నారు. మానవునిమీద మానవునకు సర్వాధిపత్యం కల్గడం ఏ విధంగాను, ఏ కారణం

వల్లనూ ఇక సాగదని తెలిసికొంటున్నాము. మానవసంఘం ఇప్పుడు సంతరించుకొంటూన్న ఉత్తమనైతిక – ఆధ్యాత్మిక పరిణామానికి ఫలితమే ఈ మహోత్తమ విజ్ఞానం, అంటాడు ఈ గ్రంథమాల సంపాదకుడు.

మానవసంఘ నిర్మాణము, ధర్మ – స్వాతంత్ర్య – శాంతి స్థాపనలు జరగడం కేవలం విజ్ఞానంవల్లనేగాక, నైతిక – ఆధ్యాత్మికశక్తి పటిష్ఠతవలనగూడా అంటాడు సంపాదకుడు. ఈ దశ మానవుని వ్యక్తిత్వాన్ని సమగ్రంగా చిత్రిస్తుంది. అర్థరహితము, కష్టభరితమునైన అగాథంనుండి ఉద్ధరిస్తుంది. జీవితానికి నవనవోన్మేషం సమకూర్చి, సత్యవిస్ఫూర్తి సాధిస్తుంది.

ఈమహోత్తర ధర్మప్రబోధాన్ని ప్రాక్ప్రతీచీ విజ్ఞాన ధురంధరుడు రాధాకృష్ణపండితుడు పాంచజన్యరవంలా పలికినాడు "ధర్మోద్ధరణ" గ్రంథంలో. రచనలో వివేక విచక్షణ, మర్మనాపాటవం, అలలుచిమ్మే విజ్ఞానలహరి ప్రవహిస్తూంది. విశ్వమానవ కళ్యాణాభిలాష అంతర్వాహినిగా రూపొందుతూంది. ఆంగ్లభాషలో బహుళప్రచారం పొందిన ఈ ఉత్తమ గ్రంథాన్ని దక్షిణభాషా పుస్తక సంస్థవారు దాక్షిణాత్య భాషలలోగూడా ప్రచురించుట ప్రమోదదాయకం.

---

# 'ప్రపంచ సమీక్షలు'

నేడు అత్యంత సందిగ్ధావస్థలో ఉన్న మానవలోకాన్ని ఆధునిక దృష్టి కోణమునుండి పునఃపరిశీలనచేసి వాస్తవిక స్థితిని వివరించుటే 'ప్రపంచ సమీక్షలు' (World Perspectives) అను ఈ ప్రచురణల ఆశయం. ప్రస్తుతం ప్రపంచాన్ని ఎదుర్కొంటూన్న ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, విప్లవ స్వభావాన్ని వివేచించి విశదీకరించడం ఈ గ్రంథాల లక్ష్యం. సమగ్ర మానవజీవనానుభూతిపై నేటి సాంస్కృతిక, వైజ్ఞానిక, మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక, కళాత్మక పరివర్తనముల ప్రభావాన్నీ, ఈ యుగంలో మనకు ఎదురైన ప్రధాన సమస్యలనూ కూలంకషంగా చర్చించి, వాటి పౌర్వాపర్యములను తెలివిడిచేయడం ఈ గ్రంథములపని. మానవునకూ ప్రకృతికి, మానవునకూ మానవునకు నడుమ యేర్పడిన అపూర్వ విలక్షణానుబంధమును నిర్వచింపజేయవలెననికూడా సంకల్పం.

ఈ నాడు ప్రపంచంలో వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో అధికారులు మార్గదర్శకులు అయిన ఉత్తమ భావుకులు, పండితులు ఈ గ్రంథాలు రచించారు. వారి ఆశయం కేవలం ప్రపంచప్రజల నడుమ సామరస్య పునరుద్ధరణమేకాదు. వివేకవంతములైన, సునిశితములైన వారి భావాలు అపోహలను, అపమార్గములు బట్టిన సంప్రదాయాలను ఖండించి, మానవుడు తన ఆధ్యాత్మిక

నైతిక యోగ్యతలను, ఈశ్వర సృష్టిలో తన విశిష్టస్థానాన్ని గుర్తించగలిగేటట్లు చేయవలసిన అగత్యం ఏర్పడింది.

విజ్ఞానశాస్త్ర పరిశోధకులు చేయుచున్న నూతన శాస్త్రీయ సిద్ధాంతపరంపర నానాటికి తామరతంపరగా పెరిగిపోతున్నది. దానిని సమన్వయించి సృష్టితత్త్వాన్ని వివరించడంమాత్రం విజ్ఞానశాస్త్రంవల్ల కాని పని. ఈ విపరీత పరిణామమే ఈ ప్రచురణలకు దారితీసినది. మానవుడు తాను తీర్చిదిద్దుకొన్న ఈ జగత్తులో తన కీలకస్థానాన్ని కోల్పోయాడు. విజ్ఞాన శాస్త్రపరిశోధకులు వివిధ వాస్తవిక తత్త్వపరిశీలనలు జరిపి మానవుడుకూడా భిన్న వాస్తవికతా ఖండాల లేక పదార్థాల సమ్మేళనమేగాని, అంతకన్న విశిష్టుడు కాడని తేల్చారు. అతని వ్యక్తిగతాహంకారమును ఇంద్రియ జ్ఞానపేటికలో ఒక మూలకు నెట్టివేశారు. అతని ఆత్మను కూడా తర్కసహమైన శాస్త్రవివేచనకు గురిచేసి, విశ్వ జీవనైక్య భావనకు ఆస్కారం లేకుండా చేశారు.

అయితే, మానవుడు ప్రాకృతికముగ స్వతంత్రుడు. స్వసంకల్ప ప్రేరితుడు; అనుభవజ్ఞాని, మధ్యమధ్యమాత్రం సజీవ వాస్తవికతావాహినికి దూరుడై ధర్మసమ్మూఢ చిత్తుడవుతుంటాడు. తిరిగి వివేకోదయుడై స్వస్వరూపజ్ఞానం పొందుతాడు. ప్రస్తుతం, తిరిగి అట్టి వివేకోదయచిహ్నాలు లీలగా కనిపిస్తూన్నవి. స్వరూప విస్మృతివలన కలిగిన దుష్ఫలితాలను క్రమంగా గుర్తిస్తున్నాము. జీవజగత్తును గురించి, మానవునకు ప్రకృతికిగల సంబంధాలనుగురించి శాస్త్రపరిశోధకులు చేస్తున్న వాదాలలోని అసంబద్ధతను

మానవుడు గ్రహిస్తున్నాడు. వివిధ పదార్థాలలో తానూ ఒక పదార్థంగా భావింపబడడం, భావించుకోనడం ప్రస్తుతం తన ఆత్మగ్లానికి హేతువనీ, ఆవిధంగా తన జీవైక్యభావానికి, విశ్వవ్యవస్థకు, విశ్వసౌందర్య భావనకు భంగం కలుగు తూన్నదని మానవుడు నేడు గుర్తిస్తున్నాడు. ఈ నూతన చైతన్యాన్ని వ్యక్తీకరించడమే ఈ ప్రపంచసమీక్షా ప్రచు రణాల ప్రధాన కర్తవ్యం. దీనివలన ఈ నవీనయుగంలో మానవుని వ్యక్తిత్వాన్ని గుఱించి పునరుజ్జీవనకరమైన సిద్ధాంతం రూపొందగలదని ఆశిస్తున్నాము.

ప్రాచ్యదేశాలలోను, పాశ్చాత్యదేశాలలోను కూడా నేడు మానవుని భావనావిధానం ఈ ప్రపంచాన్ని సవ్యంగా అర్థంచేసుకోనజాలినదిగా లేదని ఈ రచయితల అభిప్రాయం. పూర్వం ఉపయోగపడిన సంకేతాలు, నమూనాలు నేడంతగా ఉపకరించవు. ప్రాచీన ఉపమానాలు, రూపకాలు నేడు సందర్భశుద్ధి లేకుండా పోయినవి. మానవజాతిలో ఆధ్యాత్మిక స్వాభినివేశము, నైతికదీక్ష అడుగంటినవి. మన ఆందోళన కేవలం ఈ నూతనానుభవములవలన కలిగినదికాదు. సకలానుభూతులకు మూలమైన దేశావరణముల స్వభావములే మారి పోయినవి. వాస్తవిక జీవితము, తాత్త్విక భావనకూడా మనకు భావనాతీతంగా పరిణమించినవి. అయినప్పటికి, మన హేతువాదశక్తిని మించిన విజ్ఞానశాస్త్ర సూత్రాల ప్రభావం మన భావనావిధానాలమీద విశేషంగా కనిపిస్తూంది. నవయుగ వాతావరణంలో అద్భుత పరిణామాలకు దారితీసిన శాస్త్రీయ సిద్ధాంతాలు మన భాషకు అతీతమై, కేవలం

గణితశాస్త్ర సంజ్ఞలచేత మాత్రమే వ్యక్తం చేయబడు తున్నవి.

కాలావరణముల స్వరూపం మారిపోయింది. భౌతిక జగత్తులో మన మనుగడకే అయోమయస్థితి ఏర్పడింది. మనభావాల పాటవం కుంటుపడింది. అతిసందిగ్ధమైన అరాజకస్థితి యేర్పడింది. ఈ పరిణామాలన్నిటికి మూలభూతమైన విజ్ఞానశాస్త్రం దుర్వినియోగమై తనకుతానే ముప్పు తెచ్చిపెట్టుకొన్నది. సువిశాలము, గంభీరము అయిన మానవభావనతో, మానవానుభూతితో సమన్వయసామరస్యాలు కుదుర్చుకొంటే తప్ప విజ్ఞానశాస్త్రం ఈ ముప్పు నుంచి తప్పించుకోలేదు. మహత్తరమైన ఆధ్యాత్మిక శక్తిని కూడగట్టుకుంటే తప్ప, మానవుడు పరిస్థితులకు బానిసయై సంశయ సంకటోపహతుడు కాక తప్పదు.

ఈ ఆధ్యాత్మిక భావదారిద్ర్యస్థితిని చక్కబఱచడానికే ఈ ప్రపంచ సమీక్షా ప్రచురణలు ఉద్దిష్టమైనవి. మానవతాపూర్ణమైన మానవ విజ్ఞానాన్ని అణచివేయడం ఇక సాధ్యంకాదు. వివిధ జీవన విధానాల గుణవిశిష్టతలను, ముఖ్యంగా మానవతార్హమైన జీవన విధానమునుగుఱించి ఈ గ్రంథపరంపరలో వివరంగా చర్చిస్తారు. ఏకతానేకతలు పరస్పరావశ్యకములై, ఉత్తరదక్షిణధ్రువములవలె ఒకే పదార్థమునకుగల రెండుముఖములని వినూతన తార్కిక భాషలో ఈ గ్రంథాలు వివరిస్తున్నవి. మానవుని మనికినే విస్మరించి, బహిః ప్రపంచ స్వరూపాన్ని మాత్రమే పరిశోధింపగోరే ధోరణిపై ఇది మన విప్లవం. సార్థకమైన మానవతా

సిద్ధాంతమును రూపొందింపజాలిన సజీవవాస్తవికతలో కేవలఆకస్మికతా వాదముతోపాటు పరస్పరానుబంధముకూడా ఇమిడి ఉన్నదని చూపడానికి ఈ రచయితలుకృషి చేస్తున్నారు.

మానవుని, ప్రకృతిని గురించిన మన పరిజ్ఞానమంతటినీ ఆణవిక పరీక్షకు గురిచేసేపద్ధతి ప్రస్తుతం అవసరమైనా, పిచ్చిత్తికి దారితీసే దారుణ ప్రమాదం ఉన్నదని హెచ్చరించవలసిన అవసరమేర్పడింది. నవయుగ ప్రపంచానికి అవసరమైన నూతన నైతిక నియమావళిని ఏర్పాటు చేయడంకూడా ఈ గ్రంథపరంపర ఆశయం. ఈ నియమావళి క్రొత్తగా సృష్టింపబడేది కాదు. ప్రాచీన సంప్రదాయాలను, నైతిక జీవన విధానాలను పరామర్శించి, దానితోపాటు మానవులకూ ప్రపంచానికి, తమతోతమకు, సర్వ మానవ లోకానికీ గల అనుబంధస్వరూపసహితంగా జీవిత స్వభావమంతటినీ సమగ్రంగా పునః నిర్వచించడానికి ఈ రచయితలు ప్రయత్నిస్తున్నారు. వినాశంపైన, విపరీత పరాజయంపైన విజయధ్వజం ఎత్తి మానవ స్వాతంత్ర్యమును, వ్యక్తిత్వాన్ని చూడగల ఆత్మశక్తిని మానవునిలో ఉద్దీపింప జేయదగిన ఉదాత్త భావములు ఇట్టి విమర్శనుండియే రూపొందవలసి ఉన్నది. ఆ విధంగా చివరకు, అస్థిర సిద్ధాంతాలను తుడిచి పెట్టి, సుస్థిరమౌలిక సిద్ధాంతాలు రూపొందాలి.

సుశిక్షితమైన సత్యదర్శన కౌశలం వలన మానవ జీవితానికి విశ్వజనీనమైన, సుసంబద్ధమైన అర్థమును తేల్చుటకు నిర్విరామకృషి చేస్తూన్న పరమస్వతంత్రులు, నిర్భయులు, మహాపండితులు, అద్భుతభావుకులు ఈ ప్రపంచ సమితిలో

గ్రంథపరంపరకు కర్తలు. ఈ నూతన సత్యమందిర నిర్మాణానికి వీరు శిల్పులు. మానవుడు తనచుట్టూగల వస్తుమయ జగత్తును తన భావనా జగత్తునుకూడా సమీక్షించుకొని, తన అదుపులో ఉంచుకొనడానికి వీలుగా బాధాకరములైన, శక్తిమంతములైన నవీన భావాలతో ఈ మహామందిర నిర్మాణం చేస్తున్నారు. ఈ గ్రంథపరంపరకు పర్యవసానంగా, క్రమంగా విద్వేషాలు కరగిపోవడం మూలంగా, నూతన దురభిప్రాయాలకు దారితీస్తున్న నవీనపరిస్థితుల ప్రాబల్యం మూలంగా, ఒక తరమునుండి మరియొకతరంవానికి సంప్రదాయాలు సంక్రమించడంలో విధిగా తటస్థించే విస్మృతివలన, మానవజాతి తన పూర్వసంప్రదాయాలలో కొన్నింటిని వదలి ఉదారములైన నూతన సంప్రదాయాలను తనకు తెలియకుండానే అనుసరించే సహజధోరణివలన క్రమంగా ఈ పరివర్తన జరుగవలసి ఉన్నది.

ఈ ప్రపంచ సమీక్షా గ్రంథపరంపర రచయితలు మానవుల మనస్సులలో వస్తూన్న పరివర్తనాన్ని విశదీకరిస్తున్నారు. ఇది హేతువాద పద్ధతిలో వ్యక్తంచేసేదికాదు. మానవుడు తాను ఊహించే ఆశయాలకన్న ఉదాత్తతర ఆశయాలను సాధించగలడు. తానుచేసే అతిక్రమణలన్నిటినీ అతిశయించిన ఘనతగలవాడు. ఈ మహావిశ్వంలో, ఈ సంరంభంమధ్య అగోచరమైన, అనిర్వచనీయమైన, అతిసూక్ష్మమైన సృజనాత్మకశక్తి యేదో పనిచేస్తున్న దనడానికి ఇది నిదర్శనం.

ఈ విధంగా, మానవుడు పదార్థశక్తులకు, దేశకాలములకు బద్ధమైన ఈ విశ్వంలో విలక్షణజీవి అని, హేతువాద

వివేక విశిష్టుడనీ నిరూపించడానికి ఈ ప్రపంచ సమితాఖా కార్యక్రమనిర్వాహకులు కృషిచేస్తున్నారు. ఈ విధంగా బహుధావిభక్తమై ఉన్న భూతకాల జగత్తు, చివరకు భావి విశ్వసాంఘికవ్యవస్థగా మార్పుజెందవలసి యున్నది. మానవుని బంధితునిచేసి భ్రష్టునిజేసే నిర్దిష్టభావనా విధానాల దృష్ట్యా పరిశీలించడం అనుచితమని తేలుతూంది. మానవుడు హృదయపూర్వకంగా, మనసా ఈ జీవనసూత్రాన్ని, ఈ విశ్వశాసనాన్ని, మానవ భావనకు సర్వస్వాతంత్ర్యమును సమకూర్చే పటిష్ఠమైన పునాది నిర్మాణముగల ఈ శక్తి మద్విధానమును సదా గుర్తించుకుంటేనే ఈ ఆశయం సఫలం అవుతుంది. ఈ సిద్ధాంతము, ఈ శాసనము, ఎప్పటి వలెనే సత్యానికి, మానవైకమత్యానికి, విజ్ఞానైక్యానికి, భావనానుభూతుల అకలంక సామరస్యానికి, జ్ఞేయజ్ఞానుల మధ్య బహిరంతరములకు, కర్తకర్మలకు, అణుతరంగాలకు, రూపద్రవ్యాలకు, ఆత్మానాత్మలకు సమైక్యానికి నిబద్ధమై ఉంటుంది. ఇక, మిగిలిన అల్పవిభేదాలనుగురించి మౌనమే మనకు సముచితం. నిరంతరం నూతన రూపాలను ప్రదర్శించే జీవనవిధానాన్ని గురించి వివదించడంకూడా ఉచితంకాదు.

న్యూయార్క్,
1958.

రూత్ నందా ఆన్షన్

---

# విషయసూచిక

•

# ధర్మోద్ధరణ

## 1

## ప్రవేశిక

ఈనాడు ప్రపంచానికి సాంఘిక, రాజకీయ, ఆర్థికాది సంస్కరణలకంటె ఆధ్యాత్మిక పునరుజ్జీవనమే ఎక్కువ అవసరంగా కన్పిస్తూన్నది. నాగరకత నవసి సమాజ సముద్ధరణకు క్రొత్తశక్తి అవసరమయ్యే సందర్భాలలో ఇలాంటి ఉద్యమాలు సహజంగా బయలుదేఱటం కద్దు. ప్రపంచాన్ని కొద్దిసేపటిలో స్వాహాచేయగల మారణాస్త్రాలను సృష్టిస్తూన్న నేటిశాస్త్రవిజ్ఞానం పాపాలకు మరణమే ప్రతిఫలం అన్నమాటను స్ఫురింపజేస్తూన్నది.

పరస్పర వైరుధ్యాలతో సాయుధప్రపంచం రెండు పక్షాలుగా చీలింది. ఎదిరిపక్షాన్ని కబళించడానికే వారి వారి కసరత్తు అంతా. దీనితో భవిష్యత్తు ప్రమాదభరితంగా కన్పిస్తూన్నది. మనకు శక్తిసామర్థ్యాలు, సౌకర్యాలు ఎన్ని వున్నా, శాంతిభద్రతలు కొఱవడుతూన్నై. అనుదినం వివిధ విషయాలను గూర్చిన పరిజ్ఞానం పెరుగుతూంది; కాని, వివేకం, వివేచన పెరగడంలేదు. అశాంతికి ఇదే కారణం. ఒకప్పుడు మతం ఇలాంటి వివేకాన్ని, సౌశీల్యాన్ని ప్రసాదిస్తూండేది. మత విశ్వాసాలు సడలినకొలదీ ఈ భద్రత సన్నగిలుతూన్నది. సమాజంలో కల్గిన ఈ విషాదకర

స్థితిని స్వార్థంకోసం కొందఱు వినియోగించు కొంటున్నారు. వివిధదేశాలలో తాము నాయకులమంటూ తమ అవివేకాన్ని విజ్ఞానంక్రింద చెలామణీ చేస్తున్నారు. తులసివనంలో గంజాయిమొక్కలు!

మానవుడికి స్వేచ్ఛాభావంలో నమ్మకంలేకపోతే ప్రపంచం నిరాశ్రయం అవుతుంది. అతడు తన జీవన మార్గంలో శ్రమచేసి ఉన్నతస్థితికి పోవాలి. పశుత్వం అంటిపట్టుకోకుండా మెట్టుమెట్టుగా పైకిఎక్కాలి. అతడు అన్ని వస్తువులవలె ఒకవస్తువు కాదు. అంతఃకరణ విషయంవదలి కేవలం బాహ్యవిషయాలనే గమనిస్తే అతడు కర్మబద్ధుడౌతాడు. బాహ్యవిషయాలనుండి ముక్తి పొందడం మానవునకు సాధ్యమే. తనవ్యక్తిత్వాన్ని, ఆధ్యాత్మికతత్త్వాన్ని నిల్పుకొన్నప్పుడే అతడు నిజమైన మానవుడౌతాడు. ఈ స్థితిని పొందేయత్నముల పరంపరయే మానవసమాజ చరిత్ర. మానవునిలో ఈ మహత్తరభావాన్ని జ్వలింపజేసిన విజ్ఞాన జ్యోతులే బుద్ధుడు, సాక్రటీస్, జొరాస్టర్, ఏసుక్రీస్తు మున్నగు మహనీయులు.

గత చరిత్రలో మానవసమాజపు అభివృద్ధి రేఖ నిరంతరంగా లేదు. ఒకచోటపుష్టి, వేఱొకచోటనష్టి. వస్తువాహనాదుల సంపాదనలో ఉన్న అభివృద్ధి అన్యోన్య సామరస్య సంబంధాలలో లేదు. భవిష్యత్తు మన ఆలోచనల మీద, ఆశయాలమీద, ఆచరణలమీద ఆధారపడి ఉన్నది. సమస్య ఏమిటో ముందు తెలిసికొంటే, పిదప పరిష్కార మార్గం చూడవచ్చును.

అసలు జీవనసూత్రంలోనే మార్పు ఇమిడియున్నది. మానవుడు తన పరిసరాలకు అనుగుణంగా మార్పుచెందుతాడు. సముద్రతీరవాసికి చేపలుపట్టడం వృత్తి అవుతుంది. సారవంతమైన మైదానంలో నివసించేవారు భూమిసాగుకు పూనుకొంటారు. అడవిలో వుండేవారికి కట్టెలుకొట్టడం పని అవుతుంది. ఇలా బాహ్యప్రకృతిని అనుసరిస్తేనేగాని మానవునికి మనుగడ వుండదు. అన్నిమతాలకు లక్ష్యం విశ్వసమైక్యము. కొంతవఱకు భౌతికంగా భౌగోళికంగా ఇలా జరిగిందేకాని, మన మన స్తత్త్వాలు మాత్రం ఈ విశ్వైక్యమును అంగీకరించేటంత పరిపక్వం చెందలేదు. కుప్పతెప్పలుగావున్న మతవైరుధ్యాలు, జాతివిద్వేషాలు, వర్గసంఘర్షణ లను మాపి ఐకమత్యముసాధించి దానిని సుప్రతిష్ఠితం చేయడానికి అవసరమైన నూతన దృక్పథాన్ని ధైర్యంతో పట్టుదలతో అన్వేషించాలి.

నైతికపు విలువలు తెలిసికోలేకపోతే మానవుని మనుగడయే దుస్తరం. వ్యక్తుల మధ్యవలెనే జాతుల మధ్యగూడా అనుబంధాలు, అవరోధాలు వుంటై. ప్రపంచంలో శాంతిభద్రతలు తక్కువగావున్న వర్తమాన కాలంలో సహనాన్ని, సౌజన్యాన్ని అధికంగా ప్రదర్శించి మానవత్వపు మెఱుగులను సరిదిద్దడం ఎంతైనా అవసరం.

మతప్రవక్తలు తమకు సంప్రదాయంగా వచ్చే విషయాలకు విరుద్ధంగా ప్రబోధాలు జరిపారు. ఉపనిషత్కర్తలు, బుద్ధుడు, జొరాస్టర్, సాక్రటీస్, ఏసుక్రీస్తు, మహమ్మద్, నానక్, కబీర్ మున్నగు మతప్రవక్తలు అనాదిగా వచ్చిన సంప్రదాయాలను విడచి వర్తించవలసివచ్చింది. బుద్ధుడు

యజ్ఞయాగాది కర్మలను నిషేధించినట్లు, మతముయొక్క బాహ్యాడంబరాలను మనము నిషేధించాలి. కాలమాన పరిస్థితులకు అనుగుణంగా ఉత్తమధర్మ ప్రబోధముచేయజాలని మతాన్ని వర్జించడమే మంచిది. 'ప్రాతదైనంతమాత్రాన ప్రతివస్తువు మంచిది కాజాలదు. ఏ సాహిత్యమైనా క్రొత్తదైనంతమాత్రాన మంచిది కాపనరాదు. విజ్ఞులు గుణాగుణ విమర్శచేసియే దేనినైనా ఆమోదిస్తారు. వివేచనయే లేక ఇతరుల అభిప్రాయాలను గ్రుడ్డిగా అనుసరించేవాడు అవివేకియే' అన్నాడు మహాకవి కాళిదాసు 'మాళవికాగ్నిమిత్రము' లో.

చరిత్ర నిరంతరమూ, నిత్యసంవృద్ధమూను. మత వాస్తవికతను కాలానుగుణంగా మలచుకోవాలి. అందులోని ఉత్కృష్టతను నిలబెట్టాలి. వివిధ మతవిశ్వాసాలలోతర తమ భేదాలుతొలగించి ఐకమత్యమే ఏకైకలక్ష్యంగా రూపొందించాలి. మన ఆత్మబలం సత్యాన్వేషణకు పూనితే, కాలమే అవసరము, అర్హమునైన పరిణామం కల్గిస్తుంది.

---

## 2

## విశ్వాసమునకు విపత్తులు

కార్యకారణ సంబంధాలు చర్చించే శాస్త్రదృష్టి, సాంఘిక చైతన్యం, అంతర్జాతీయ సమైక్యాభిలాషలు పెరగడమే విశ్వాసానికి విపత్తు. కాని, ఆధునిక కాలంలోని శాస్త్రజిజ్ఞాస, సాంఘికాశయాలు, అంతర్జాతీయ ఐకమత్యాభిలాషలకు అనుకూలంగాలేని మతము ఏదైనా మాసిపోక తప్పదు.

## (1) మతము - శాస్త్రము

ప్రయోగంజరిపి ఫలితాన్ని పరిశీలించిన మీదటగాని నమ్మకపోవడం శాస్త్రజ్ఞుల స్వభావం. ఇదే నేడు వివిధ అద్భుతవిషయాలకు, ప్రయోగాలకు అవకాశం కల్పిస్తున్నది. దీనివలననే మనకు భౌతిక ప్రపంచం చాలవరకు స్వాధీనం లోనికి వచ్చింది.

స్థూలంగా చూస్తే మతానికి, శాస్త్రానికి పొత్తు కన్పించదు. శాస్త్రపద్ధతి కార్యకారణ పరిశీలన; మతపద్ధతి కేవల విశ్వాసము. శాస్త్రవిషయంలో ఆలోచనకుగాని, విచారణకుగాని హద్దులులేవు. శాస్త్రం క్రొత్తవిజ్ఞానాన్ని, క్రొత్త అనుభవాలను ఆశిస్తుంది. శాస్త్రకారుడు అహేతుక వాదాన్ని అనుసరించడు. ఆత్మవిమర్శ అతనికి అలవాటు. ఇతరులనుండి విషయాలు తెలిసికొనడానికి సందేహించడు. అతడు ఏసిద్ధాంతానికైనా దాసోహమ్ అంటే, విషయాలను సమగ్రంగా విమర్శించి నిజంతేల్చుకొనే అవకాశం వుండదు. మతానికి వచ్చిన చిక్కే ఇది.

సాధారణంగా శాస్త్రవిషయాలలో మతభావాలలో వలెగాక సర్వసామాన్యత వుంటుంది. జాతి విభేదాలతోగాని, భౌగోళికపు హద్దులతోగాని శాస్త్రజ్ఞులకు పనిలేదు. విశేషం ఎచ్చటవున్నా వారు తెలిసికొంటారు; పరిశీలిస్తారు. శాస్త్ర విజ్ఞానానికి గోప్యమనేది లేనేలేదు.

తన సిద్ధాంతాలు దైవచోదితాలు అనీ, దోషరహితాలు అనీ ప్రతిమతము అంటుంది. సిద్ధాంతాలు అన్నీవాస్తవిక సత్యాలే; వానిలో పొరపాటుకు తావులేదనే పద్ధతి శాస్త్రానికి పొసగదు.

నిజానికి వేదాలు మొదలైన మతగ్రంథాలకు యథాతథంగా అర్థంచెప్పుకోవడం కుదురదు. ఉదాహరణకు, అవిచెప్పే సృష్టిక్రమవిషయంగాని, భూమి కదలక స్థావరంగా ఉంటుందనే విషయంగాని శాస్త్రరీత్యా పరశీలిస్తే సరికావు. అయితే చారిత్రక మూలంగాని, ఆధ్యాత్మిక వాస్తవికతగాని లేనట్టి అనేక విశ్వాసాలతో నిండివున్నదనే విషయం తెలిస్తే ఏమతానికీ నిలువనీడవుండదు. సంప్రదాయాలు, పుక్కిటి పురాణాలు తప్పిస్తే మతము 'కరి మ్రింగిన వెలగపండు' లాగా కన్పిస్తుందనే చెప్పాలి. అందువల్లనే మత గ్రంథాలను విమర్శించి కించించే యత్నాల నన్నింటినీ మతాధికారులు గర్హిస్తారు.

## (2) మతముల పోలిక

వివిధమతాలను పోల్చిచూస్తే వాటి సంప్రదాయాలు మొదలైనవానిలో ఎన్నిభేదాలు వున్నవో అన్ని పోలికలు కూడా వున్నవని తెలుస్తుంది. ముఖ్యంగా దైవచిత్రాలు, పండుగలు మొదలైనవానిలో ఇలాంటి పోలికలు ఎన్నైనా కన్పిస్తవి. ప్రకృతి నవజీవం పోసికొనే వసంతం అనేక మతాలకు పండుగ అయింది. వసంతశోభలో ఉత్సాహం, ఉల్లాసం వెల్లివిరిసి మనసు వికసిస్తుంది. పరిశ్రమ ఫలించి పంటలు ఇంటికి రావడంతో మనసార భగవంతునికి నమస్కరించడానికి మంచి అదను అవుతుంది. సంతోషంలో క్రొంగ్రొత్త కోరికలు తీగలుసాగుతై. ఇది హిందువులకు హోళీపండుగ. యూదులకు పాపం తొలగిపోయి దేవునిదయారసం దొరికిందనే పసందు విందు సమయం. క్రైస్తవులకు ఏసు మరణాన్ని

జయించిన సన్నివేశం తెల్పే ఈస్టర్ పండుగ. వసంతం భౌతిక ప్రపంచానికేగాక ఆధ్యాత్మికలోకానికికూడా నవచైతన్యం ఇచ్చే శుభసమయం. ఏసుక్రీస్తు శిలువనెక్కిన సంఘటనకు గ్రీకుల దేవగాథలకు కొన్ని పోలికలున్నై.

## (3) వ్యక్తి-సాంకేతిక విద్యాభివృద్ధి

మనము ఇంచుమించుగా శాస్త్రపద్ధతిలో తెలియవచ్చే వాస్తవికతను నమ్మడానికి అలవాటుపడ్డాము. జీవశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, చరిత్రల పరిశోధనలవల్ల మానవునిపై పరిసరవాతావరణానికిగల ప్రభావం ఎక్కువ అనీ, అందుకు అనుకూలంగా అతడు మార్పుచెందుతాడనీ తెలుస్తూన్నది.

రానురాను సాంకేతిక విద్య అభివృద్ధి పొందుతూన్న ఫలితంగా ఏర్పడ్డ నూతన ఆర్థిక వ్యవస్థలో వ్యక్తులకుగల ప్రత్యేకత, అన్యోన్యత సన్నగిలుతూన్నది. సంఘంలో వ్యక్తిసంబంధాలు సడలిపోతూన్నవి. కుటుంబము, గ్రామ సంఘము, మతసంస్థ మొదలగువాని ప్రభావం మందగిస్తూన్నది. ప్రజలలో ప్రశాంతత కన్పించదు. శాస్త్రముధర్మమా అని క్రొత్తసాధనాలు, సౌకర్యాలు లభించడంతో ఆత్మవశం వదత్వం కఱవైపోయింది. ఈ బాహ్యసౌకర్యాలకు, సాధనాలకు అంటుకొనిపోయి ఆత్మవిషయాలను విస్మరిస్తూన్నాము.

యంత్రాలరాకతో మనజీవిత విధానం మారింది. ఎందులోనూ స్థిమితం కన్పించదు. వ్యక్తి ప్రజాసామాన్యం తోనే తన మనుగడ వున్నదన్న భ్రమలోపడ్డాడు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక, పారిశ్రామికాది విషయాలన్నింటిలోనికి ఈ తత్త్వం చొచ్చుకొన్నది. ఈ సామాన్య ప్రజానీకానికి

ఆవేశమేగాని ఆలోచనవుండదు. స్వతంత్రాలోచన శూన్యం. అంతా గొఱ్ఱెదాటుపద్ధతియే. సామాన్య ప్రజానీకాన్ని ఆకర్షించగల్గడం పెద్దపలుకుబడి కల్పించుకోవడమే. ఇలా ప్రజానీకపు అభిప్రాయాలతో రాజకీయాలు తారుమారవుతూన్నై. ఆనాడు బాస్టిలీపై దాడి జరిపింది, హిట్లర్ మాటకు జేజేలుకొట్టి నడుముకట్టింది ఈ సామాన్య ప్రజానీకమే. సామాన్యప్రజానీకంలోగల ఈ దౌర్బల్యాన్ని కొందఱు స్వప్రయోజనాలకోసం దుర్వినియోగం చేస్తున్నారు. ప్రజాసామాన్యాన్ని తమ పక్షంచేసికోడానికి నాయకులు ప్రచారంచేస్తారు. దేశపు వైదేశికనీతి మొదలైన పెద్ద వ్యవహారాలనుండి చిత్రరచనలోని పనితనం మొదలైన అతి సామాన్య వ్యవహారంవఱకు అన్నివిషయాలు ఈ ప్రజాభిప్రాయంతో నిర్ణయమై పోతూన్నవి.

సాంకేతిక విద్యాభివృద్ధితో మార్పుపొందిన సమాజంలో మానవునకు వ్యక్తిత్వం నశిస్తుంది. జీవితం యాంత్రిక మౌతుంది. మానవత్వంలోని విశిష్టత మఱుగు పడుతుంది. మానవ విశిష్టతలో విశ్వాసం, దయ, సహకారం, సానుభూతి, సాదరతలతోబాటు, విభిన్నభావాలుగల వారితో సైతం తన అభిప్రాయాలను మొగమోటమి లేకుండా చెప్పగల్గిన సాహసం తొణికిసలాడుతుంది. ఇరుగు పొరుగు వారిని అభిమానించి, విరోధులపట్లనైనా ఔదార్యంచూపగల శీలం తలెత్తిచూస్తుంది. ఈ ఉత్తమ ప్రకృతిని సమీకరించుకో గల్గితే ఏ అక్రమ అధికారానికీ లోబడవలసిన అగత్యం లేకుండా ప్రపంచక్షేమానికి సహకరించగల అవకాశం కల్గుతుంది. అయితే, ఇందుకు భిన్నంగా ఈనాటి సమాజంలో

వ్యక్తియొక్క ప్రత్యేకత, మానవత్వంలోని విశిష్టత అంత కంతకూ అణగారిపోతూ నైరాశ్యం పొడసూపుతూన్నది.

అసలు ఆధునిక ప్రభుత్వాలు వ్యక్తియొక్క ఆత్మ గౌరవాన్ని నిరోధిస్తూన్నవి. వ్యక్తులను కేవలం వస్తువులుగా పరిగణించే పద్ధతులు అనుసరిస్తూన్నవి. కడకు వారు ఆత్మ విశ్వాసంలేని పరిస్థితికి వచ్చేటట్లు చేస్తూన్నవి. ఇలాంటి పరిణామం పొందినవ్యక్తులు ఆత్మ గోల్పోయినవారవుతారు. ఉపనిషత్తులలో చెప్పబడిన 'ఆత్మహనో జనాః' అనువారు ఇలాంటివారే. ఏ బాహ్యశక్తికిని లొంగని ఉత్తమమూ, సర్వోన్నతమూ అయిన తనలోని ఆత్మశక్తిని తెలిసికొని నిలబెట్టుకోవాలి. మనలో ఒక ప్రత్యేక అస్తిత్వం, వాస్తవికత, చిత్తత్వం ఉన్నవి. మనలనుగూడా ఇతర వస్తువులతో సమానపరచ యత్నిస్తూన్న ఆధునిక శాస్త్రపద్ధతులు పరిగణిస్తూన్నట్లు మనము మామూలు వస్తువులముకాము. కాబట్టియే అణ్వాస్త్రాలసాధన మానవుని నైతిక పతనానికి దారితీస్తున్నది అని చెప్పగలము. మనము నైతికపటిష్ఠతను నిల్పుకోవలెనంటే, ఆత్మశక్తిని కోల్పోని విధంగా శాస్త్ర పరిజ్ఞానాన్ని సమన్వయించుకోవాలి.

## (4) తార్కిక భౌతిక వాదము

ఇప్పటి భౌతికవాదులందఱూ అసలు తత్వశాస్త్రాన్నే అధిక్షేపిస్తారు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు అనే ఇంద్రియాలకు గోచరంకానిది ఏదీ నిజంకాదంటారు. భౌతికంగా ఋజువుకు అందేది మాత్రమే సత్యమంటారు. విలువల విచక్షణ, సౌందర్యానుభూతి సత్యానికి సంబంధంలేనివి

అంటాడు. ఇలా వేదాంత విషయాలు అన్నీ అసంబద్ధాలు అనడం, మానవులను ఏదో యంత్రాలులాగా పరిగణించడం చూస్తే మనము ఈ నాడు స్వయంసమృద్ధమైన శాస్త్ర యుగంలో ఉన్నామా అనుకోవలసి వస్తుంది. మనకు భౌతికంగా కన్పించే ప్రపంచంతప్ప మరేమీ లేదనే భ్రమలో వున్నామనిపిస్తుంది. ఇలా నెమ్మదిగా మతానికి మనుగడే పోతున్నది.

## (5) మతము - సాంఘిక సంబంధములు

మతసిద్ధాంతాలను గురించి పట్టుదలగా వాదించేవారు అయినా వాటిని ఆత్మశుద్ధితో విశ్వసించరు. ఈ అసంబద్ధ స్థితియే మతవ్యవస్థలో కనిపించే పెద్దలోపం. మతకర్మలలో నిర్లిప్తతతో పాల్గొంటూ తమతమ మతసిద్ధాంతాలు సాటిలేని వంటూ వాదించడమే మతనిష్ఠ అనుకొంటారు. నిజానికి మతకర్మలను అనుష్ఠిస్తూ అచంచల విశ్వాసం, ఆచారాడంబరాలు చూపేవారిలో చాలమంది తాము ప్రబోధించే మత సిద్ధాంతాలకు అనుగుణంగా తమ జీవితాలను మలచుకోరు. ఈ మత వేషాడంబరం కేవలం నాటక పాత్రాభినయం వంటిది. వివిధమతాలు ఆడంబరాన్ని కాక ఆచరణనే ఆదేశిస్తున్నవి. మతధర్మాలను నిర్వచించడం మాత్రంచాలదు. వాటిని ఆచరణలో పెట్టాలి. నిర్వచనం కేవలం సాధనమాత్రమే. అది గమ్యస్థానం కాదు. ఏ సాధనమైనా అది చేర్చవలసిన గమ్యస్థానంకంటె ముఖ్యమైనది కాజాలదు. ఇంతకూ, మతధర్మాలను త్రికరణశుద్ధిగా ఆచరించాలి. ఆచరణలేని ధర్మం నిరుపయోగం అంటూ

వృంటాము. కాని, మన విశ్వాసానికీ, ప్రవర్తనకూ మధ్య ఎంతో భేదం కన్పిస్తూన్నది. 'ఇహలోకంతోనే అంటి పెట్టుకోక, ఉత్తమమైన దైవనిర్ణయాన్ని అనుభూతిపొందగల మానసిక ప్రవృత్తిని పొందాలి,' అని సెయింట్‌పాల్ సూక్తి. మతం సచేతనమై మానవుని నిత్యజీవితంలో సత్పరిణామం సాధించాలి. లేకుంటే అది ఎండమావుల వంటిదే అవుతుంది. అనుయాయులు అందఱూ ఆచరణలో పెట్టితే మతం మహత్తర ప్రభావంకలదై వ్యక్తి అభ్యుదయానికి, సంఘోన్నతికి అమూల్యమైన సాధనమౌతుంది.

శాస్త్రవిజ్ఞానం వల్ల ఎన్నో జీవన సౌకర్యాలు కల్గినై. అయితే వీటితో మతబోధకులకు సరిపడదు. స్త్రీలకు ప్రసవ వేదన తెలియకుండా మత్తుమందు వాడటం కూడదంటారు. స్త్రీలు ప్రసవవేదన అనుభవించడమే భగవంతుని ఉద్దేశ్యం అని వారి వాదన.

కష్టాలు కష్టాలకోసమే అనే సిద్ధాంతాన్ని హైందవ గ్రీకు మతాలు ఎన్నడూ ఒప్పుకోలేదు. మానవునికి – ప్రకృతికి మధ్యవుండే ద్వైతధోరణిని క్రైస్తవమతం కరుడుకట్టిస్తూంది. ఆత్మయొక్క పవిత్రత నిల్పుకోవాలి అంటే దైహికంగా కల్గే చెడుగులను అన్నిటినీ నిరోధించాలి. అసలు సుఖాలు అనే వాటిని వర్జించాలి అంటారు ప్యూరిటనులు. కవిత్వం, సంగీతం మొదలైన కళలనుగూడా వారు గర్హిస్తారు. వాటిలో దిగడం పాప పంకిలంలో పడడమే అని వారిభావన.

ఆధ్యాత్మిక జీవనానికి నిత్యసాంఘిక జీవితానికి సంబంధం లేదంటూ కొందఱు ఇహలోకంలో ఇడుములను తప్పించుకో చూస్తారు. పారమార్థిక తత్త్వానికి పరుగులెత్తుతారు. మతము

యొక్క పరమార్థం, అది కల్గించే మేలు ముఖ్యంగా ఈ లోకానికి చెందింది కాదనే ఊహలో వారు సామాన్యసాంఘిక జీవితానికి దూరమౌతారు. నిత్యలౌకిక వ్యవహారాలను విడిచి ప్రపంచస్థితిని గుఱించి ఏదో నిష్క్రియత పెంచుకొంటారు. న్యాయము, ధర్మము లభించేది పరలోకంలోనే అంటారు. ఇందువల్ల అసలు మతానికిగల సాంఘిక పునరుజ్జీవనశక్తి జాఱిపోతుంది.

నిజానికి మతానికి - సాంఘిక జీవనానికి మధ్య పెద్ద అంతరం చూపలేము. వ్యక్తులు తమ తమ జీవన పద్ధతులను గూర్చి చేసికొనే నిర్ణయాల పరంపరమీదనే సాంఘికవ్యవస్థ ఆధారపడుతుంది. ఈ నిర్ణయాలకు ఆత్మవివేచన అవసరం. వీటిని ఆచరణలో పెట్టడానికిమాత్రం సాంకేతిక పరిజ్ఞానం, సాంఘిక విజ్ఞానం కావాలి.

మతధర్మాలను ప్రబోధించడం సంఘ సంస్కరణోద్యమం కాదు. కాని, వ్యక్తిజీవితంలో ఎక్కువభాగం సంఘంలోనే గడుస్తుంది. స్థిరమైన సాంఘికవ్యవస్థ నాగరకజీవనానికి ప్రాతిపదిక. వ్యక్తుల ఆశయాలను ప్రకటించుకోడానికి మతము ఒక మార్గం. ఆశాభంగం కల్గినప్పుడు ఉపశాంతికూడా అందులోనే దొరుకుతుంది. సాంఘిక వ్యవస్థను అది సమర్థిస్తుంది. సాధారణంగా మతాలు అనుసరణ స్వభావం కల్గివుంటాయి. అధికారంలో వున్నవారిని మంచిచేసుకోవడం, తమ మనుగడకు వారిమీద ఆధారపడటంకూడావుంది. ఈ స్థితి ఏదో ఒక మతానికి మాత్రమే వున్నదనడానికి వీలులేదు. ఈనాటికి కూడా అస్పృశ్యత, కులభేదాలు మొదలైన దురాచారాలను సమర్థించేవారు కొందఱు లేక పోలేదు.

అయితే, అదృష్టవశాత్తు వారిసంఖ్య నానాటికి సన్నగిలుతూన్నది. బానిసత్వాన్ని, కొన్ని యితర సాంఘికదురాచారాలను తొలగించడానికి క్రైస్తవమతం చాలవఱకు కారణమైంది. కాని, సమాజం మొత్తంమీదచూస్తే క్రైస్తవులు సువార్తలకు తుచ తప్పక నడచుకోవడం కన్పించదు. వారు తమ లోపాలను చూచుకోరు. ఏసు వలె శిలువధరించి నిలువడంగాని, సాక్రటీస్‌వలె విషపాత్రను చుంబించడంగాని చేయలేరు.

మానవ జీవితంలో కష్టాలు తప్పవనీ, వారిపూర్వజన్మ దుష్కృతాలకు అవి ఫలితం అనీ మతాచార్యులే ఒప్పుకొంటారు. ఈ నాడు కష్టాలు అనుభవించినా, భవిష్యత్తులో సౌఖ్యం ఉంటుందని అంటారు. కష్టాలలో ఉన్నవారికి స్వర్గలోక సౌఖ్యపు ఊహాచిత్రాలు కల్పించి ఉపశాంతి కూర్చుతారు. కాబట్టి, ఎఱిగి యెఱిగియే మానవులపై ఒకవిధమైన మత్తుమందుగా మతాన్ని ఉపయోగిస్తున్నారని కొందఱు సాంఘికవాదులు విమర్శిస్తున్నారు. స్వార్థపరుల మద్దతుతో నిలిచిన ఒకవిధమైన వంచనయే మతం అని వారిభావన.

భగవంతుని దృష్టిలో మానవులు అందఱూ సమానులే. ఈ ఉత్తమ సత్యాన్ని అందఱికన్న మిన్నగ అమెరికా రాజ్యాంగ చట్ట నిర్మాతలు గుర్తించారు. 'సృష్టిలో మానవులు అందఱూ సమానులు. వారికి సృష్టికర్తయే జీవనం, స్వాతంత్ర్యం, సౌఖ్యాన్వేషణం మొదలైన జన్మ హక్కులను ఇచ్చాడు,' అనిన అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలోని జెఫర్సన్ పలుకులు ఈ నాటికీ కర్పూరపు పలుకులులా ఘుమఘుమలాడుతున్నై. ఇవి కేవలం ప్రచారం

కోసం చెప్పబడ్డ పొడిమాటలు కావు; ఒక ప్రగాఢ విశ్వాసానికి ఫలితంగా అవతరించిన అమృత వాక్కులు. ఈ ప్రకటనలోని సూత్రాన్ని జెఫర్సన్ తన చరమ లేఖలో ఇట్లా వివరించాడు: 'దేవుని ధర్మచ్ఛాయని మానవులలో కొద్దిమంది మాత్రమే ధన–అధికార–శక్తి సంపన్నులగునట్లూ, తక్కిన వారందఱూ విపన్నులై విధిగ వారి అడుగులకు మడుగులు ఒత్తునట్లు సృష్టించబడలేదు,' అని. ఈ నాటికీ మనము మానవులను అందఱిని సమానంగా చూడడం లేదు. ఇంతకూ మనమాటలకు–చేతలకు పొంతన తక్కువ.

పెట్టుబడిదారీ విధానంగల సమాజంలో సౌమనస్యం, సామరస్యం తక్కువ. ధనిక వర్గానికి చెందిన ఏ కొలదిమంది చేతిలోనో సంపత్తి సాధనలన్నీ ఉండిపోతే, తక్కినవారందఱూ నామకః స్వతంత్రులైనా, ధనికవర్గంవారి చెప్పుచేతలకులోనై తమ శ్రమను ధారపోయవలసిందే. పెట్టుబడిదారులు తాము అధిక లాభాలు పొందడమే ముఖ్యంగా తలచి అందుకోసం శ్రామికులక్షేమాన్ని బలివెట్టడం; వ్యక్తుల గుణగణాలు, సాంఘికవర్తనం మొదలైన వాటినిబట్టి కాక కేవలం ఆర్థిక పరిస్థితులనుబట్టి వర్గవిభేదాలు కల్పించడం మొదలైన ధనిక వాద సూత్రాలు మానవ మర్యాదకే కళంకం కల్గిస్తూన్నై. ధనికవాదం ఈ సూత్రాలను, అలవాట్లను అనుసరిస్తూన్నంత కాలం సంఘంలో అశాంతికే దోహదం కల్గుతుంది.

ముఖ్యంగా తూర్పుదేశాలలో అధికార–సంపదల పంపిణీలో అసమత్వం హెచ్చుగావుంది. ఏ కొద్దిమందియో శ్రమ లేకుండా సుఖజీవనం చేస్తూన్నారు. మిగతా అందఱికి 'తెక్కాడితేగాని డొక్కాడని' దుర్భరస్థితి! ఈ విషమస్థితి

సమసిపోయే మార్గం కావాలి. ముటికి పేటలు, నిరుద్యోగులు, కడుపుకు గంజైయైనా లేని క్షుధార్తులు, కృత్రిమవర్ణభేదాలతో కుమిలిపోతూన్న నిమ్నజాతులు-ఈ వివిధ సాంఘిక సమస్యల పట్ల మతబోధకులు చూపే ఔదాసీన్యంవల్లనే మతానికి గౌరవం మాసిపోతూన్నది. సమాజంలో సమానత్వం బోధించే సాంఘికోద్యమాలు మతబోధకుల కన్నెఱ్ఱకు గుఱియైనై.

జాతివిద్వేషం విశ్వాసాభ్యాసానికి ఎదురుచుక్క. లోకం మన విలువలను, మన మాటలనుబట్టికాక చేతలనుబట్టి నిర్ణయిస్తుంది.

అన్ని మతాలు భూతదయ ప్రబోధిస్తూన్నై. నిన్ను ద్వేషించేవానికిగూడా మేలుచేయుమని క్రైస్తవమతం ప్రబోధిస్తూన్నది. నిన్ను ప్రేమించేవారిని ప్రేమించడంలో గొప్పదనంలేదు; వారిలో వట్టిపోయిన మానవతను-ఆఱిపోయిన ప్రేమకణాలను-రగుల్కొల్పడానికి నీ విరోధులను ప్రేమించుమని ఏసుక్రీస్తు మధురసూక్తి. శత్రువుపట్లనైనా ఈర్ష్యలేని సౌమనస్యంతో వర్తింపుమని అతని పవిత్రాదేశం. వైరులకుగూడా మంచితనమును పంచగల మనసుతో ఈ ఆదేశాలను మనము ఎంతవఱకు అనుసరిస్తాము?

సంశయాత్మత, నిరీశ్వరవాదం కలుగడానికి చాలవఱకు ప్రాచీన మతాలే కారణం అనవచ్చు. మతాలు అనాదిగ కళలు, సంస్కృతి, ఆధ్యాత్మచింతల అభివృద్ధికి ఎంతో తోడ్పడినై. అయితే, వాటిలో వెఱ్ఱి తలలు వేసిన పిడివాదం, పరమతద్వేషం ఈ ఉన్నతికి గొడ్డలిపెట్టు అయినై. తాత్కాలికావసరాలకు సిద్ధాంతాలను మార్చుకోవడం అసంబద్ధము,

అధర్మము అయినాగూడా ఉన్న సాంఘిక వ్యవస్థనే సమర్థించడం తనపనిగా పెట్టుకొనే మతాన్ని ఎదుర్కోవడమే ధర్మం అనాలి. ప్రభుత్వాలు తమ అధికారం దైవదత్తం అంటూ వుంటై అనీ, ఈ సిద్ధాంతం హేతువాదానికి, న్యాయానికి, స్వాతంత్ర్యానికి విరుద్ధమనీ, కాబట్టియే ఈ విపరీత పరిస్థితిని చక్కబెట్టడానికి వలసిన శక్తినిచ్చే సాంఘిక విప్లవం రావాలి అని బాకునిన్ 'గాడ్ అండ్ ది స్టేట్' అనే తన గ్రంథంలో సూచించాడు.

## (6) మతము - విశ్వసామరస్యము

కేవలం ఆర్థిక, రాజకీయ సంబంధాలను పెంపొందించిన మాత్రాన అంతర్జాతీయ సమైక్యమును సాధించలేము. మానవ మనస్తత్వంలో ఆధ్యాత్మిక చింతనలోగూడా ఐకమత్యమును నెలకొల్పితేనే విశ్వసామరస్యము సాధ్యమౌతుంది. విశ్వ కుటుంబ నిర్మాణానికి, మనుగడకు ఐకమత్యముతోబాటు ఆశయాలలో, ఆధ్యాత్మిక దృష్టిలోగూడా సామరస్య సంబంధాలు వర్ధిల్లాలి. మరి మతాలుచూస్తే జాతులమధ్య అంతరాన్ని తొలగించడంలేదు. వేర్వేరు మతాచారాలను బట్టి మానవ కుటుంబం విభిన్న వర్గాలుగా చీలిపోయింది.

నిజానికి మతం అనే పదంలో ఐకమత్యమును సూచించే అర్థం వుంది. కాని, ఏమిలాభం ? వివిధమతాలు తమ ఆధిక్యం తెల్పుకోవడంలో పరస్పర విరోధభావమే పెంచుకొన్నవి.

బౌద్ధమతము, క్రైస్తవమతము, ఇస్లాము మతము మొదలగునవి ప్రచారంలో ఏ మతానికి ఆ మతము తనకే సర్వాధిక్యము ఉన్నదనీ, తన సిద్ధాంతాలే సత్యసంబద్ధాలు

అనీ చాటుకోవడం కన్పిస్తూంది. నిజానికి ఒకమతం కంటె మరోమతం గొప్పది అనడానికి ఎలా వీలుంది? మరి శరణ్యం? మన విశ్వాసమే.

## (7) నాస్తికతా వ్యాప్తి

మతాల బాహ్యస్వరూపంతో తృప్తిపడుతూ ఎందఱో తాము ఆస్తికుల మనుకొంటున్నారు. కాని, విఫలులౌతున్నారు. ఆయా మతాచారాలనుబట్టి నామకరణం, వివాహం, అంత్యక్రియలు మొదలగు వివిధ మత కర్మలు జరుగుతూన్నై. అయినప్పటికీ, మనం తెలియకుండానే మోసంలో పడిపోతూ న్నాము. మననైతికపు విలువలు చెదరిపోయినై; ఆలోచనలు, ఆశయాలు సందిగ్ధాలు, సంశయాస్పదాలు అయిపోయినై. నాగరకత కంతటికీ ప్రధాన రహస్యమైన ఆధ్యాత్మిక జీవనంలో మనకు పునాదులు తప్పినై. వేళ్లుతెగిన మొక్క కొన్నాళ్లు జీవించినా, తాత్కాలికంగా పెరుగుతూన్నట్లు కన్పించినా, నిజానికది అంతటితో నశించేదే. ఆధునిక నాగరికతలోని విపర్యాసాన్ని, నమ్మిక లేమిని, సందిగ్ధము అర్థరహితమునైన చైతన్యాన్ని టి. యస్. ఎలియట్ 'ది వేస్ట్‌లాండ్' అనే తన ఖండకావ్యంలో వివరించాడు. ఈ విపర్యాసమే లోకంలో ఉన్మాదులు ఏర్పడడానికి చాలవఱకు కారణమౌతూన్నది అనవచ్చు.

ఇలా ఇన్ని విధాల నాగరికతలో సమైక్యమును సాధించే బంధాలు నానాటికి సడలిపోతూన్నవి.

# 3

## మతవిశ్వాసము – ఆవశ్యకత

### (1) మతము – ప్రత్యామ్నాయములు

ఇష్టంలేకున్నా ఈనాడు చాలమంది నిరీశ్వరవాదంలో పడిపోయినారు. వారు సంప్రదాయముల పరిధిలో నిలువలేక, తమ ప్రస్తుతావసరాలకు అనుగుణంగా మతవిశ్వాసం కావలె నంటారు. అసలు మానవుడు అసంబద్ధ స్థితిలో బహుకాలం నిలువలేడు; అది మానవ ప్రకృతిలోని సహజగుణము, వారింపరానిదీ అని తత్త్వశాస్త్రాన్ని గురించి కాంట్ పండితుడు అనిన మాటలు మతవిషయంలోగూడా నిజమే. మతవిశ్వాసం లేకపోతే మనుగడయే వుండదు. ప్రకృతి వలెనే మానవుని ఆత్మగూడా శూన్యతను సహించలేదు. అందువలననే కోల్పోయిన మత విశ్వాసాన్ని మన క్షేమం కోసం, భద్రతకోసం ఎంతశ్రమకైనా ఓర్చి తిరిగి అలవరచు కోవాలి. 17–వ శతాబ్దము ముగిసినప్పటినుండి అనుశ్రుతంగా వచ్చే మతాలస్థానంలో నెమ్మది నెమ్మదిగా ఏదో రూపంలో మానవారాధన సూత్రాలు ప్రవేశిస్తూన్నవి. వ్యక్తి పరిరక్షణ కంటూ పారమార్థిక విషయాలకు బదులు ఐహిక విషయాలు ఆధారములౌతూన్నవి.

### (2) చైతన్య రాహిత్యము

ఒక్కొక్కప్పుడు మానవ విజ్ఞానం విచక్షణ, ఆలోచన వదలి పశుప్రాయంగా వర్తించే స్థితికి దిగజారే ప్రమాదం కదు. అయినా, మానవుడు తిరిగి కేవలం ఆస్థితిని పొందలేడు.

ఆత్మజ్ఞానాన్ని విస్మరించి, వివేచనయే లేని సాధారణ ప్రాణిగా మారలేడు. ఇంతకూ ఈ సంశయాత్మతకు, అశాంతికి నివారణోపాయం సృజనాత్మకమైన ఉత్తమ చైతన్య సముపార్జనమే.

## (3) భౌతిక దృష్టి

విజ్ఞాన–నైతిక ప్రమాణాలు పడిపోతూండే ప్రపంచంలో ఇంద్రియ సుఖాలే నిత్యమనిపిస్తవి. గతి, మార్పు, అనిత్యత గలదే ప్రపంచమయితే మన పంచేంద్రియాలద్వారా పొందే అనుభవాలతోడనే తృప్తి పొందడం నేర్చుకోవాలి. మనము నిమిత్తమాత్రులము. క్షణభంగురమైన ఈ దేహాన్ని ఎప్పుడో ఒకప్పుడు మృత్యువు కబళించక తప్పదు. బాధ, వ్యాధి, అసౌఖ్యం దుర్భరములౌతవి. జనన మరణాలు నిరర్థకము లౌతవి. ఓటమి – విజయాలు అర్థరహితములౌతవి. అయినా, మనం కష్టజీవితం గడపడానికే, సృష్టికర్తను తెగడడానికే జన్మించలేదు. దేహధర్మబోధకులు నిష్క్రియతనే బోధిస్తారు. డబ్ల్యు. బి. ఏట్స్ తన 'కెల్టిక్ థాట్' అను గ్రంథంలో చెప్పినట్లు, 'వెచ్చగా ఇంటిలో కూర్చొని కండలు పెంచుకో పైమాట పట్టించుకొనకు, ఏదో పనిలో ఎల్లప్పుడు నిమగ్నమై కాలం వెళ్లబుచ్చుకో,' అంటారు.

ప్రాచీన భారతంలో భౌతికవాదులు ఆనందమే జీవిత పరమావధి అన్నదృష్టిలో వుండేవారు·

ఈ దేహము వుండగానే సౌఖ్యాలు అనుభవించు;
మరణాన్ని ఎవ్వరూ తప్పించుకోలేరు;

ఈ కాయం వల్లకాటికి చేరినతర్వాత
ఇంక తిరిగి వచ్చేదీ, అనుభవించేదీ ఏమివుంటుంది ?

ఈ భౌతిక దృష్టికి అంతా కారణం జీవితాన్ని గుఱించిన సంశయాలే. మానవుడు దైహికావసరాలకు, ఆత్మ విచారణకు మధ్య ఊగిసలాడుతాడు. దైహికావసరాలు సహజంగాను, సులభంగాను కన్పిస్తే. వాటిలో పడితే మానవుడికి అభివృద్ధిగాని, ముక్తిగాని వుండదు. పరిణామ మార్గంనుండి పతనమౌతాడు. జీవితం నిస్తబ్ధతతో కొట్టు మిట్టాడుతుంటే, ఏదో ఇంద్రియవ్యాపారం కల్పించుకొంటాడు. ఇలా పరధ్యానాలతో, వ్యాసంగాలతో మనలోని శూన్యతను గుర్తించగలిగే అవకాశాన్ని జాఱవిడుస్తున్నాము. అనిశ్చిత స్థితిలోవున్న ప్రపంచానికి అనుగుణంగా జీవితాన్ని దిద్దుకోవడం కష్టమే కావచ్చు. కాని, ఆహారనిద్రావిహారాలలోనే జీవితం వెచ్చిస్తూ నాకేమి లేదనుకోగల మనస్తత్వం మాత్రం అసాధ్యం. భౌతికదృష్టి ఎంత నాజూకుగావున్నా, అది జీవిత సమస్యను సరిదిద్దలేదు.

## (4) మానవ వాదము

మానసిక వికాసానికిగల ఆధారాలే కదలిపోతే, అనుశ్రుతంగా వస్తూన్న మతాచారాలు నిరాధారాలుగా కన్పిస్తే, జీవితానికి పరమార్థమే మఱుగుపడితే, జీవనభద్రతకే కొఱతకల్గితే, మనము సత్యముమీద, నైతిక నిష్ఠయొక్క పరమోత్కృష్టతమీద ఆధారపడి జీవితం నడపాలి. మరణం సర్వానికి అంతంగా కన్పిస్తూ సజీవ ప్రపంచమంతా మరు భూమిగా మారితే, ఊర్ధ్వలోకంలో దైవత్వం లోపించి

అంధకారబంధురమూ, నిరామయమూ అయితే అప్పటి ఆ ప్రళయదృశ్యం ఎంతో బీభత్సంగా వుంటుంది.

మానవవాదంలో వ్యక్తికి సర్వప్రాధాన్యము ఇస్తారు. మానవసేవయే ఉత్తమ మతం అంటారు. ఋజుప్రవర్తన, సంబద్ధత, సామరస్యం వారికి ప్రధానం. సహజంగా మానవుడు మంచివాడనీ, చెడుగు అనేది సంఘంలోనే వుంది అనీ, ఆ చెడుగును తొలగిస్తే మానవుని మంచితనం వెల్లి విరిసి అతడు అభివృద్ధి పొందుతాడనీ వారివాదన. అయితే మతం మాత్రం మానవునిలోనే సహజమైన లోపంవుంది అంటుంది.

లౌకిక, పారమార్థిక వ్యవహారాలలో భౌతిక కాయానికి ఆత్మకు భేదం చూపించడానికి మానవవాదం సమ్మతించదు. అయితే ప్రతిమతంగూడా మానవుని వ్యక్తిత్వ గౌరవానికి-హక్కులకు తగినంత ప్రాధాన్యం యివ్వాలి. మతాన్ని త్రోసిరాజు అంటే వాటిని పరిరక్షించలేము. భగవంతుడిని గురించి మనకు తెలియకపోతే, మానవుని గురించి మనం తెలిసికోలేము. మానవత్వంలోని ఉత్కృష్టతయే మతం. ఈ నాడు మానవవాదం ఆత్మకోసం అన్వేషిస్తూన్నది అనాలి.

## (5) జాతీయత

ఆదిలో తన అనుయాయులను దేశభక్తిపరులుగా చేయడం మతానికి ముఖ్యలక్ష్యంగా వుండేది. ఆ ప్రాచీన కాలంనుండి మతానికి జాతీయభావం పొడకడుతూవుంది. ఇస్రాయల్ జాతీయభావానికి-ఆశయాలకు దర్పణంగా

యావే కన్పిస్తాడు. యూదులందఱూ ఒకేజాతికి, ఒకే కుటుంబానికి చెందినవారు.

జాతీయత అనేది ఒకవిధమైన రాజకీయమతం. ప్రజలను ఆకర్షించి వారివల్ల సేవాత్యాగాలు పొందుతుంది. కేవలం మామూలు మతోద్యమాలు ఈ శక్తిని ఇంతగా ఎన్నడూ ప్రదర్శింపలేవు. జాతీయోద్యమంలో ఒకవిధమైన అధికారం కన్పిస్తూంది. ప్రజలలో ఆవేశాన్ని రేకెత్తిస్తుంది. దైవకార్యం తానే నిర్వహిస్తూన్నానంటుంది.

మతం సర్వసామాజికంగా, విశ్వసమ్మతంగా, అన్ని వర్గాలకు అన్ని పరిస్థితులలో అనుకూలపడేటట్లుగా వుండాలి. మతానికి ఈ భావం కొఱవడుతుంది. ఏ మతమైనా ఒకే వర్గానికి, జాతికి, తెగకు చెందినదైతే అది ఉత్తమ మార్గగామి కాజాలదు. ఒకే వర్గాన్నిగాని, జాతినిగాని ఆరాధించడం అంటే భగవంతుడిని వర్గానికి, జాతికి పర్యాయపదంగా చెప్పినట్లౌతుంది. ఏ జాతిగాని, రాజ్యంగాని దైవాంశ వుందను కొంటూ తనశక్తివల్ల అందఱిని పరిరక్షిస్తాననడంతో అధికారాన్ని ప్రాబల్యాన్ని ఆశించడం జరుగుతుంది.

## (6) కమ్యూనిజము

మార్క్స్ సిద్ధాంతం మానవప్రకృతిని శాస్త్రదృష్ట్యా వివరిస్తున్నదని కమ్యూనిస్టులు భావిస్తారు. జీవితావసరాలు లభించే మార్గాలనుబట్టి మానవుని ప్రవృత్తి నిర్ణయమౌతుంది. అతనికి సంఘంలో వున్న స్థితికి దర్పణం అవుతుంది అతని మానసిక ప్రవృత్తి. వస్తువుల ఉత్పత్తికి గల సాధన సౌకర్యాలనుబట్టి వర్గవిభేదాలు ఏర్పడుతవి. ఇలా

ఈనాడు శ్రామికులైన కార్మికవర్గం, యజమానులైన పెట్టుబడిదారీ వర్గం ఏర్పడినై. రాజ్యవ్యవస్థ సాధనంగా ఇందులో పెట్టుబడిదారీ వర్గం కార్మిక వర్గాన్ని తన చెప్పు చేతలలో అణచి పెట్టుకొన్నది. ఇచ్చినదానితో విధిగా తృప్తిపొంది శ్రామికవర్గం అణగి వుండడానికి మతం అనే మత్తుమందు ఉపయోగిస్తున్నారు. ఉత్పత్తి సాధనాలను అభివృద్ధిపరిచే స్థితిలో తాత్కాలికంగా వర్గ సంఘర్షణ తప్పదు. అయితే, ఆ స్థితిదాటినతరువాత వర్గవిభేద రహిత మైన సమాజం ఏర్పడుతుంది. అప్పుడు స్వార్థంకోసం ఒక వర్గం మరోవర్గాన్ని దోపిడిచేయడం వుండదు. ఒక వర్గాన్ని విధిగా అదుపు ఆజ్ఞలలో పెట్టివుంచడానికి అవసరమయ్యే రాజ్య వ్యవస్థతో పనివుండదు. సమాజంలో అందరి అవసరాలు చక్కగా తీరుతవి. న్యాయానికి, స్వాతంత్ర్యానికి ఏలాటి నిరోధం వుండదు. మనం అలాంటి సమాజాన్ని నిర్మించే కార్యానికి ప్రస్తుతం పూనుకొన్నాము. కమ్యూనిస్టుపార్టీ ఈ కార్యక్రమంలో పురోగమిస్తూన్నది.

సామాన్య చారిత్రక పద్ధతికి భిన్నంగా ఏదో ఉత్తమ లక్ష్యాన్ని సాధిస్తానంటూంది అని మతాన్ని గర్హిస్తుంది కమ్యూనిజమ్. ఒకవేళ మతం లౌకిక వ్యవహారాలలో జోక్యం పెట్టుకొంటుంది అన్నా, అది ధనికవర్గాన్ని, అధికార వర్గాన్ని ఇంకా శక్తిమంతంచేసి స్థిరంగా నిలబెట్టడానికే పనిచేస్తుంది. కమ్యూనిస్టుల లక్ష్యం ఈ లోకంలో ప్రత్య క్షంగా సౌకర్యాన్ని, సౌఖ్యాన్ని సాధించడమే. నవసమాజాన్ని నిర్మించడానికి వలసిన కృషిని, పోరాటాన్ని, త్యాగాన్ని ప్రబోధిస్తుందేకాని కమ్యూనిజమ్ ఏదో జరిగేది ఎలాగూ జరుగు

తుంది, చేతులు ముడుచుకొని కూర్చో అనదు. కమ్యూనిస్టు సిద్ధాంతాలు కొన్ని అసహజంగా, దౌర్జన్య పూరితంగా కన్పించినా, మొత్తంమీద కమ్యూనిజమ్ సమత్వాన్ని, లేనివారికి కట్టబెట్టు అనే ఉత్తమ సూత్రాన్ని ప్రబోధిస్తూ న్నది. ఈ సూత్రాన్ని అభినందిస్తున్నామేకాని, ఆచరణలో పెట్టడం లేదు. ఈ సూత్రం సహజంగా బహుజనాకర్షణీయం అవుతుంది. ఆవేదన, ఉద్వేగము లేని సాక్షీ జీవితంతో విసుగు చెందిన మేధావులుగూడా ఈ ఆకర్షణలో పడ్డారు. కాల మంతా ధనార్జనలో గడపడంగూడా ఉత్తేజకరమైన వృత్తి కాదు. వారి జీవితంలో మాంద్యం, కొఱత పోయి, ఆర్థిక స్తోమత, సౌఖ్యం పెరుగుతుంది అని శ్రామికులకు ప్రబోధం చేస్తారు. ఆశలు అడుగంటి, భయంతో నైరాశ్యంతో నసిచెడి వాడిన శ్రామికుల జీవనలతలు క్రొన్ననలుసాగి పూచి పుష్పించే మార్గాన్ని చూపుతున్నా నంటుంది, కమ్యూనిజమ్.

నిజానికి కమ్యూనిజములో మతానికి వుండవలసిన లక్షణాలు అన్నివున్నై. అయితే అవి కేవలం లౌకిక వ్యవహారాలకు, మానవత్వ విషయాలకు సంబంధించినవిగా వున్నై. తన సిద్ధాంతాలు మానవ ప్రకృతిని గూర్చిన పరమసత్యం అంటుంది కమ్యూనిజమ్. ఒక విధమైన రాజకీయ, ఆర్థిక విప్లవాన్ని తేగల్గితే సమాజానికంతటికీ క్షేమం కల్గుతుంది అని సూచిస్తుంది. తన సిద్ధాంతాలు ప్రామాణికాలు, అనతిక్రమాలు అంటుంది. ఇదంతా విశ్వాన్ని గుఱించిన హేతువాదం మాత్రమే అనడానికి వీలులేదు; న్యాయాన్ని అర్థించడంలో మత ప్రాబల్యాన్ని ద్యోతంచేస్తూనే వున్నది. మత విశ్వాసానికిగల నిశ్చయాన్ని

ప్రదర్శిస్తూన్నది. తన లక్ష్యాన్ని సాధించడానికి ఎంతటిత్యాగమైనా చేయవలసిందే అనే విశ్వాసాన్ని వెలిబుచ్చుతూన్నది.

ప్రతిమతంలోనూ కొంత విప్లవభావం వుంటుంది. అయితే బాగా పాదుకొనిపోయిన మతాలలో ఈ భావం అంతరించింది. ఇప్పుడు కమ్యూనిజము ఈ భావానికి జెండా యెత్తింది.

ప్రజలు అందరూ స్వాతంత్ర్యం, సౌఖ్యసంపదలు అనుభవించాలి అనడం, మనమందరమూ దేవుని బిడ్డలమే అన్న భావానికి అనుబంధమే. నిజమాలోచిస్తే, మతనైష్ఠికులు తమ బాధ్యతలు మర్చిపోవడంవల్లనే కమ్యూనిజమ్ ప్రచారం పొందుతూన్నది. ఫ్యూయర్‌బాచ్‌ని గురించిన కడపటి వ్యాసంలో చెప్పబడినట్లు—వేదాంతులు ప్రపంచాన్ని గూర్చి వేర్వేరుగా వ్యాఖ్యానించారు, కాని, అన్నిటా ముఖ్యవిషయం ఒకటే—దానిని మార్చడం. క్రైస్తవమతము, లౌకిక మానవ వాదము చెప్పే వ్యాఖ్యానాలతో తృప్తిపొందక కమ్యూనిజమ్ ప్రపంచంలో క్రొత్తమార్పు తేవడానికి యత్నిస్తున్నది. అందులోని ప్రామాణిక మతాచారాలకు ప్రత్యర్థి యైనందున క్రైస్తవ మతానికి కమ్యూనిజము విభిన్న మతావలంబమే అనవచ్చును. కాని, క్రైస్తవ సూత్రాలకు—సత్యానికి అది విరుద్ధం కాదు. సాంఘిక సమత్వసిద్ధాంతం అన్ని మతాలలో వున్నది. కాని, దానిని నెలకొల్పడానికి కమ్యూనిజములో మాత్రం తీవ్రయత్నం కన్పిస్తూంది. మార్క్సురచన 'కాపిటల్' లో సాంఘిక అసమతయెడ అతనిద్వేషం, పీడిత ప్రజానీకాన్ని ఉద్ధరించాలి అనే అతని తీవ్ర ఆకాంక్ష ద్యోత

మాతవి. మతాచరణలోని దోసగులను కమ్యూనిజము త్రవ్వెలెత్తి చూపుతుంది.

ఒకవర్గం ఇంకొక వర్గంమీద తన అధికారాన్ని బలవంతంగా రుద్దే అవకాశం నశించి, సమత్వం వెల్లివిరిసే సమాజాన్ని ఆశించాడు మార్క్స్. ఏకొలది సంఖ్యాకులో సమస్త అధికారాలు, సౌకర్యాలు అనుభవించే బూర్జువా ప్రజాతంత్రాన్ని అతడు నిరసించాడు. వర్గరహిత సమాజంలో మాత్రమే ప్రతివ్యక్తి తనజీవితాన్ని తనకుతోచిన మంచి మార్గంలో యథేష్టంగా గడుపుకొనే అవకాశం వుంటుంది. అలాంటి సమాజాన్ని నెలకొల్పాలి అంటే సంపదను సమష్టి క్షేమంకొఱకు సమాజపరం చేయాలి.

కమ్యూనిస్టుల సాంఘిక వాదానికి, దానిని అమలు పరచు కమ్యూనిస్టు ప్రభుత్వాల పద్ధతులకు భేదంవున్నది. ఏ సిద్ధాంతమైనా రాజకీయరంగంలో పడేటప్పటికి కొంత మార్పు చెందక తప్పదు.

తమ మతగ్రంథాలను ఎల్లప్పుడు ఏకరువు పెట్టడమే తమపనిగా భావించే మతనైష్ఠికులకూ – ఈ కమ్యూనిస్టులకూ అట్టేభేదంలేదు. సంకుచితత్వంవిడచి వీరు కొంచెం కనువిప్పు చేసుకొనిచూస్తే వస్తు ఉత్పత్తిసాధనాలను బట్టియే సంఘము యొక్క ఆర్థిక, సాంస్కృతిక స్వరూపం నిర్ణయింపబడుతుంది అనీ, ఆర్థిక సమస్యలుమాత్రమే యుద్ధాలకు ముఖ్యకారణాలు అనే మొదలైన వారినమ్మకాలకు శాస్త్రాధారాలు లేవని తేల్తుంది. కాలాన్ని బట్టి మారకుండా ప్రామాణిక మతాచారాలు ఎల్లప్పుడూ యథాతథంగా వుండాలి అనలేము. సంకుచితబుద్ధి లేకుండా మనము శాస్త్రసమ్మతంగా సత్యాన్ని గ్రహించాలి.

సృజనాత్మకమైన బుద్ధిశక్తిని ప్రదర్శించాలి. ధనికవర్గాలకు కంటె శ్రామిక వర్గాలకే ఎక్కువ అనుకూలంగా పనిచేస్తున్న ఈనాటి ప్రజాస్వామిక ప్రభుత్వాల అభివృద్ధి పథకాలను గమనించాలి. పోరాటం లేనిదే శ్రామికులహక్కులు నిలబడవనీ, కార్యమే అందుకు సాధనమనీ అనుకోవడం సత్యానికి దూరమవడమే. విప్లవంద్వారా మాత్రమే తాము అనుకొనే సామాజికవ్యవస్థ సాధ్యమౌతుంది అనివాదించే కమ్యూనిస్టులు శాంతియుత విప్లవంద్వారాగూడా ఇలాంటి విషయాలను సాధించవచ్చుననేమాట మరచిపోతున్నారు. ఏమైనా, ఏదో సిద్ధాంతంకోసం ప్రజాసామాన్యపు ఆశలను, ఆశయాలను దుర్వినియోగపరచడం క్షేమంకాదు. కమ్యూనిజము సాంఘిక న్యాయాన్నిగూర్చి ఖచ్చితంగా చెప్పుతున్నది; కాని, వ్యక్తి హక్కులకు తగినంతగౌరవం ఈయడంలేదు. ప్రపంచమంతటా సాంఘిక పరిణామంరావాలి అనికోరే ఏ పద్ధతియైనా ప్రతివ్యక్తి యెడల న్యాయం, ఔదార్యం ప్రకటించాలి. నిరంకుశ ప్రభుత్వంలో వ్యక్తిహక్కులు భంగపడతై.

వర్గరహితసమాజం ఏర్పడినంతమాత్రాన ప్రజలందఱూ ఏకస్వరూపత కల్గి వుంటారనిగాని, అందఱికి ఒకేకక్షు ప్రాతినిధ్యం వహించవచ్చుననిగాని చెప్పలేము. క్రొత్తగా తలయెత్తుతున్న అసమానతలను సమర్థించడానికే ఏకపక్షు ప్రభుత్వం వెలుస్తున్నది. ఈ నాటికీ రష్యా వివిధవర్గాలమధ్య ఐకమత్యము, సౌభ్రాత్రము సంఘటితపరచలేదు. సాంఘిక విరోధాలు ఇంకా పాదుకొనే వున్నై. పూర్వపు జార్ చక్రవర్తులపాలనలో వలె ఈనాడుగూడా పై అంతస్తులో కొద్దిమంది అధికార సౌకర్యాలతో ఆనందించడం, క్రింది

అంతస్తులో కార్మికులు, కర్షకులు మొదలగు సామాన్య ప్రజానీకం స్వాతంత్ర్యానికి, న్యాయానికి నోచుకోక, తమ స్థితిని చక్కబెట్టుకొనే మార్గంలేక అలమటించడం ఉండనే వుంది. ఆర్థిక, మత, రాజకీయాది సమస్తాధికారాలు ఒక్కచోటనే కేంద్రీకరించి ఆ పైఅంతస్తులోవున్న కొద్దిమంది మాత్రమే అన్నివిషయాలు నిర్ణయించే పద్ధతిగల వ్యవస్థలో మార్క్సు కలలుగన్న లక్ష్యం దొరకదు. దురదృష్టవశాత్తు జీవితం ఏదో అర్థరహితమైన సంఘటనఅయి, ఈ ప్రపంచంలో మానవత్వానికి ప్రయోజనంగాని, గౌరవంగానిలేదు అనే స్థితియేవస్తే, అప్పుడు మనహక్కులు ఏమౌతవో అనే చింతయే అక్కరలేదు.

కమ్యూనిస్టుల దృష్ట్యాపరికిస్తే వ్యక్తి తనకుతానే నడిచే యంత్రంగానో, బానిసగానో కన్పిస్తాడు. జాతీయసంస్కృతి ప్రతిఫలించే యాథార్థమానసిక ప్రవృత్తి యెదుట వ్యక్తిగత మానసప్రవృత్తి ప్రేలవమైపోతుంది అని హెగెల్ అభిప్రాయము. దీనిని తలక్రిందుచేస్తూ మార్క్సు అంటాడు - మానవుల మనుగడ వారిచిత్తవృత్తినిబట్టి వుంటుంది అనడం సబబుకాదు; వారి సాంఘికవ్యవస్థను బట్టియే వారి చిత్తవృత్తి నిర్ణయమౌతుంది, అని.

సంఘ సంస్కరణను అభిలషించే ఆవేదనలో మార్క్సు అంటాడు - లోటుపాట్లకు, చెడుగులకు బాహ్యాపరిస్థితులే కారణం అని. గతంలో మానవుని నైతిక ప్రవృత్తిలోని వక్రతకు కారణం సంఘంలోని లోపాలే. వస్తు ఉత్పత్తి సాధనాలను చేతిలో చిక్కించుకొన్న పెట్టుబడి దారీవర్గం తమ లాభాలకోసం కార్మికుల శ్రమనంతా ధారవోసికొని వారికి

అసువులు నిల్పుకోడానికిమాత్రం అశనంయిచ్చి తక్కిన రాబడినంతా తామే నిలువచేసికొనే పద్ధతిగల సమాజమది. ఈ పద్ధతికి త్రోసిరాజుచెప్పే కమ్యూనిజం అన్నివర్గాలవారి క్షేమం గమనిస్తుంది. ధనవంతులకు వారి ఆడంబరం, అహంకారం, స్వార్థపరత తొలగిపోతై. పేదలకు వారిహీన స్థితి, నైచ్యం, అజ్ఞానం అంతరిస్తై.

మానవునకు సంఘజీవితంతో వివేచన, శీలం కలిగే మాట నిజమే. కాని, అంతమాత్రాన వ్యక్తి సంబంధాలకంటె సాంఘికావసరాలు ముఖ్యం అనడానికి వీలులేదు. నేల, గాలి, నీరు లేనిదే మొక్క బ్రతుకలేదు; అయినా అవిఅన్నీ ఒకటే అనలేము. మనం సర్వదా సంఘజీవులము మాత్రమే అనరాదు. మానవుని ఆత్మప్రబోధం, మానసిక ప్రవృత్తి కూడా అతనిజీవితానికి అవసరమే. కళలు, శాస్త్రాలు మొదలగువానికి ప్రాతిపదికమై మానవునిలో నిక్షిప్తమై ఉన్న ఉత్తమశక్తిని విస్మరించరాదు. మార్క్సుకు సంఘం కంటె వ్యక్తిముఖ్యం. ప్రతివ్యక్తి తనజీవితాన్ని నిరాటంకంగా, యథేష్టముగా సాగించుకొనే అవకాశంగల సంఘం ఉత్తమం. ఈ మూల భావాన్ని మనం విస్మరిస్తే, ఉత్తమ జ్ఞేయము, ధ్యేయముగా మనకు చెప్పబడేది కూడదీయబడిన ప్రజాశక్తి యొక్క ప్రతిమ మాత్రమే అవుతుంది.

ఆయా పరిస్థితులనుబట్టి అపరిశుభ్రత, రుగ్మత మొదలైన చెడుగులు సంఘంలోవున్నై; అయితే, చెడుగు లన్నిటికీ ఆర్థికకారణాలే మూలంకాదు. కామం, క్రోధం, మోహం. మొదలైన మనోవికారాలు, ఇతరుల కష్టాలయెడ నిర్దాక్షిణ్యం, ఇతరులమీద ప్రాబల్యం పొందవలెననే దురాశ

మొదలైన దుర్గుణాలు మానవప్రవృత్తిలో సహజంగా వున్నవే. వస్తుతః పాపం అనేది వున్నది అనే సిద్ధాంతం వేదాంత శాస్త్రజ్ఞులు క్రొత్తగా కనిపెట్టినదేమీ కాదు. పరిసరాలలో మార్పు కల్గినంతమాత్రాన మానవుని సహజప్రకృతిలోవున్న మొండిపట్టు జారిపోదు. మార్క్సుది అంతా భౌతికవాదమే. రహస్యమేమీ లేదు. మానవునిపని కేవలం విషయ పరిజ్ఞానం పొందటం, పరిశ్రమ చేయడం మాత్రమే కాదు. అద్భుతాలను తెలిసికొని అభినందించాలి. శాస్త్రాలు మనకు అధికారాన్ని, శక్తిని యిస్తై. మానవుడు అనగానే కేవలం దేహం, మనస్సే కాదు; ఆత్మకూడా.

మానవునిలోని భయం, ఆశ, అసూయలనుగాక, అతని ఉత్తమగుణాలైన వివేచన, సహకారం, ప్రేమలను ప్రకోపింప జేయడం మతపు మహితాశయం. అయితే, విప్లవాల దుందుడుకుతనానికి కారణం ఎప్పుడూ వైమనస్యాల ప్రాబల్యమేకాని, సౌమనస్యాల ప్రభావం కాదు. ఈ వైమనస్యపు అగ్నిగుండానికి ఆహుతి ఏదో ఒకవర్గం - యూదులో, క్రైస్తవులో, పెట్టుబడిదారులో, కమ్యూనిస్టులో. కమ్యూనిస్టులు, కమ్యూనిస్టులుకానివారు కూడా మానవ జీవితపు పరమార్థాన్ని గురించి ఒకేరకపు అభిప్రాయాలను కల్గివున్నారు. సాధనాలు, ఫలితాలు అన్యోన్యాధారంగా వున్నవనికూడా నమ్ముతారు. అయితే, ఆ సాధనాల - ఫలితాల అన్యోన్యసంబంధాలను గూర్చి వీరిలో అభిప్రాయ భేదాలువున్నై. ఏమైనా, వీరిద్దరూ మానవసౌఖ్యమే లక్ష్యంగా ఆలోచిస్తారు.

మానవవర్తన ఎంత దుర్నీతిలోపడినా దానిని తిరిగి మంచితనంలోనికి మార్చవచ్చుననే విశ్వాసం మతానికి వున్నది. అతిమంచితనం లోకానికి రుచించదనే విషయానికి ఏసుక్రీస్తు చరిత్ర తార్కాణం. ఏసు తనశిష్యులకు సైనిక బలంతో ఈ భూమిపై రాజ్యం స్థాపించడాన్ని నిరాకరించి యుండవచ్చును; కాని, క్రైస్తవరాజ్యాలకు మాత్రం ఇలా సైనికబలం ఉపయోగించడం నిషేధంకాదు. ఆత్మవిచారణ ధర్మమునెఱపే ఋషులుమాత్రం బలప్రయోగానికి పూను కోరు, హర్షించరు. 'బలవంతమాఘుస్నానాలు' ఆధ్యాత్మిక విషయాలకు పనికిరావు. లోటుపాటులుగల లోకంలో ఆదర్శమూ, లోపరహితమూ అయిన పద్ధతినే అనుసరించడం అన్నివేళలా సాధ్యంకాదు. కమ్యూనిస్టు రాజ్యాలతోసహా అన్ని రాజ్యాలు దురాక్రమణకు సైనికబలాన్ని ఉపయోగించ రాదనీ, దురాక్రమణను నిరోధించడానికైనా అవసరమైనంత మాత్రపు బలాన్నే ఉపయోగించాలి అనీ వప్పుకొంటై.

తమ తమ ఆచారాలు ఎలావున్నా, వివిధమతాలు విరోధులతోసహా మానవుల అందఱియందు ప్రేమచూపాలి అని ప్రబోధిస్తై. అయితే, కమ్యూనిస్టులు తమ విరోధుల యెడ ద్వేషాన్ని రేకెత్తించడమేకాక, వారిని ఎంత నిర్దాక్షిణ్యంగానైనా అంతమొందించాలి అని ప్రబోధిస్తారు. వీరిలోగల పెద్దలోపం ఇదియొకటి. మతాలు విశ్వజనీనమైన నీతిని నిర్దేశిస్తై. జాతి, వర్ణభేదంలేకుండా, ప్రతివ్యక్తికి దైవాంశద్యోతమౌతుంది. ఆధ్యాత్మికప్రేమ విశ్వజనీనంగా వుంటుంది.

## (7) అధికార ప్రాబల్యం

ప్రామాణిక మతాచారాలు విమర్శకు తావీయవు. ఔను, కాదు అనకుండా అనుసరించాలి అని శాసిస్తై. మత విశ్వాసపు బలీయతకు విమర్శ హానికరమంటై. ఇంతకూ మన విశ్వాసానికి మూలం ఉండాలి. అందుకు మతగ్రంథాలలో, మతసంస్థలలో ఉద్ఘాటించే సంప్రదాయాలను అనుసరించాలి.

హేతువాదాన్ని, స్వతంత్రవివేచననూ విసర్జించితే మూర్ఖభక్తిపరులముగా తయారౌతాము. గుణాగుణ విమర్శన లేకుండా మతాధికారాన్ని ఔదలదాలిస్తే మతవిశ్వాసం మూర్ఖవిశ్వాసం అవుతుంది. మతగురువు నియంతృత్వానికి గుఱియైపోతాము. మతంలోనైనా, రాజకీయాలలోనైనా ఇలాంటి అధికారప్రాబల్యం స్వేచ్ఛకు, ప్రజాహితానికి నెలవులేకుండా చేస్తుంది.

భగవద్గీతలో అర్జునుడు కర్మాచరణమునకు, విధ్యుక్త ధర్మానికి విముఖుడై యుద్ధము చేయనంటాడు. ఆత్మతృప్తి లేనిపని చేయనంటాడు. ఆత్మకు దూరుడనగుటకంటె సంఘమునకే దూరుడనగుటకు ఇచ్ఛగింతునంటాడు. అట్లు సందిగ్ధస్థితిలోపడిన అర్జునునకు శ్రీకృష్ణుడు తత్త్వబోధచేసి హృదయదౌర్బల్యానికి ఆహుతికావలదనీ, నిష్కామకర్మతో ధర్మవీరుడవు కమ్మనీ ఆదేశిస్తాడు. కేవలం అలవాటును బట్టిగాని, అధికారానికి లోబడిగాని వర్తించడంకూడదు. వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొని, స్వధర్మాన్ని నిర్ణయించుకోవాలి. స్వతంత్ర బుద్ధితో యోచిస్తే సుఖ, సౌకర్యలాలసతకంటె ఆత్మవ్యక్తిత్వాన్ని, స్వధర్మాన్ని రక్షించుకోవడమే ముఖ్యమౌతుంది.

అధికార ప్రాబల్యంగల మతాలు, నాస్తికవాదము ఉత్తరధ్రువం, దక్షిణధ్రువంలాగా వున్నా, రెండింటిలోనూ మూర్ఖవాదం కన్పిస్తూంది. అవి వ్యక్తిలో స్వతంత్రాలోచనను కుంచింపచేస్తవి. మతంలోనైనా, రాజకీయాలలోనైనా ఈ అధికారప్రాబల్యం వ్యక్తులను కేవలం యంత్రాలుగామార్చే అవకాశమున్నది. నాయకుల ఆజ్ఞలకు దాసోహమ్మంటూ వ్యక్తులు కీలుబొమ్మలుగా వుండిపోయేటట్లు చేస్తుంది.

## (8) సంశయము - విశ్వాసము

మతానికి ప్రత్యామ్నాయాలుగా మనం పరిశీలించినవి ఏవీ మన ఆవేదనను తీర్చేవిగా లేవు. కాకపోతే, అవి మనను ఏమత, రాజకీయ సమాఖ్యకో ముడిపెట్టుతవి. ఇంతకూ సంశయాత్మతనూ, నైరాశ్యాన్ని మనం తీవ్రంగా, నిరాఘాటంగా నిరోధిస్తేగాని మన ఆవేదనతీరదు. బహుజనంలో పడితే స్వతంత్రంగా వాస్తవిక సత్యాన్ని పరిశీలించే అవకాశం వుండదు. మనం ఇప్పుడు అసంతృప్తికర వాతావరణంగల యుగంలో వున్నాము. నిరంతరం అంతర్విచారణ చేసికొనే అతిసీరసస్థితిలో ఉన్నవారికి ఉపశాంతి నిస్తుందనే ఏ విషయమైనా ఆదరణపాత్రం అవుతుంది. సౌకర్యం, సౌఖ్యం సమకూర్చుతాము అనే ఎవరిమాటమైనా రుచిస్తుంది. ఏ పనికైనా ముందంజవేస్తాము. నిజానికి వర్తమానయుగంలో నిరీశ్వరవాదంకంటె మూర్ఖవిశ్వాసాలే ప్రమాదకరాలుగా వున్నై. విశ్వాసమనేది మనలో ఎప్పుడూ వుంటుంది; అయితే, జ్ఞేయం ఒక్కటే మారుతూంటుంది. ఒక మతాన్ని

వదలడం ఇంకో మతాన్ని స్వీకరించడానికే. క్రొత్తమతాలు సత్యాన్ని తెలిసికోడానికంటె ఎక్కువగా ధర్మాన్ని తెలిసికోడానికి ప్రయత్నిస్తవి.) ఈ అవసరం యొక్క ప్రాధాన్యం మనం తగినంతగా గుర్తించలేకపోయినా, జీవితానికి ఒక ప్రయోజనం, నిశ్చయ పరమార్థం సాధించేమార్గం మనకు కావాలి. కాని, సంకుచితబుద్ధికి లోనైతే భ్రమ ప్రమాదాలకు చిక్కిపోతాము. అంతటితో ప్రపంచాన్ని గూర్చి క్రొత్త ఏవగింపు కల్గుతుంది.

మానవుడికి కష్టదశలో భగవంతుడు జ్ఞాపకంవస్తాడు. ఎక్కువ క్లిష్టపరిస్థితిలో చిక్కుకొన్నప్పుడు 'హా! పరమేశ్వరా! ఎక్కడున్నావు తండ్రీ!' అంటూ ఆవేదన పొందుతాడు.

మనను అధోగతికి ఈడ్చే ఇప్పటి అస్థిమితస్థితి, ధర్మనిర్ణయలోపం తప్పాలి అంటే, క్రొత్తమార్గం, ఆదేశంకల్గి ఆశాజ్యోతి వెల్గాలి. మన మానసికాందోళనను బట్టి చూస్తే నవజీవనపు వెలుగుబాట లభించకపోదు అనిపిస్తుంది. సాధికారమూ, సత్యసంబద్ధమూ, సర్వాంగీకృతమూనై నూతన సాంఘిక చైతన్యానికి అనుగుణంగా ఉండే ధర్మనిర్ణయసూత్రం కొఱకే మన అన్వేషణ, ఆకాంక్ష. ఇందుకు అనువుగా సహేతుకమైన విశ్వాసాన్ని సాధించాలి. పిడివాదనలతో మానవుని స్వతంత్రతను, ఆత్మశక్తిని భంగపరచే మూఢాచారాలను పోద్రోలి భగవత్స్వరూపాన్ని తెలిసికొనే సత్య-ధర్మోద్ధరణ జరుపాలి.

---

# 4

## పారమార్థిక సత్యము – అన్వేషణ

### (1) శాస్త్రదృష్టి

మతప్రవక్తలు అందరూ భగవంతుడున్నాడు అనుటకు ఋజువు లిస్తారు. బౌద్ధమతములో, గ్రీకుతాత్త్వికులైన ప్లేటో, అరిస్టాటిల్ ల ప్రవచనాలలోగూడా ఇట్టి తార్కాణాలు కన్పిస్తవి. 13–వ శతాబ్దపు నైతికతత్త్వవేత్త సెంట్ థామస్ ఎక్వినాస్ తెల్పిన తార్కాణపంచకమూ ఉన్నది. 18–వ, 19–వ శతాబ్దముల తత్త్వశాస్త్ర పండితులలో కాంట్ మానవుని అంతర్బుద్ధినిబట్టి, హెగెల్ విజ్ఞానాన్నిబట్టి ఆస్తికతను నిరూపిస్తారు. మతమనేది మన సత్యజిజ్ఞాసను తృప్తిపరచేదిగా వుండాలి. భగవంతుడే సత్యము. అతడు సత్యస్వరూపుడు. మహాత్మ గాంధి ఇంకొక అడుగు ముందుకు వేసాడు. భగవంతుడే సత్యము అనుటకంటె, సత్యమే భగవంతుడనుట సమంజసము – అన్నాడు. 'తపో బ్రహ్మః' అనే ఉపనిషత్సూక్తికిది చక్కని వివరణ అవుతుంది. నిర్మలము, నిర్వికల్పమునైన భావనలో దైవత్వమున్నది. బుద్ధుడు హేతు – ప్రమాణ సాధకమైనదే సత్యానికి మార్గము అంటాడు. ప్రాచీనములు అనే కారణంవల్లనేగాని, అవి చెప్పినవారియందలి గౌరవంవల్లనేగాని ఏమతప్రవచనాలను నమ్మనద్దంటాడు. ప్రతివ్యక్తి సత్యాన్వేషణకు పూనుకొని స్వతంత్రంగా ఆలోచించాలి; తెలిసికోవాలి. అందుకే ఏసుక్రీస్తు అంటాడు భగవంతుడిని తెలిసికొని ప్రేమించు – అని. అభిప్రాయాత్మకమైన ప్రేమకాదు, జ్ఞానాత్మకమైన ప్రేమచూపాలి అని అతనిభావన, ఆదేశం.

దైవతత్త్వం వున్నచోట చింతనకు, వర్తనకు తగిన అవకాశం, స్వాతంత్ర్యం వుంటుంది. ఏ పరిస్థితులలోనైనా వాస్తవిక సత్యమే సర్వవిధాల వాంఛనీయం. అది ఏరూపంలో కన్పించినా, మనకు తొలుత కొంతకష్టం కల్పించినా, మన ఇతరభావాలకు అవకాశం కుంచించినా, తుదిఫలితం మాత్రం ఆధ్యాత్మికతత్త్వానికి, విశ్వకళ్యాణానికి అనువుగా వుంటుంది. మానవునికి సత్యాన్వేషణకార్యం అనంతమైనది. అన్వేషణలో అనుభూతి కల్గుతుంది. మనము శాస్త్రవేత్తలమైనా, మతాచారపరులమైనా, సత్యాన్వేషణ మన విధ్యుక్త ధర్మము. శాస్త్రం కేవలం అభిప్రాయాత్మకం కానట్లే, మతం కేవలం మూర్ఖ సిద్ధాంతాత్మకంకాదు. శాస్త్రం వెల్లడించే సత్యం మతనిష్ఠకు దోహదమిస్తుంది. సత్య నిర్ణయానికి అవసరమైన పరిశీలన, పరిశోధన లేకుండానే శాస్త్రం తనసిద్ధాంతాలను మనపై పులిమితే, అసలు సత్య స్వభావమే సమసిపోతుంది; శాస్త్రంగూడా ఒక మూఢ విశ్వాసంక్రిందికి మారిపోతుంది. 19-వ శతాబ్దపు మధ్యకాల ప్రాంతంలో శాస్త్రవాదులుకూడా ఇంచుమించు మతంలోవలె ఊహాజనిత సిద్ధాంతాలకు దిగారు. నామరూపాత్మకమైన సకల ప్రపంచం కేవల పరమాణు సంయోగంవల్ల కల్గిన పరిణామం అన్నారు. ఈ యాంత్రిక దృష్టిలో మానసిక, ఆధ్యాత్మిక ప్రమాణాలకు తావుండదు.

తత్త్వశాస్త్రంలాగే మతం మన అనుభూతికి మొత్తంగా కారణాలు తెల్పుతుంది. మన అనుభూతి మూడువిధాలుగా వుంటుంది - భౌతిక ప్రపంచం, శాస్త్ర దృష్ట్యా జరిగిన ప్రకృతి పరిశీలన ఒకవిధం; వ్యక్తులు - సాంఘిక శాస్త్రం, మన స్తత్త్వ

శాస్త్రం, చరిత్రల ద్వారా తెలియవచ్చిన వారి ఆలోచనలు, అనుభూతి, ఆశయాలు, నిర్ణయాలు - వీనిని గూర్చినది మరోవిధం; సాహిత్యం, తత్త్వశాస్త్రం, మతములద్వారా తెలిసిన విలువలను గూర్చినది ఇంకొకవిధం. అయితే, ఈ మూడురకముల అనుభూతిని సమన్వయించికొని మన మొక ఋజుమార్గం నిర్ణయించుకోవాలి. మన అనుభూతిమీాద తప్పితే ప్రకృతి, ఆత్మ, పరమాత్మలను గూర్చిన మన భావాలకు ఆస్కారమే వుండదు. అనుభూతిని విమర్శించి సమన్వయించు కొనడంలో హేతువాదం ఉపయోగించి సత్యాన్ని అన్వేషిస్తాము. ఏదైనా ప్రతిపాదన మతంలో నిజమైతే హేతువాదంలోగూడా నిజమౌతుంది. సత్యమనేది ఒక్కటే. దానినిగురించిన భిన్నభావాలను సమన్వయించుటకు వీలుంటుంది. ఆధ్యాత్మిక పరివేదన - సత్యాన్ని తెలిసికోవలె ననే దీక్ష - ఫలించాలి. మనం ప్రపంచపు యాథార్థ్యాన్ని గ్రహించక, కేవలం ప్రకృతి శక్తులకు దాసులమైపోరాదు. ప్రకృతినిగూర్చిన విజ్ఞానం హెచ్చినకొలదీ శాస్త్రమే ప్రపంచ పరిణామాన్ని వివరించగలదనీ - సమర్థించగలదనీ భావిస్తున్నాము. అసలు ఒకదశలో సత్యమనేది నిర్ణీతమై వున్నదనీ, మానవుడు దానిని మార్చలేడనీ, అందుకు లోబడటమే అతని ధర్మమనీ అన్నారు. అయితే, తరువాత దానిని తన ఆశలకు, ఆశయాలకు అనువుగా మార్చుకోగలశక్తి మానవునకు వున్నదన్నారు. మొదటిలో మానవుడు ప్రకృతికి లోబడ వలసిన అవసరాన్నే చెప్పారు; తరువాత భౌతికశక్తులను వశపరచుకొనే విషయానికి ప్రాముఖ్యం యిచ్చారు. ఆరంభదశలో మానవునకు విజ్ఞాన సముపార్జన, ఆత్మనిగ్రహం

ఎక్కువ అవసరం అన్నారు. పిదపటిదశలో తన పరిసరాలను - భౌతిక ప్రపంచాన్ని - తనవశం చేసికోడానికి కావలసిన విజ్ఞాన సముపార్జనమే అతనికి ముఖ్యం అన్నారు.

జీవితము అనిత్యము. మరణము తప్పదు. ప్రపంచంలో భౌతికవస్తువులు అన్నీ అశాశ్వతమే. మన ఆలోచనలు, ఆచరణలు, మనము సాధించిన విజయాలు, నిర్మించుకొన్న ఆర్థిక - రాజకీయ వ్యవస్థలు, మననాగరికత - ఇవి అన్నీ చరిత్రలో భాగమే; కాల ప్రవాహంలో కలిసిపోయేవే. మనము నిలిచియున్న ఈభూమి సూర్యచారం మారి ఒకనాటికి వాసయోగ్యం కాకపోనచ్చు. ఉనికి, అశాశ్వతత్వం పరస్పర విరుద్ధాలు కావు. ఈ దృశ్యమాన ప్రపంచానికి ధర్మము ప్రవాహ సదృశమైన పరిణామమే.

భారతీయతాత్త్వికులు కాలాన్ని జననమరణాలలో చూపిస్తారు. కాలచక్ర పరిభ్రమణంలో జననమరణాలు కల్గుతూన్నై. సతత జననమరణ రూపమైన ఈ సంసారచక్రాన్ని సూచించే కాలగతికి అతీతమైన పరమావధి ఏదైనా ఉన్నదా అనేదే తత్త్వశాస్త్రానికి ప్రాథమిక సమస్య. ఈ ప్రపంచము - ఈ నిరంతర సంఘటనల పరంపర - స్వయంసాధకము, స్వయంపోషకము, స్వయంస్థాపకము నగునా, లేక వీనిని ప్రేరేపించు, సమన్వయించు, సంఘటితపరచు మూలశక్తి వేఱే వున్నదా అనే ప్రశ్నకు సమాధానం కావాలి.

ఈ ప్రశ్నకు సమాధానాన్ని పొందడానికి ముందుగా ప్రపంచధర్మ స్వభావాన్ని పరిశీలించుదాము. సృష్టిక్రమ చిత్రణకు ఒక ప్రత్యేకమైన క్రమగతి ఉన్నది. అది అవగాహనలేని అవ్యక్తస్థితికాదు. నియమిత ధర్మబద్ధంగా

వున్నది కాబట్టియే, గతాన్ని బట్టి మనం భవిష్యత్తును సూచించగల్గుతున్నాము. ముందుపనులకు కార్యక్రమము నిర్ణయించుకోగలుగుతున్నాము. ఉపయుక్తము, విశ్వసనీయము నైన విజ్ఞానాన్నిగూడా సేకరించగలము. ప్రకృతిసూత్రాల క్రమపద్ధతికి అంతరాయంలేదు. కాబట్టియే ప్రపంచ పరిణామాన్నిగూర్చిన సూత్రాలను తెలిసికొనగల్గుతున్నాము. నిత్యం సూర్యుడు ఉదయిస్తాడు. గింజలుచల్లితే మొక్కలు మొలుస్తవి - ఇలాంటి సంఘటనలన్నీ నిర్ణీతపద్ధతిలో జరుగు తూంటవి. కాక, ప్రకృతిసూత్రాలు తాఱుమాఱు అయితే - నియమబద్ధం కాకపోతే - ప్రపంచం ఇలాజరుగదు, మన జీవితం ఒక దుస్స్వప్నం అవుతుంది. సృష్టిక్రమమునందలి ఈ నియమ విశేషంలోని - ఈ నిర్ణీత పద్ధతిలోని విశిష్టత సుప్రసిద్ధ శాస్త్రవిశారదులు, తాత్త్వికులునైన న్యూటన్, కాంట్ మొదలైనవారికిగూడా హృదయంగమమైనది.

పైకారణాలను అనుసరించి అప్పుడప్పుడు సంభవించే ప్రకృతి వైపరీత్యాలుగూడా ఈ సూత్రాలనుబట్టియే వుంటవి అని చెప్పాలి. ప్రకృతి సూత్రఫలితాలను నిరోధించే వైచిత్ర్యాలు కల్గేటట్లయితే వాటినిగూర్చిన పరిజ్ఞానం, నిర్వహణలకు అవకాశంవుండదు. ప్రకృతికి స్వాభావికమైన - అనన్యమైన గమనమున్నది. మానవజీవితానికిగూడా ఇది అవసరము.

లోకగతి కేవలం చర్విత చరణం కాదు. దానిలో పురో గమనంగూడా వున్నది. లోకధర్మస్థితిలో వివిధదశలు కల్గుతూవుంటవి. ప్రతిదశ అందుకు సంబంధించిన సూత్రాలను అనుసరిస్తూ వెనుకటి దశకంటె అభివృద్ధిని ద్యోతకం చేస్తూ

వుంటుంది. సృష్టిక్రమచిత్రణ సందర్భంలో బ్రహ్మజ్ఞానాన్ని తెలిసికొనుటనుగూర్చి తైత్తిరీయోపనిషత్తు అన్న, ప్రాణ, మానస, విజ్ఞాన, ఆనందకోశములు అని కోశపంచకాన్ని పేర్కొన్నది. బ్రహ్మజ్ఞానానికి ఈ కోశపంచకం ద్వార భూతము అంటుంది - బ్రహ్మ సామ్యంగల అన్నమును బ్రహ్మముగ ఉపాసించేవారికి శరీరబాహ్యావస్తువులలో ఆత్మత్వభ్రాంతి తొలగుతుంది. అన్నమయమైన శరీరమే బ్రహ్మ అనేబుద్ధి కుదురుతుంది: అన్నము ఆత్మ అనేభావం కుదిరినతరువాత దానినుండి బుద్ధిని త్రిప్పడానికి ప్రాణమయకోశం చెప్పబడింది. అన్నమయకోశానికి ప్రాణమయకోశం ఆత్మ అనేబుద్ధి కుదిరితే అన్నమయకోశంలో ఆత్మత్వబుద్ధి తొలగుతుంది. ప్రాణమయకోశం ఇంద్రియాలకు చేష్ట కల్పిస్తుంది. ప్రాణమయకోశం నిజమైన ఆత్మకాదు. అందువల్ల దానిపిదప మనోమయకోశం సూచింపబడ్డది. ఇది ప్రాణమయ కోశానికి ఆత్మలాంటిది. ఇది సంకల్ప వికల్పాత్మకము, క్రియాప్రధానము. మనోమయకోశంనుండి బుద్ధిని మరల్చడానికి విజ్ఞానమయకోశం పేర్కొబడింది. ఇది కర్తవ్యాదులను నిశ్చయంచేస్తుంది. ఈ కోశమునుండి బుద్ధిని మరల్చడానికి ఆనందమయకోశం సూచింపబడింది. ఆనందమయధర్మము సుఖము. పరబ్రహ్మమే నిజమైన ఆనందము. ఇలా ఒక దశనుండి ఇంకొకదశ అభివృద్ధి సూచకంగా ఉంటుంది. హెగెల్ పండితుని గతితార్కిక భౌతికవాదం, మార్క్సు యొక్క భౌతికవాదంగూడా ఈ పురోగమనాన్ని - అభివృద్ధిని - వప్పుకొంటై. కేవలం జరిగినదే జరగడంకాక, చరిత్రకు పురోగమనం వుంది. ఉపనిషత్తులలో చెప్పబడి

నట్లు మనస్సుచేత, విజ్ఞానముచేత ఆధ్యాత్మిక తృప్తిని, ఆనందాన్నియిచ్చే బ్రహ్మజ్ఞానం పొందగలవారిని కల్పించడమే సృష్టియొక్క మహాశయం. అట్టి బ్రహ్మలోకాన్ని సాధించ గలిగినప్పుడు సృష్టిక్రమానికి అఖండవిజయం, ఆశయసిద్ధి కలిగినట్లే. దేవదూతలనదగిన బుద్ధుడు, జొరాస్టర్, సోక్రటిస్, ఏసుక్రీస్తు ఇదేలక్ష్యాన్ని ప్రవచించారు.

క్రైస్తవమత సిద్ధాంతాల ప్రకారం ఈ భౌతికలోకం వారుచెప్పే పరలోకరాజ్యానికి సోపానమార్గం; మానవ జాతి పవిత్రతను, పరిపూర్ణతను పొందడానికి శిక్షణాలయం.

ఈ సృష్టి యెందుకు కల్గింది? ఈ దృశ్యమాన ప్రపంచంలో వస్తు పరంపర అంతా కల్గుటకు కారణాలేమి?- అనే ప్రశ్నలు కలుగవచ్చు. ఈ సర్వవస్తు జాలం అదృశ్య మైతే అంతా శూన్యమేకదా? అయితే, ఆ శూన్యంనుండియే స్థితి యేర్పడు అవకాశమే లేకపోతే ఈ విశ్వదృశ్యమే లేకపోయేది. భౌతిక ప్రపంచానికి పరిపూర్ణత్వంగాని, శాశ్వతత్వముగాని లేదు. పరిపూర్ణతలేనిది ఏదీ తనంతతాను నిలువలేదు. ఈ అసంపూర్ణగుణబద్ధమైన ప్రపంచంనుండి విశ్వవ్యాప్తమై, సర్వవస్తుసంతతిలో అంతర్భూతమై, ఆది మధ్యాంతరహితము, అనంతమునై వున్న పరమాత్మను తెలిసికోగల ఉత్తమమార్గాన్ని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నై. దృశ్యమాన ప్రపంచంలోని గతికి అంతటికీ స్థితిమూలం. స్థితిలో అభావానికి తావులేదు. ఇంద్రియాతీతదృష్టి గోచర మగు పరమాత్మయే పరమసత్యము.

ఆత్మ సర్వజీవాత్మమయమైన కర్త. సర్వవ్యాపియై, సర్వసాక్షియై, సర్వచిత్తములను ప్రకాశింపచేస్తుంది. సర్వ

శక్తిమంతుడగు పరమేశ్వరుని ప్రదర్శనం ప్రకృతి. అతడు జగత్కర్తయై సృష్టిచేస్తాడు. సర్వవస్తువులు సదసదాత్మకములని శంకరాచార్యుడు ప్రవచించాడు. క్రియాత్మకమైన జగత్తులో ఆత్మయెప్పుడూ ప్రకృతిని జయించడం కన్పిస్తూంటుంది.

పరిపూర్ణమైన పరమాత్మ దేవుడై సర్వజగత్తునకు చలనం యిస్తాడు. తాను మాత్రం అచలుడే. అతడిని ఆత్మానాత్మమూర్తి అనాలి. తత్త్వజ్ఞ శేఖరుడగు అరిస్టాటిల్ అన్నాడు - భగవంతుడు తాను అచలుడై, సమస్తలోకానికి మాత్రం చలనం కల్పిస్తాడు, అని. జగత్తులోని పరిణామం భగవంతుని స్వభావాన్ని మార్చదు. ఆద్యంతాలులేని ఈ సృష్టిఅంతా అతని క్రియాశక్తివలన కల్గినదే.

సృష్టిచిత్రణంలో నిత్యపరివర్తనం, క్రమతలేకుంటే - అది ఆకార రహితమైన అవ్యక్తస్థితి పొందేది; ప్రపంచం చలన రహితమైన ఒక పెద్దముద్ద అయ్యేది. ఈ సృష్టిక్రమానికి, అనంతమైన కాలచక్ర పరిభ్రమణానికి, జ్ఞానుల అంతర్‌దృష్టి ప్రబోధానికి, పండితుల విషయపరిజ్ఞానానికి, కళాకారుని ప్రతిభావిశేషానికి, శిల్పి నైపుణ్య వికాసానికి - పరమాత్మ యొక్క క్రియాశాలిత్వమే కారణం. ఇదే భావాన్ని వెల్లడిస్తాడు శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీతలో - వైభవ శ్రీ ప్రభావయుక్తమైన సమస్తమూ తన తేజోంశము చేతనే కల్గుతూన్నది - అని. పరమాత్మ ప్రపంచంలోని సర్వవస్తుస్వరూపం. కావుననే జగత్కారణమైన సత్, జగత్తుయొక్క స్వభావమైన నిత్యపరిణామంలోని క్రమత తెల్పునది - ఆనంద

సహితమైన చిత్తు కలిసిన సచ్చిదానంద స్వరూపం తెల్లమౌతూన్నది.

లోకంలోని చెడుగులు, అసంపూర్ణత మతదృష్ట్యా సమర్థనీయాలా అనే ప్రశ్న అనాదిగా ఆస్తికవాదులను ఎదుర్కొంటూనే వున్నది. సృష్టిలోని వస్తువులకు అసంపూర్ణత అనేలోపం కొంత వుంటూనేవుంది. అలా కాకుంటే, పరిపూర్ణత్వం కల్గిన సృష్టికర్తయగు భగవంతునికి - అతని సృష్టికి మధ్యగల అంతరాన్ని తెలిసికొనే మార్గమే వుండదు. భౌతిక ప్రపంచానికి అపరిపూర్ణత సాజమే.

జగత్తు భగవదిచ్ఛా ప్రవర్తితం అన్నంతమాత్రాన అది అంతా సౌఖ్యసంపదలతో తాండవించాల్సిందే అన లేము. లోపాలను, పాపాలను, అనిశ్చయాన్ని, అవిశ్వాసాన్ని ఎదుర్కొని గెలవడంద్వారా ఆత్మోద్ధరణ లక్ష్యాన్ని సాధించడమే జీవిత పరమార్థం అంటే, ఇహలోకయాత్ర అందుకు మార్గం అనవచ్చు. జీవితపు అనిత్యతయే దానికొక విధమైన విలువ, ఘనత, సౌరభం సమకూరుస్తున్నది. నైతిక - ఆధ్యాత్మిక విలువలను సాధించడం జీవితలక్ష్యమైనప్పుడు సాధనమార్గంలో కడగండ్లకంటకాలు కన్పించకపోవు. ఆత్మజ్ఞానాన్ని పొందడానికి కష్టనష్టాలతోకూడిన ఈ లోకయాత్ర ఎంతో అవసరమంటాడు కీట్స్ పండితుడు. కాబట్టియే కష్ట - క్లేశ చిహ్నమైన శిలువయే మోక్షానికిగూడా సూచకమైనది.

భగవంతుడు జగత్తును తనలో లీనం చేసికొంటాడు: అంతటితో అతడి లీలావిలాసం, ఆత్మావిష్కరణ ద్యోతక మౌతుంది. ఇదియే హైందవ సిద్ధాంతం ప్రవచించే బ్రహ్మలోకము; క్రైస్తవులు అభివర్ణించే దైవరాజ్యము; ముస్లిములు

చెప్పే స్వర్గము. నిజానికి బ్రహ్మలోకము సంసారమునకు భిన్నమైన ప్రపంచమనరాదు; సంసారబంధవిమోచనమే బ్రహ్మలోకము. సాక్షాద్దర్శనగమ్యము, అనుభవైకవేద్యము అయిన పరమసత్యముయొక్క సువ్యక్తరూపమే స్వర్గం అని ఎర్ రజీ అభిప్రాయం. అది నిరవధిక స్థితియొక్క సృష్టిచిత్రణ ప్రతిబింబం. పుట్టుకకల్గినదానికి దేనికైనా-అది శతసహస్ర వత్సరాలున్నా-అంతముతప్పదు. చారిత్రకదృష్టి బహుళాత్మకంగా, కాలం అనంతంగా వుంటుంది.

మానవప్రకృతి సురక్షితమైతే పరమాత్మానుసంధానమునకు మార్గం ఏర్పడుతుంది. సచ్చిదానందస్వరూపం సాక్షాత్కరిస్తుంది. పరమాత్మ సర్వసృజనాత్మకశక్తిమూర్తి. ఈ శక్తి సహజమై, స్వయంవ్యక్తమై వుంటుంది. సృజనాత్మక విషయాన్ని నిర్దేశించేటప్పుడు పరబ్రహ్మను భగవంతుడంటాము. అయితే బ్రహ్మ ఈశ్వరులు ఒకటే. బ్రహ్మమే ఈశ్వరుడని ఉపనిషత్తులు ప్రవచిస్తున్నై. అనంత, అద్వితీయ సృజనాత్మకశక్తిమూర్తియైన బ్రహ్మను సృష్టికర్తృత్వంలో ఈశ్వరుడుగా పరిగణిస్తారు. ఈ దృశ్యమాన ప్రపంచానికంతటికి అధిపతి హిరణ్యగర్భుడు. అతడు బ్రహ్మ ఈశ్వరుల ప్రత్యక్ష స్వరూపమే అనదగును. భగవంతుని సృష్టియే జగత్తు; జగత్స్వరూపధారణుడు హిరణ్య గర్భుడు. బాహ్య ప్రపంచంనుండి బ్రహ్మము వేఱు అని తలపరాదు. సృష్టిలోని సమస్త వస్తుజాలములో బ్రహ్మము వ్యాపించివుంది. ప్రపంచ పరిణామదశ లన్నిటిలో నిత్యము, అవిఛ్ఛిన్నమునైన బ్రహ్మప్రభావం గోచరిస్తుంది. మన ఈ బాహ్యప్రపంచం అనిత్యమైనది. ఇది ప్రవాహ సదృశమైన సంసారము.

నిరంతరచలనము, పరిణామము దీనిధర్మం. జీవితపరమార్థాన్ని గ్రహించడానికికూడా ఇక్కడ అవకాశం లభిస్తుంది. పరిపూర్ణమైన మోక్షజ్ఞానం కలిగేదాకా మనం ఈ సంసార చక్ర పరిభ్రమణంలో పడివుండాల్సిందే. భౌతిక ప్రపంచంలోని చరాచరవస్తువులు అనిత్యం అయినా, అందు ప్రతిదానిలో బ్రహ్మ ప్రతిభాంశ కొంతకన్పిస్తుంది. పరమాత్మ ద్యోతక మయ్యే విధానాలలో ఒకటైన కారణాన ఈ జగతిలో మనం కలకాలం వుండవచ్చును.

## (2) మానవుని దురవస్థ

మనకు దృగ్గోచరమగునంత మాత్రమే జగత్తుకాదు. బాహ్యాగోచరము కాకయున్న అణువులోని అంతర్విశేషము, మానవునిలోని ఆత్మలను తెలిసికోవలెను. మనయందేగాక, సమస్త వస్తువులయందును అంతర్వీక్షణమువలన మాత్రమే తెలిసికొనగలిగిన ఒక సత్పదార్థము వున్నది. అదియే సత్యము - ఆత్మ. కావుననే, 'ఆత్మానంవిద్ధి' - ఆత్మను తెలిసికొనుము - ఆత్మను తెలియుటలో అన్నియును తెలియును అన్న ఉపనిషత్ప్రవచనము; నీ ఆత్మను తెలిసికొనుమా - అన్న గ్రీకుల తత్త్వసూక్తి ఆత్మజ్ఞానముయొక్క ప్రాధాన్య ప్రాశస్త్యాలను వేనోళ్ల చాటుతున్నై. తృణము మొదలు బ్రహ్మపర్యంతం సమస్త జగద్వస్తువులలో ఆత్మవుంది. అనాది నుండియు మానవుని పరిస్పందనలను, ప్రేరణలను - రహాస్య వర్తనాదికములను తెలిసికొనుట మతారాధకుల ఆశయము; జతనము. కాని, మానవప్రకృతి ఎన్నడును ఎఱుగరాని వైచిత్ర్యమే. సోక్రటీస్, ప్లేటో మున్నగు ప్రసిద్ధ తాత్త్వికులు

కూడా ఇట్లే అభిప్రాయమిచ్చారు. మానవుడు తననుగూర్చి పరిపూర్ణంగా ఎప్పుడూ తెలిసికొనలేదు. తన ప్రకృతిని తాను తెలిసికొనగోరినను, అతనికి తెలియుదానిని అతని ప్రకృతి అధిగమిస్తుంది. తన సామాన్యపరిశీలనకు అందని తత్త్వమది. ఆత్మ సుఖదుఃఖానుభవాలను, భావాలను మించినది. తన ప్రకృతిని - ఆత్మయొక్క - సత్యస్వరూపాన్ని తాను పూర్తిగా తెలిసికోగలనని మానవుడు అనుకోవడం వట్టి భ్రమమాత్రమే. మానవుని జీవితరహస్యాలను భగవంతునివలె తాము గ్రహింపగలమనే తాత్త్వికులను ప్లేటో మహాశయుడు అపహసిస్తాడు.

మానవుడు అంటే భౌతిక శరీర స్వరూపముమాత్రమే కాదు. మానవ మనస్తత్త్వశాస్త్రము శరీర శాస్త్రానికి కేవలం అనుబంధం మాత్రమే కాదు. మానవునిలో మామూలుగా కన్పించే బాహ్యప్రకృతి మాత్రమే కాక అతనికి ఒక అమూల్యమైన ప్రత్యేకత నిచ్చే అంతశ్శక్తివుంది. మానవుడు కేవలం ప్రేరణాత్మకజీవిగాని, భావవర్తనుడుగాని కాడు. అతనిప్రకృతి శారీరక - మానసిక - సాంఘిక వృత్తుల వల్లనే పరిపూర్ణంగా ద్యోతకంకాదు.

మతవిశ్వాస సముద్ధరణకై సూచింపబడిన వివిధములైన ఆధ్యాత్మిక - మాంత్రిక - సాంఘిక సూత్రాలు అన్నీ మానవుని ఏకాంతవాసభయాదికాలను నిర్జించడానికి మతం ఒకసాధనం అని చెప్పుకొంటై. అసలు మానవునకు భయం, ఏకాంత వాసక్లేశం ఎందుకు కల్గాలి అనేది ప్రశ్న. భయభ్రాంతుడైన మానవునితో సృష్టి అంతమౌతుందా, లేక అతనికి ఇంకొక గతి ఉన్నదా అనే విషయం విచారించాలి,

భారతీయ తాత్త్వికుల దృష్టిలో మతం అనేది మానవుని విజ్ఞాన విశేషానికి, అతని ఆత్మ సంవేదనపద్ధతికి, జగద్విచక్షణ గుణానికి సంబంధించి వుంటుంది. ఇతర జీవకోటికి లేని చైతన్య పరిజ్ఞానం అతని ప్రత్యేకత. చైతన్య పరిజ్ఞాన వివేచనలు అతనికి నైతికవర్తన- బాధ్యత లను కల్గిస్తవి. కామానికి కారణమైన అవిద్యలో చిక్కుకొని అతడు పతన మైనాడు. అయితే క్రమక్రమంగా పశుత్వం వదల్చుకొని ఆత్మ చైతన్యాన్ని సంతరించుకొనసాగాడు. కావుననే బుద్ధుడు సెలవిచ్చాడు- జీవితం దుఃఖమయము- అని. అసలు కర్మబద్ధమైనదే ఈలోకంలోని మనజీవితం.

మానవుని స్వబుద్ధి అతని ఆశలకు- అవ్యాజప్రేమకు మూలం. సమస్త ప్రాణికోటితో సామరస్యం చూపగల ప్రేమతత్త్వం అతనివాస్తవిక జీవనసూత్రం అయినప్పటికీ, ఈ సూత్రంతో అతనికి తఱచు సంఘర్షణమే. దీనిని నిరోధించడమే పునఃపునః జరుగుతూంటుంది. అతని బుద్ధి స్వాతంత్ర్యం దుర్వినియోగమై ఆత్మదాస్యంప్రాప్తించే నిరోధ తత్త్వం అతనిని ఆవరిస్తుంది. స్వాతంత్ర్య దుర్వినియోగం సిద్ధించి కూర్చుంటుంది. చెడుగు పిలిచినట్లు తలెత్తిచూస్తుంది. నిజానికి చెఱుపుచేయగల్గిన శక్తివుండియు మంచితనం చూపడాన్నే - సమర్థ సజ్జనత్వాన్నే - సౌజన్యం అనాలి. మానసిక స్వాతంత్ర్యం వున్నంతమాత్రాన చెడుత్రోవ పట్టడం కూడదు. ఆ స్వాతంత్ర్య దుర్వినియోగం మాత్రమే అందుకు కారణం అవుతుంది. ఈ లోపాన్ని భగవంతునికిగాని, మన గ్రహచారానికిగాని అంటకట్టకూడదు. ఇది కేవలం మనలోనే వుంది. మనం బాధ్యత, విచక్షణగల మానవులం. మంచిని

మాత్రం చేపట్టి, చెడుగును వర్జించగలం. ఇందుకు మనకు ఏ భౌతికశక్తులు నిరోధకాలు కావు.

మానవుడు మానసికాలోచనలో బడిన కొలదీ భద్రతలేమి తోస్తున్నది; అతడు నైతికంగా ఆందోళిత మనస్కుడు అవుతున్నాడు. ఆత్మపరిశీలనలో తన గతాన్ని తర్కించుకొని, తనలో తనకు నమ్మకంతొలగి నైరాశ్యాన్ని, దీనత్వాన్ని పొందుతున్నాడు. మానసికంగా దిగజారిపోయి ఆమరణాంతం దుఃఖ వ్యాధి బాధితుడౌతున్నాడు. ఏదో అవ్యక్తమైన భయము - రహస్యము అతనిని తఱుముకొని వస్తూన్నట్లు, తానేదో అశక్తుడు, అప్రయోజకుడు, అజ్ఞానుడు, అధర్మవర్తనుడు అయినట్లు భావించి బాధపడుతాడు. ఈ అభాగ్యుడికి కలిగే ఈ దురవస్థ కంతటికి కారణం అతనిలోపల సంఘటించిన సంఘర్షణేకాని, బాహ్యాశక్తులతో సంఘర్షణకాదు. ఈ విభిన్న - విక్లబచేతస్కుడు క్రుంగి కృశిస్తాడు. ఈ విభిన్నమానసిక తత్త్వముకంటె - ఈ ఆత్మ సంఘర్షణకంటె మించిన క్లేశం - అస్వాస్థ్యం - దుర్యోగం ఏమి వుంటుంది ?

ఔరా, మానవప్రకృతి ఎంత అద్భుతము! అదెక్కడి వింత, విపరీతము, వికృతము, విరుద్ధము, అవ్యక్తము!! మానవుడు విషయ విచక్షణకల్గియు దుర్బలుడు. భూమిని అంటిపట్టుకొన్న జీవి; సత్యనిధానము. అనిశ్చయతకు - అవగుణానికి నెలవు. అతడు విశ్వాసానికి విభవము, విసర్జితము గూడా - అన్న పాస్కల్ వచనము సుప్రసిద్ధము.

మానవుని ఆత్మపరిజ్ఞానము, యుక్తాయుక్త వివేచన అతనిని ఆధ్యాత్మికభావ పరిరక్షణకు ప్రోత్సహిస్తవి.

నాస్తికత్వంపోకక, భయాందోళనలు కలుగక, ఆస్తికత పాదుకొంటుంది. మానవుని మతపిపాస, అభిన్నతకు - పరిపూర్ణతకు అతడు జరిపే యత్నం, అతని ఉత్తమ జీవితాన్వేషణలనుబట్టి అతడు ఆధ్యాత్మికంగా పురోభివృద్ధి పొందుతున్నాడని చెప్పవచ్చును. అతడు తన విభిన్న మానసిక ప్రవృత్తికి అతీతుడై వర్తించాలి. భగవదంశారాహిత్యమనే భావమే భగవదంశకు సాక్షీభూతమౌతున్నది. ఇహలోకపు అనిశ్చయతయే పరలోకపు ప్రాపుకు - మోక్షసాధనకు - పరుగులెత్తించుతూన్నది.

భారతీయహృదయం ఎప్పుడూ భవబంధవిమోచనాన్ని ప్రబోధిస్తుంది. ఈ సంసార సాగరాన్ని దాటిగాని మనం మోక్షాన్ని చేరలేము. ఆ గమ్యస్థానాన్ని చేరేటందుకు మనకు అవకాశాలున్నై. కర్మసిద్ధాంత సంగతమైన సంసారంలో ప్రతిజీవికి ఆ ఉత్తమలక్ష్యాన్ని సాధించడానికి ఎంతో సావకాశంవుంది. కర్మఫలమే సంసారకారణం. తన ఆచరణ - స్వభావముల ఫలితముగ ప్రతివ్యక్తి రూపొందుతాడు. తనయందు అంతర్భూతమైవున్న ఆత్మబలంతో వానినతడు మార్చుకోగలడు.

మనం గమ్యస్థానంచేరువటుకు కర్మబద్ధులమే. మన ఆశయాలను, ఆచరణలనుబట్టి మన పురోగతి నిర్ణయమౌతుంది. మన గతకర్మనుబట్టి మన ప్రస్తుతస్థితి కల్గింది. అట్లే యిప్పటి కర్మనుబట్టి మన భవిష్యత్తు నిర్ణయమౌతుంది. మరణము, పునర్జన్మ మన ఈ గమనానికి ఆటంకాలు కావు. మన వర్తమానస్థితికి మనమే కారకులము. అంతియేకాని, భగవంతుడిమీదగాని, మన తలిదండ్రులమీదగాని, మన

సాంఘిక వ్యవస్థమీదగాని ఇందుకు బాధ్యతమోపరాదు. మన యిప్పటిస్థితికి మనమే ఎట్లు బాధ్యులమో, అట్లే మనము ముందు మనకు కావలెనని కోరుకొనుస్థితిని సాధించుకొనుటకు గూడ బాధ్యతమనదే. మనము ఇదేస్థితిలో ఉండిపోవలసిన అగత్యంలేదు. మనలో ధైర్యము, పట్టుదలఉంటే, క్రొత్త రూపంలో ఉజ్వలభవిష్యత్తును నిర్మించుకోవచ్చు. కర్మ విధి కాదు. మనం విశ్వాసంతో, పట్టుదలతో పనిచేస్తే ఫలితం ఏమైనా ఫరవాలేదు, మనం గమ్యస్థానంచేరడంలో ఏ కొంచెం ముందుకు సాగినా, అది వాంఛనీయమే. బాహ్య ఫలితాలు ఎలావున్నా, అందువల్ల అంతశ్శుద్ధి, ఆత్మతృప్తి కల్గుతవి.

## (3) మతము - పరమసత్యానుభూతి

సృష్టి చిత్రణ విశేషాలను, ఆత్మానాత్మవిచారణనుబట్టి శాశ్వతమైనట్టి, క్రియాస్వాతంత్ర్యంగల్గినట్టి పరమాత్మ స్వరూపం నిర్ణయమౌతున్నది. విషయ విషయీభేదాలు లేకుండా వున్న భోగట్టానుపట్టిచూస్తే ఇది భావైకవేద్యంగా కన్పిస్తుంది. అయితే పరమసత్యాన్ని భావోన్మీలనంలో దర్శించడంవేఱు, అనుభూతి పొందడంవేఱు. ఏభావమైనా, ఎంత విహితమైనా, అది అనుభవంలోనికి వస్తేనేగాని దాని సన్నిహితత్వం విశదంకాదు. కేవలం తర్క-వాదన, సిద్ధాంతాలూ మాత్రమే దేవుడున్నాడని ఋజువుచేయజాలవు. దైవదర్శనజిజ్ఞాస వాటితో తృప్తిపొందదు. అవి దైవాంశ స్వరూప నిర్ణయమార్గాన్ని, ఆత్మవిచారణమార్గాన్ని సూచిస్తై. అయితే, ఈ పరమసత్యాన్ని ప్రత్యక్షానుభూతం

చేసుకునే సంప్రదాయం అనాదిగావుంది. వివిధకాలములలో, వివిధప్రదేశములలో ఈ పరమసత్య సందర్శనానుభూతి పొందిన మహనీయులున్నారు. ఈ ప్రత్యక్షానుభవాన్ని ప్రసిద్ధ క్రైస్తవ సిద్ధాంతవిదుడు థామస్ ఎక్వినాస్ 'కాగ్నిషియో డి ఎక్స్పెరిమెంటాలిస్' అని అభివర్ణించాడు.

భగవంతునియొక్క సత్యస్వరూప నిర్ధారణ పరోక్షజ్ఞానమనీ, అనుభవం ప్రత్యక్షజ్ఞానమనీ ఒక ప్రాచీన సంస్కృత శ్లోకంలో నిర్వచింపబడింది. 'అహమ్బ్రహ్మాస్మి' - నేనే బ్రహ్మను - అనిన వేదద్రష్టసూక్తి, నేనే దేవదూతను అనిన ఏసుక్రీస్తువచనం, సత్యమన నేనే అన్న ఆల్ హలాజ్ ప్రవచనం ఒకేవిధమైన విషయాన్ని వెల్లడిస్తున్నై. ఈ మూడు మతముల ప్రవచనాలు ఒకేవిధంగా ఎంతో సన్నిహితంగా వున్నై. థామస్ ఎక్వినాస్ సాదృశ్యజ్ఞానాన్ని ప్రస్తావిస్తాడు. ధైర్యము, ఓర్పుమొదలైన ఏగుణాన్ని గూర్చిన విషయ నిర్ణయానికైనా సాధారణంగా రెండు పద్ధతులున్నై: ఆ సుగుణాలనుగూర్చిన స్వానుభవంలేని ఊహామాత్రపు పరిజ్ఞానవాదన ఒకపద్ధతి; అలాకాకుండా, ఆసద్గుణాలను స్వయంగా కల్గివుండి, ప్రదర్శించి తాదృశస్వరూపం పొందటం రెండవపద్ధతి. ఇదేవిధంగా భగవంతుని సత్యస్వరూప సందర్శనానికి వేదాంతశాస్త్ర పరిజ్ఞానమొకటీ అనుభవ జ్ఞానమొకటీ వుంటవి. ఇలా ఇది కేవల హేతుజ్ఞాన గమ్యం కాదు; అనుభవైకవేద్యము, సాక్షాద్దర్శనగమ్యము అని పండితుల ప్రవచనం.

ఈ ప్రత్యక్షానుభూతిభావం అనాదిగా వస్తున్నది. ఇది కేవలం ఒకజాతికిగాని, మతానికిగాని, వ్యక్తికిగాని

చెందినదికాదు. ఈ అనుభవజ్ఞాన సిద్ధాంతం మతంలోనూ - వేదాంతంలోనేకాక కళలో, ప్రకృతి సంసర్గపరిణతిలో గూడా కన్పిస్తుంది. మహత్తరమైన ప్రేమలో, కళాసృష్టిలో, వేదాంతభావవీథిలో, సత్యశివసుందరరూప సన్నిధిలో మన ఐహికబంధాలు సడలి శాశ్వతైక్యానుభూతి పొందుతాము. ఈ అంతర్వీక్షణానుభూతిలో విషయ విషయీభేదం అదృశ్యమై ఏకత్వంకల్గి - కామక్రోధాదిక భావాతీతస్థితిలో ఐహిక వాసనలు లేనట్టి ఉత్తమపదము పొందుతాము. ఆస్థిలో కాలగతివుండదు. నిత్యత్వం ప్రాప్తిస్తుంది. ఈ భౌతిక ప్రపంచపు ఛాయలు దాటితే మన సత్త్వ సమస్యలకుగాని, హృదయక్లేశాలకుగాని తావీయని అమృతము, అనిర్వాచనీయము, అనంతమునైన పరంజ్యోతిరూపం సాక్షాత్కరిస్తుంది. ఈ పరమసత్య స్వరూపానుభూతియే మోక్షం. మోక్ష ప్రాప్తితో భౌతికములైన అవధులు, అంతరిస్తవి. విభిన్నత్వం వీగిపోతుంది; పరధ్యానం పటాపంచలౌతుంది. అవిద్య అపురూపమౌతుంది; భవబంధవిమోచనం పరిఢవిల్లుతుంది. అట్టి సత్య - ఆనంద - దైవపదము పొందడమే జన్మరాహిత్యం.

నిజానికి మోక్షం - నిర్వాణం - దైవరాజ్యం అనేవి ప్రస్తుత జీవితస్థితిగడచిన తరువాతనే లభించును అనడంగాని, దీనికి దూరమై ఎక్కడో వున్నవి అనడంగాని సరికాదు. స్వర్గరాజ్యంఅనేది మానవుని మరణానంతరం చేరే విశ్రాంతి స్థలం అనడంగాని, అది ఎప్పుడో ఒకప్పుడు ఈ భూమికి వస్తుంది అనడంగాని కూడదు. అది ఆత్మాభివృద్ధితో కలిగే ఉత్తమచైతన్య పరిణామం. మనభౌతికజీవితానికి కట్టువడక

ఆత్మశక్తితో మనం ఇక్కడే మోక్షాన్ని సాధించవచ్చును. ఆత్మరాజ్యనైష్ఠిక పరిపుష్టిలో స్వారాజ్యం అందివస్తుంది.

అనుభూతి అపరోక్షజ్ఞానసాధకం అన్నంత మాత్రాన దానికి విలువ లేకపోలేదు. అపరోక్షజ్ఞానంగూడా సహేతుకం, సమర్థనీయంగా వుంటుంది. అసలు జ్ఞానము, విజ్ఞానము అవినాభావసంబంధం గలవి. అవి రెండూ ఏకముఖంగా వర్తిస్తవి. భగవద్గీతలో చెప్పబడినట్లు మనం ఎప్పుడూ విజ్ఞానసహితమైన జ్ఞానాన్ని అర్థిస్తాము. ఆ జ్ఞానాన్ని సాధిస్తే అందే సమస్త లౌకిక వైదికవిద్యలు, భూత భవిష్యద్వర్తమాన పరిజ్ఞానాదికములు అంతర్వ్యాప్తమై ఉంటవి. ఉపనిషత్తులు ప్రవచించిన సత్యాలు ధ్యానఫలితాలైనా, అవి సహేతుకంగా, తర్కసమ్మతంగా చెప్పబడినై. అసలు ఉపనిషత్తులు తత్త్వార్థ విమర్శను - మీమాంసను - ప్రబోధిస్తవి.

మేధాశక్తి అంతర్వర్తనములో ఒకభాగమే. పరిపూర్ణ అంతర్వర్తనము శాశ్వతత్వాన్ని వెల్లడిస్తుంది. ఆత్మ అనుభవ పూర్వకంగా గ్రహించే మహత్తరవిషయం సత్యం. అది పురుషుడు, ప్రకృతి - వీటి వైవిధ్యాన్నిగాక అవినాభావ సంబంధాన్ని తెల్పుతుంది.

కొన్నిరకాల ప్రత్యేక మనస్తత్వాలు కలవారిలో ఆధ్యాత్మిక అనుభూతికల్గితే దానితోబాటు మూర్ఛ, పరవశత, స్వయంకృతభాషణ - దర్శనాదిక విశేషాలు కల్గటం కద్దు. ప్రగాఢ మనోవికారంవల్ల ఇలా ఇతరలక్షణాలుగూడా ఎన్నైనా కల్గుతవి. దైవజ్ఞానసంబంధ గ్రంథాలు ఇలాంటి అనుభవప్రేరితులు వ్రాసినవే కావచ్చును. కాని, వట్టి మానసికోద్రేకం ఇందుకుచాలదు. ఈ అనుభవంలో కొన్ని

మానసిక విపర్యాసలక్షణాలు కన్పించినా, దీనికి రుజభావం ఆరోపించరాదు. అసలు ద్రష్టలు, వేదాంతులు ఉత్తమ మానసికారోగ్య సంపన్నులు. అప్పుడప్పుడుకల్గే దైహిక విపర్యయాలు తాత్కాలికాలు, ఆకస్మికాలు. స్తబ్దతనుండి చైతన్యానికి, అజ్ఞానంనుండి జ్ఞానానికి మారడం మనోఘాత మౌతుంది. చైతన్యరహితస్థితినుండి చైతన్యస్థితికి చేరడంలో కొంత కలత తప్పదు. తటాలున ఆ పరిణామంకల్గడంతో మానసికసమత వ్యత్యస్తమవటంకద్దు. ఏమైనా, చిత్తత్వపు అనుభూతికి పారవశ్యత, సంధి, అపస్మారము, ఆవేశము, ఉన్మత్తతాది లక్షణాలు అవసరానుబంధాలుకావు. ఆ అవస్థలు కృత్రిమ కారణాలవల్ల కలుగవచ్చు. సత్యస్వరూప సాక్షాత్కారమే అసలు అనుభూతి.

ఆధ్యాత్మిక తత్త్వానుభూతి మానసికావస్థల వైవిధ్యం వల్లకాక, ఆంతరంగిక పరిణామంవల్ల కల్గుతుంది. ఆనంద-శాంతాదిక గుణాఢ్యమై అది ఆత్మసిద్ధిచేకలిగే దివ్యప్రకాశం. అది ఆత్మకు-పరమసత్యసంవేద్యతకు సన్నిహితత్వం సమకూర్చే నూతనజీవిత వికాసం. ఆత్మ, బుద్ధి, భావప్రేరణాదిక వివిధశక్తులను సమన్వయపరిచే ప్రభావం. అది సామాన్య మానవులనుండి దైవాంశ ప్రభావాన్ని ప్రస్ఫుటంచేసే సర్వోత్కృష్టమైన తేజస్సును, వర్తనను వెలువరిస్తుంది.

---

# 5

## ఆధ్యాత్మిక జీవనము - మతములు

పరివర్తనశీలమైన ప్రపంచంనుండి పరమాత్మస్వరూప సాక్షాత్కారంపొందగల ద్రష్టల స్వానుభవాలే వివిధ

మతాలకు ప్రాతిపదిక. దేవుని సర్వాంతర్యామిత్వము, మానవేశ్వరైకత్వమే వివిధమతాలకు ఆనుపూర్వికంగా వస్తూన్న సామాన్య సిద్ధాంతము.

## (1) హిందూమతము

బ్రహ్మానుభవసిద్ధి మతముయొక్క పరమోద్దేశ్యమనేది అనాదిగా వస్తూన్న భారతీయభావవిశేషం. విద్య, అంతర్దృష్టి, జ్ఞానము ఉపనిషత్తుల పరమబోధామృతం. పరమార్థసత్యాన్వేషణము వాని ఆశయం. బ్రహ్మజ్ఞానము వానికి ఏకైకలక్ష్యం. దాని నెఱిగినచో జన్మజరామరణ బంధాలు వీగిపోతవి. అంతటితో మానవుని మేధాశక్తియేగాక ఇతర శక్తులన్నియు సమీకరణపొంది ధర్మప్రవర్తనలో నూత్న జిజ్ఞాస పొడముతుంది. సర్వోత్కృష్టము, పరమసత్యము నైన బ్రహ్మైక్యానందము గోచరిస్తుంది. మానవుని అంతరాత్మ ప్రబోధం ఈ అనుభూతి నిస్తుంది.

ఉపనిషత్తులు ఆత్మ - పరమాత్మల ఏకత్వాన్ని ఉద్ఘాటిస్తున్నై: ఆత్మయే బ్రహ్మము, బ్రహ్మమే ఆత్మ. మానవుడు ఎవ్వడైనా తాను వేఱు, దేవుడు వేఱు అనుకొని తన ఆత్మ స్వరూపాన్ని కాక వేఱే దేవుని ఆరాధిస్తే అతడు అజ్ఞానియే. సమస్తజీవకోటి స్వరూపము తానయైనట్టి, ప్రతిప్రాణి హృదయాంతరంలో వసిస్తున్నట్టి, అంతరంగ ప్రపంచానికి సర్వాధిపత్యం వహిస్తున్నట్టి, అందఱూ తెలిసికొననట్టి శాశ్వతము, సర్వాత్మకము, అద్వితీయమునైన పరమాత్మయే అతని ఆత్మ - అని.

ఈ సత్యాన్ని తెలియని మానవుడు కర్మబద్ధుడౌతాడు. దృగ్గోచరంకాని విభిన్నశక్తుల తాపులకు క్రిందుమీదౌతాడు. అతడు చేసేది ఏమీవుండదు; అన్నీ అవే సంఘటిల్లుతవి. మానవుడు విచిత్రజీవి. అతనిని ఇదమితమని నిర్వచించడానికి వీలుకాదు. ఈ సంయోగభావం దేహధారణాదికంవల్ల కల్గుతుంది. అనుకరణాదికంవల్ల కల్గే అలవాట్లు లక్షణాలు ఏవి ఎన్నిమారినా, పేరు అలాగే వుండటాన తాను ఎప్పుడూ ఒకేవ్యక్తిని అనుకొంటాడు మానవుడు. అతడు ఆత్మాను భవం పొందితే అప్పుడు స్వాతంత్ర్య చైతన్యాలతో నవజీవన లహరి సాగుతుంది.

బ్రహ్మైక్యమునకు పరబ్రహ్మను దేవుడుగా ఉపాసించే భక్తిమార్గాన్ని ప్రవచిస్తున్నది భగవద్గీత. శ్రీకృష్ణభగవానుడు అంటాడు అర్జునునితో – "మనస్సును నాయందుంచి నిత్య యుక్తుడై అత్యంతశ్రద్ధతో నన్ను ఉపాసించేవాడే పరమ యోగి. సర్వకర్మలను నాయందు సన్యసించి, మత్పరా యణుడై, అనన్యయోగంచేత నన్నుధ్యానించి ఉపాసించే వానిని నేను మృత్యుసంసార సాగరంనుండి ఉద్ధరిస్తాను. నాయందు భక్తిశ్రద్ధలుగలవాడే నాకు ప్రియుడు", – అని. ఆధ్యాత్మిక తత్త్వరహస్యము – పరమసత్యమునైన బ్రహ్మ సంస్పర్శ – ధర్మసంవాదమైన కృష్ణార్జున సంవాదం – ఇందుకు లక్ష్యం. ధర్మక్షేత్రమే దేహము, అందలి ధర్మాధర్మములకు, సత్యాసత్యములకు సంఘర్షణ జరుగుచునే వుంటుంది. తుదకు దైవికగుణాలకే విజయం. శ్రీ కృష్ణుడు అంటాడు – "సర్వ క్షేత్రజ్ఞులకు నేనే క్షేత్రజ్ఞుడను. క్షేత్రక్షేత్రజ్ఞులకుగల జ్ఞానమే జ్ఞానము. జ్ఞాననేత్రములచే ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల అంతరమును,

భూతప్రకృతిమోక్షమును తెలిసికొనువాడే పరమగతిని పొందును. ఏ క్షేత్రమున కృష్ణార్జునులు ప్రతిష్ఠింపబడుదురో ఆ క్షేత్రాధిపతికే జయము, మోక్షము కల్గును''- అని. భగవంతుని స్వయంప్రకాశమని పాశ్చాత్యతాత్త్వికులు వ్యవహరించిన ఆత్మ భగవంతుని తేజోంశమే కాబట్టి అది భగవంతునిలో ఐక్యమవుతుంది. గీత భక్తి ధ్యానముల ప్రాధాన్యమును వెల్లడిస్తూన్నది: "బ్రహ్మభూతుడైనవాడు ప్రసన్నాత్ముడై నాయందు నిశ్చలభక్తి కలిగివుండును. అట్టి పరమభక్తిచే నేనెవ్వరినో యెఱిగి నాయందుచేరును. అర్జునా! నాయందే మనస్సునుంచి, నాభక్తుడవై, నన్నుగూర్చి యజనము చేయుము. అట్లుచేసినచో నీవు నన్నే పొందుదువు. నాయందు భక్తిగలవాడే నాకు మిక్కిలి యిష్టుడు -'' అంటాడు శ్రీ కృష్ణభగవానుడు.

వైష్ణవమత సంప్రదాయాలలో రాముడు లేక కృష్ణుడు ఆరాధ్యదైవము. భగవత్సాక్షాత్కారమునకు భక్తిప్రేమలే సాధనములు. భక్తితత్త్వప్రబోధకులలో రామానందుడు, తులసీదాసు, చైతన్యుడు, తుకారామ్, మీరాబాయి మున్నగువారు సుప్రసిద్ధులు. వీరు భగవత్సన్నిధిని చేరడానికి - సాక్షాత్కారాన్ని పొందడానికి అంతరంగికమైన ఆకాంక్ష - ఆవేదన అవసరమంటారు. తల్లికొఱకు పరితపించే పసిపాపవలె భక్తుడు భగవంతునికోసం ఆరాట పడతాడు.

తల్లి కన్పించక పాప తల్లడిల్లి వాపోతుంది;
నీటిలోనుండి బైటపడవేస్తే చేప గిజగిజలాడుతుంది;—
నాది అదేస్థితి ... —

అంటాడు తుకారామ్ తనభక్తి తత్త్వాన్ని ప్రస్తావిస్తూ.

మాణిక్క-వాసగర్, దాక్షిణాత్యులైన మఱికొందఱు శైవభక్తులు పరమేశ్వరుని శివరూపంలో ఆరాధిస్తారు. భక్తి మార్గమే ఈశ్వరసాన్నిధ్యానికి మార్గమంటారు.

కబీరు, నానక్, ఇతర శిక్కు-గురువులుగూడా భక్తి మార్గాన్నే ప్రబోధిస్తారు.

"నీటిలోవున్న చేప దప్పిగొన్నదంటే నాకు నవ్వు
వస్తుంది. నీలోనే వున్న పరమ సత్యాన్ని
తెలిసికోలేక పుట్టలను - గుట్టలను, అడవులను -
అంతరాలను పట్టి తిరిగితే ఏమిప్రయోజనం?
నిజము తెలిసికో. నీవు కాశీకివెళ్లినా,
గయకు పోయినా ఏమిలాభం? నీలోనే
భగవంతుడున్నాడనే విషయాన్ని తెలిసికో
లేకపోతే, ప్రపంచమంతా నీకు అర్థరహితమే
అవుతుంది ... —"

అంటాడు భక్తశిఖామణి కబీరు: 'మూఢమతివై ఎక్కడనో కొండలలో, గుట్టలలో ఎందుకు అన్వేషిస్తావు; నీ ప్రభువు నీదగ్గఱనే వున్నాడుసుమా'—అని అతని ప్రబోధం.

ఆధునిక తత్త్వవేత్తలలో రామకృష్ణపరమహంస, దేవేంద్రనాథఠాకూర్, రమణమహర్షి సుప్రసిద్ధులు.

మానవసంఘపు పునరుజ్జీవనము, ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధము హైందవ మతాశయము. మతమనేది ముఖ్యంగా పునర్జన్మ - ద్వితీయజన్మ - అనవచ్చు. అయితే ఈ పునర్జన్మ దైహికంకాదు; ఆత్మకు సంబంధించినది. ఇది నూతనమైన, సర్వోత్తమమైన జ్ఞానసముపార్జన. మానవుడు కాలనియమము, శాశ్వతత్వము అనే రెండు విభిన్నదశలకు చెందినవాడు.

ఈ రెండు దశలకు స్వభావంలో భేదమున్నది. కాలగతిని పెంచిన మాత్రాన నిత్యత్వం ప్రాప్తించదు. ఎంతటి ఖ్యాతి కానుభవమైనా శాశ్వతమైన మోక్షమార్గానికి సాధకంకాదు. మనం కాలగతికి అతీతమైన పరమసత్యాన్ని ప్రత్యేకంగా అన్వేషించాలి. దైవభావం దేశకాలాలకు, రూప పరిణామాలకు అతీతమైనది ; అనంతమైనది.

ఆధ్యాత్మికజీవన విధానంలో ముఖ్యమైన ధ్యానాదికాలు యోగసూత్రాలలో విపులీకరింపబడినై.

హైందవ, బౌద్ధ, జైన, శిక్కు, క్రైస్తవ, ఇస్లామ్ మతాలు భక్తిప్రబోధంకంటె ఎక్కువగా మోక్షసాధనను ప్రబోధిస్తున్నై. ఈ నాటికిని వివిధమతారాధకులు ఈ ఉత్తమ యోగసాధననే ప్రవచిస్తూన్నారు. ఆత్మపరమాత్మైకరూపమైన తత్త్వసమన్వయాన్ని ప్రబోధిస్తున్నారు.

## (2) టావో మతము

లావోషి కాలానికి (క్రీ. పూ. 6-వ శతాబ్దం) పూర్వమే టావోయే పరమసత్యమని, అది స్వర్గంకంటె ఉన్నతమైనది, ముందటిది, అతిప్రాచీనమైనది అని చైనీయులు విశ్వసించేవారు. టావో అనేదాన్ని అద్వైత వేదాంతుల బ్రహ్మపదార్థంతో పోల్చవచ్చును. అది నిత్యము, పరిణామరహితము, అవిరతమునై వుంటుంది. సృష్టికంతటికి అది మూలకారణం. అదియే సృష్టికర్తగా, విశ్వజగత్తుగా రూపొందింది. అదే దృశ్యమాన ప్రపంచానికి అంతటికి మూలాధారము. దానిననుసరించినదే జగత్పరిణామం. సమస్తవస్తువులు పుట్టునది టావోయందే. సమస్తవస్తువుల గమ్యస్థానము టావోయే.

టావో సిద్ధాంతాన్ని పరిపూర్ణంగా చెప్పడానికి ఏ పేరూ చాలదు. అది ఏకైకమార్గం - అనవచ్చు. అది అభౌతికము, వర్ణరహితము, శబ్దరహితము. టావోనుండి సర్వసృష్టికి ప్రప్రథమమైన దివ్యశక్తి, అందుండి యాంగ్ (పురుషుడు), ఇన్ (స్త్రీ) - వెలుగు, ఛాయ - కలుగుతవి. వాటివల్ల స్వర్గము, భూమి, మానవుడు ఉద్భవిస్తారు. వీరి అన్యోన్యక్రియా శాలిత్వఫలితమే విశ్వజగత్తు.

స్వరూపరహితమయ్యు టావో ప్రతి మానవునిలో అంతర్గతమైవుంది. మనం శాంతిని పునరుద్ధరించాలి అంటే టావోను అన్వేషించాలి.

టావోతో సాయుజ్యమే మోక్షం; అదేగమ్యం. ఆత్మనిగ్రహంద్వారా అది లభ్యమౌతుంది. టావో మతానికి పరమార్థం ఇదే. ఈ సాయుజ్యం సంప్రాప్తిస్తే శాంతి వర్ధిల్లుతుంది. టావోతో సాయుజ్యం సాధించగల మానవుడికి ఇతర సమస్తవస్తువులతో సామరస్యం, సన్నిహితత్వం ప్రాప్తిస్తవి.

కేవల నీతిసూత్రాలు కాక ఆంతరంగిక ప్రపంచంలో కల్గే టావోయొక్క సత్యసహజానుభూతియే వాస్తవిక సద్ధర్మము, సుశీలత. ఆదిమూలమైన టావో కల్గడంతో జ్ఞాన - ధర్మ - శీలములు సంఫుల్లమౌతవి.

ప్రతివారికి టావో సాధ్యమే. కాబట్టియే ప్రతివ్యక్తి ఇతరులయెడ సౌజన్యం, సౌమనస్యం, కారుణ్యం ప్రకటించాలి. మంచివారియెడ మంచితనము చూపుటయే కాదు; వారికి మంచితనం నేర్పడానికై మంచివారుకాని వారి యెడకూడా మంచితనం చూపాలి.

చైనాలో టావోమతం బహుళ ప్రచారం పొందింది. బౌద్ధం నేటికీ ప్రధానమతంగా వుంది, బౌద్ధంలో ధ్యాన మార్గానికిగూడా కొంత ప్రాధాన్యంయిచ్చారు. చైనా దేశంలో టావో. బౌద్ధమతాలకు సంబంధించిన పెక్కురు తాత్వికుల ప్రసిద్ధ ప్రవచనాలు వెలసినై.

## (3) జూడామతము

దైవసందేశం ప్రవక్తలద్వారా వచ్చిందని హీబ్రూ జాతివారి నమ్మిక. మతగ్రంథాలలోని ఉపదేశంయొక్క యాథార్థ్యము అనుభవంలో వ్యక్తమౌతుంది. శిఖరాగ్రం నుండి మోసెస్, గుహాంతరంనుండి ఎలిజా భగవంతుని దర్శించారనేది ఇందుకు నిదర్శనంగా చెప్తారు. ఒకదుబ్బులో అగ్నిజ్వాలలోనున్న దేవదూతదర్శనం అయింది మోసెస్‌కు. మోసెస్ తదేకదృష్టితో చూచాడు. అంతమంటలో కాలినా, దుబ్బు దుబ్బుగానే వుంది. మోసెస్ ప్రక్కకుతిరిగి ఆచిత్రానికి కారణం అరయచూచాడు. దేవదూత అక్కడి నుండియే అంటాడు మోసెస్‌తో - "అలాగేవుండు. దగ్గఱకు రాబోకు. పాదరక్షలు వదలివేయి. ఈస్థలం పరమ పవిత్ర మైనది" - అని. ఆ మాటలువిని మోసెస్ తలవాల్చాడు; దేవదూతను చూడడానికే కంపించాడు - అంటూ ఎక్సోడస్ అనే గ్రంథంలో అభివర్ణితమైనది. ఐసయ్య పొందిన దేవ సందర్శనంలో భగవంతుని సమస్తగుణరూప పరిపూర్ణత్వం వర్ణితమైనది. గీతలోచెప్పిన విశ్వరూపానికీ, దీనికీ పోలిక కన్పిస్తుంది - అర్జుననకు విశ్వరూపమున సచరాచరమైన సర్వజగత్తు, దేవతలు, భూత విశేషసంఘము, బ్రహ్మ, ఋష్యాదులు కన్పించిరి. అనేకముఖనేత్ర బాహూరుపాదోదర

దంష్ట్రాకరాళములుగల దేహముతో భూమ్యాకాశముల మధ్య సమస్తము నాక్రమించిన దివ్య తేజోరూపమది - అనికదా గీతలోని విశ్వరూప సందర్శనయోగములో చెప్పబడినది. అవిచ్ఛిన్నంగా భగవంతుని తేజోరూపాన్ని సువ్యక్తం చేసేదే ఈ విశ్వం.

"స్వర్గంలో నీవుతప్ప నాకింకెవ్వరున్నారు ప్రభూ!
ఈ లోకంలో నిన్నుతప్ప నేనింకెవ్వరిని అభిలషిస్తాను
ప్రభూ! ప్రభూ! నిన్ను నేను మనసార ప్రేమించి,
అనంతమైన భక్తితో అంజలిస్తున్నాను. కాబట్టియే,
నీకరుణామృతాన్ని నేను ఆస్వాదిస్తున్నాను" -

అంటూన్న భక్తిగీతంలో భగవంతునికై మానవుడు - భక్తుడు - చూపే తనివితీరని తృష్ణ వెల్లడౌతూన్నది.

యూదుల ఆధ్యాత్మిక తత్త్వాన్ని ముఖ్యంగా వారి మతగ్రంథమైన జొహార్ వెల్లడిస్తూంది. జగత్తు అంతా భగవత్ స్వరూపమే అంటారు. భగవంతుడు నిరాకారుడు, నిర్గుణుడు. అతడు ఇలాంటివాడు అని చెప్పడానికి వీలులేదు. జగత్తు దశగుణాలతో భగవంతుని సంబంధంపొందుతుంది. అందులో మొదటిది, ప్రధానమైనది భగవంతుని ఆదిమ సంకల్పం. అందు అనంతము, బహుముఖమునైన సృష్టి నిర్మాణక్రమం వుంటుంది. రెండవది విజ్ఞానం; మూడవది జ్ఞానం. వాటికి అన్యోన్య సంబంధం వుంది. విజ్ఞానం పుంలింగంగా తండ్రిభావం పొందుతుంది. దీని క్రియాశాలిత్వంవల్ల సమస్తవస్తువులకు స్వరూపాదికములు యిస్తుంది. జ్ఞానం స్త్రీలింగంగా తల్లిభావం పొందుతుంది. వీటి కలయికవల్ల కల్గి సుతభావం పొందేది హేతువు.

ఇది మాతృపితృభావాలు రెండింటికి ప్రతిబింబం. కారుణ్యం, న్యాయం, సౌందర్యం, విజయం, ప్రకాశం, స్థాపన, ఆధిపత్యం తక్కిన గుణసప్తకం. జొహార్ భగవత్ ప్రార్థనకుగల పాటవాన్ని - భౌతిక ప్రపంచంలోగూడా వలసిన మార్పులు కల్పించగల శక్తిని - ఉద్ఘాటిస్తుంది. యూదులు మధ్యయుగీన తాత్త్వికవేత్తలలో మెయిమోనైన్స్, బరూక్‌స్పినోజాల రచనలు ప్రసిద్ధములు. స్పినోజా రచన ఎథిక్స్ మతనైష్ఠికులకు చాల ప్రధానమైనది.

## (4) గ్రీకు మతము

ప్రాచీన గ్రీకుమతంలోనున్న 'హోమరిక్, మిస్టిక్' వాద తరంగిణులు రెండూ తత్త్వవిశారదులైన ప్లేటో, ప్లాటినస్ సిద్ధాంతాలల్లో కలిసిపోయి ఏకముఖంగా ప్రవహించినై. ప్లేటో సిద్ధాంతం ప్రకారం భగవంతుని సారూప్యం పొందడమే జీవిత పరమావధి. నిజమైన పవిత్రత అంటే భగవంతునితో సాహచర్యమే. సెయింట్‌పాల్ కీర్తన గ్రంథంలో, నాల్గవ సువార్తలోని ఉపదేశ, దైవప్రసాదిక మత కర్మలలో ప్రాచీనగ్రీకు మతప్రభావం కొంత కన్పిస్తుంది. ప్రాచీన మతకర్మలు - ఉత్సవాలులోని కొన్ని విశేషాలను గ్నాస్టిక్ తెగలవారు అనుసరించడంగూడా కన్పిస్తుంది.

ప్లాటినస్ (క్రీ. శ. 205-270) తన సిద్ధాంతం ఏమీ నూతనంకాదు అంటాడు. అనాదిగావున్న సిద్ధాంతమేయిది. అయితే యిప్పటివఱకు దీనిని వివరంగా బోధించినవారు లేరు. నిజానికి ప్రాచీన ప్రవక్తల సిద్ధాంతాలను వివరించడమే మా ఆశయం. ప్లేటో భావాలను బట్టియే ఈ విషయం

ఋజువౌతుంది. ప్రాచీన ప్రవక్తల భావాలకు, మా భావాలకు భేదంలేదు—అని అతని వివరణ. ప్లాటినస్ నాల్గుసార్లు భగవద్దర్శనం పొందినట్లు చెప్తారు. నా ఆత్మ విశ్వాంతర్గతమైన దైవంలో ఐక్యముపొందనున్న ఈ అంతిమక్షణంలో నీ కోసం ఎదురుచూస్తున్నాను—అన్నది తన మిత్రుడు, వైద్యుడునైన ఈస్టోకియస్‌తో ప్లాటినస్ అనిన చరమవాక్యం. అతని తాత్త్వికభావసారం అంతా ఈ చిన్నవాక్యంలో ఇమిడివున్నదనవచ్చును.

పరమసత్యం ఇంద్రియగోచర పదార్థాలకు, జీవితానికి అతీతంగా వుంటుంది. స్థితికి అతీతమై పరమజాగ్రదవస్థలో వుంటుంది. అది పరిపూర్ణత్వమే. సౌదర్యభావం కాదు, సౌందర్యమే. దైవత్వానికి, దేవుడికి భేదంచూపాడు ప్లాటినస్. మనం ఆరాధించే దైవం భగవదావిష్కరణమే, కాని భగవంతుడుకాదు. ఈ ఆవిష్కరణకు మూలాన్ని తెలియలేము. జ్ఞానానికి లక్ష్యం భగవంతుడు. మనస్సుకు లక్ష్యం సౌమనస్యం. ప్రేమకు, ఆనందానికి లక్ష్యం సౌదర్యం. డబ్లు. ఆర్. ఇంగే పండితుని మాటలలో చెప్పాలంటే—పరమాత్మ ఉండాలి అనేది గతి తార్కికవాదం; పరమాత్మ ఇలా వుండకతప్పదనేది నైతికదృష్టి; పరమాత్మను తెలిసికొనగల్గినది ప్రేమధ్యాన తత్త్వదృష్టి. మన అంతరాంతరంలో పరమాత్మ వున్నందున మనం పరమాత్మను తెలిసికోగలము. ఇలా తెలిసికోగల్గేది ఆధ్యాత్మికోపాసనవల్లనే కాని, హేతువాదంద్వారా కాదు. అయితే, తరువాత దానిని హేతువాదన దృష్ట్యా వివరించవచ్చు. అంతర్జ్యోతి సాక్షాత్కరిస్తే ఆత్మకు సత్యానుభూతి కల్గిందనాలి. మనసార

ఆశించి, ఆత్మచైతన్యంపొంది ఆరాధించే భక్తునికి సాక్షాత్క-రించే దివ్యజీవనం ప్రసాదించే భగవంతునిగూర్చి మనకు విశ్వాసం తప్పదు. ఇలా పరంజ్యోతి సాక్షాత్కారం, సూర్యుని ఇతర దీపిక సాహాయ్యంతో కాక అతని వెలుగు ద్వారానే చూచునట్లు - పరంజ్యోతిని పరంజ్యోతిమూలము ననే చూచుట - ఆత్మోపాసనకు పరమలక్ష్యం. అద్వితీయ మైన ఈ అనుభూతి - ఆనందము సులభసాధ్యం కాదు; నిరతిశయమైన తత్త్వసాధనవలన మాత్రమే కల్గుతుంది. గ్రీకు తత్త్వశాస్త్ర పారంగతులు పొర్ఫిరీ, అయాంబ్లికస్, ప్రాక్లస్ మొదలైనవారు ప్లాటినస్ సిద్ధాంతాల ననుసరించి ప్లేటో నవతత్త్వం (నియోప్లేటోనిజమ్) అన్న తాత్త్విక మార్గాన్ని ప్రచారానికి తెచ్చారు.

## (5) జొరాస్ట్రియన్ మతము

జొరాస్ట్రియన్ మతస్థులు అల్పసంఖ్యాకులే - అయినా, జొరాస్టర్ బోధించిన వారిమతసిద్ధాంతాలు ప్రముఖంగా, విశ్వవ్యాప్తంగావున్నై. మానవజాతి పాపపంకిలంలో పడ కుండా సముదరించడానికై భూదేవి ప్రార్థనాఫలితంగా జొరాస్టర్ జన్మించాడు అంటారు. తమ ఆజ్ఞల నన్నిటినీ పాలించినవాడు జొరాస్టర్ ఒక్కడే అని అహూరా మజ్డా ప్రవచనం. అహూరా మజ్డాను గూర్చి జొరాస్టర్ తదేక ధ్యానంలో వుండటం పిశాచాధిపతి - ఆంగ్రోమిన్యూ - గమనిం చాడు. జొరాస్టర్ యొక్క నిష్ఠను చెడగొట్టి, బుద్ధిమళ్లించి పతనంచేయాలి అని అతని వుద్దేశ్యం. అహూరా మజ్డాను గూర్చిన ఆలోచన - విశ్వాసం - విరమిస్తే జొరాస్టర్ కు

ప్రపంచాధిపత్యం యిస్తానంటాడు. ఈ దుష్ప్రయత్నం తెలిసికొన్నాడు జొరాస్టర్. ఆహూరావైర్య మనే ప్రసిద్ధ మంత్రోచ్చాటనం చేసాడు. అంతటితో పిశాధిపతి నిలువలేక పలాయనం చిత్తగించాడు - అని ప్రతీతి. ఈ కథ జొరాస్టర్ జరిపిన సత్య - ధర్మ - అన్వేషణలో అతనికి కల్గిన కష్టం, అసత్యాన్ని - అధర్మాన్ని నిగ్రహించడానికి అతడు ప్రదర్శించిన శక్తి ప్రతిభలు వెల్లడిస్తూన్నది. ఈ ద్వైతం - ఈ విరుద్ధ శక్తుల సంఘర్షణ - మానవుని ప్రకృతిలోనే వుంది. దుష్ట శక్తులు బాహ్యజగత్తులోగాక మానవునిలోనే వున్నై. అతనిలోని దుష్టశక్తులే అతని దురాలోచనలకు, దుష్కృత్యాలకు ప్రేరేపణ కల్పిస్తవి. వాటికి లోబడితే అభివృద్ధి అంతరించి అతడు పతనమౌతాడు. స్వార్థం, ద్వేషం, అహంకారం, బాహ్యరూపాల బండారాలనే పరమసత్యమని నమ్మే అజ్ఞానం - అనే ఈ దుష్టశక్తుల సమష్టిరూపమే సైతాన్. జొరాస్టర్ ఈ దుష్టశక్తులకు లోనుకాలేదు. సైతానును నిగ్రహించి జయించాడు. దీనినిబట్టి మానవుడు తనవిధికి తానే కారకుడౌతాడు అని స్పష్టమౌతుంది. దుష్టశక్తుల సమష్టిరూపాన్ని ప్రాచీననిబంధన గ్రంథంలో సైతాన్ అని పేర్కొన్నారు. జొరాస్ట్రియనుల మతగ్రంథమైన జెండ్ అవెస్తాలో చెప్పబడిన ఆంగ్రొమిన్యూకు - ప్రాచీననిబంధన గ్రంథంలో చెప్పబడిన సైతాన్‌కు ఎంతైనాపోలిక కన్పిస్తుంది.

సమస్తచరాచర ప్రపంచానికి అధినాథుడైన పరమేశ్వరుడు ఆహూరా మజ్‌డా. పురుషుడు, ప్రకృతి ఉద్భవించింది అతని నుండియే. అతడు పితృభావంలో కల్గిన దివ్యతేజోంశత్రయం, మాతృభావంలో కల్గిన దివ్యతేజోంశ

త్రయం కలిసి విరాజిల్లే నిత్యపరిపూర్ణమూర్తి. వీనిలో మొదటి తేజోంశము ఆషా. ఇది సృష్టి చిత్రణమును కల్పించిన భగవత్ సంకల్పాన్ని సూచిస్తుంది. సత్యానికి, ధర్మానికి చిహ్నం. రెండవది వోహుమనో- పరమేశ్వరుని ప్రేమను తెల్పుతుంది. మూడవది క్షాత్రమను పరమేశ్వర సృజనాత్మకశక్తి సూచకం. మాతృభావాత్మకమైన ప్రేమ, వివేచనలు తెలియజేసే ఆర్మాయితి నాల్గవది. ప్రతివ్యక్తికి ఆశయమైన ఆత్మాభివృద్ధిని సూచించే హౌర్వతాత్తమనేది ఐదవది. అమరత్వాన్ని బలాన్ని సూచించే అమెరతాత్త మనే తేజోంశం ఆఱవది. ఈ ఆఱు భగవంతుని నిత్యసుందర రూపంలో కలిసివున్న తేజోంశములే కాని, ప్రత్యేకగుణాలు గాని భావాలుగాని కావు.

పరమేశ్వరునితో ఐక్యముపొందుటే పరమలక్ష్యం అంటాడు జొరాస్టర్. అందుకుమార్గం ఆషా. దానివల్ల పరిశుద్ధాత్మ ప్రాప్తిస్తుంది. ప్రభూ! ఆషా ద్వారముననే నీ దర్శనం లభించి, నీ సాన్నిధ్యం సమకూరి నీలో పరిపూర్ణైక్యభావము ప్రాప్తించాలి. ప్రభూ! ఆషాయే ఏకైక సత్యమార్గం; తక్కిన మార్గాలన్నీ మిథ్యయే-అని జొరాస్ట్రియన్ మతారాధకుల మహితోక్తి.

జెండ్ అవెస్తాలో చెప్పబడిన ఆషా, వేదాలలో చెప్పబడిన ఋత్ పదాలు రెండూ ఒకేభావాన్ని వ్యక్తీకరిస్తూన్నై. ఇండోఆర్యనులు, ఇరానియనులు చీలిపోవక ముందు ఇందలిభావం పూర్తిప్రచారం, అభివృద్ధి పొందింది.

ప్రకృతిఅంతా నియమబద్ధంగా నడుస్తుంది. నియమబద్ధమైన సృష్టి చిత్రణ సూత్రాలు పరమేశ్వర సంకల్పానుకూలంగా రూపొందినై. ఆషామార్గాన జగత్తు తన లక్ష్యానికి పురోగమిస్తుంది. ఆషామార్గపు పరమరహస్యం-విజ్ఞానం తెలిసికొని అనువర్తించేవారు జ్ఞానులు. స్వప్రయోజనం కారణంగా కాక, పరమేశ్వరునియందుగల భక్తిప్రేమల ఫలితంగాచేసే సత్కార్మలవల్లనే మనకు సౌఖ్యము, ఆనందము సంప్రాప్తిస్తవి. స్వార్థరహితవర్తనంవల్ల మానవులు ఆత్మోన్నతిపొంది జగత్కళ్యాణానికి సహకరించ గల్గుతారు.

జొరాస్ట్రియన్ మతము భూతదయను ప్రబోధిస్తుంది. కాబట్టియే, ఈ మతస్థులలో సదాచారపరులు ప్రతిమాసంలో నాల్గురోజులు (2, 12, 14, 21) మాంసాహారం వర్జిస్తారు. కొందఱు సంవత్సరంలో పదునొకండవ మాసమంతా మాంసం ముట్టరు.

తనసిద్ధాంతాలను అనుసరించేవారికి పరమేశ్వరునిలో ఐక్యముపొందే శాశ్వతత్వం లభిస్తుంది అని జొరాస్టర్ ప్రవచనం. జిజ్ఞాసువులకు అతడుచెప్పే రహస్యమిది. కల్పాంతం వఱకు ధర్మానికి అధర్మానికి సంఘర్షణ వుంటూనే వుంటుంది. కడకు ధర్మమే జయిస్తుంది; అధర్మం నశిస్తుంది. ధర్మం చ్యుతిలేక సర్వశక్తిమంతమై విశ్వవ్యాపితమై శాశ్వతమై వర్ధిల్లుతుంది. ప్రగతిశీలమైన ఈ ప్రపంచం సముద్ధరింపబడి పునరుజ్జీవన వికాసం పొందుతుంది అని జొరాస్టర్ ప్రబల విశ్వాసం.

ఆషా మార్గాన వర్తించి జగదధినేతయైన అహూరా మజ్డాను తెలిసికొనుటకు ప్రార్థన-ధ్యానములతో పరిశుద్ధ

మైన ఆత్మ, నిర్మలమైన వర్తన సంతరించుకోవాలి. గమ్యాన్ని చేరినప్పుడు శాంతి ఐక్యభావములు సిద్ధిస్తవి. అనిర్వచనీయమైన ఆత్మానందం కల్గుతుంది.

## (6) బౌద్ధ మతము

క్రొత్తమార్గాన్ని కనిపెట్టాననిగాని, క్రొత్తమార్గం బోధించడం తనమతమనిగాని బుద్ధుడు అనలేదు. ప్రాచీనమైన మార్గం—పూర్వం జ్ఞానులు అనుసరించినబాట తెలిసి కొన్నాను; దానినే అనుసరిస్తాను—అంటాడు. సనాతన సంప్రదాయ ధర్మాన్నే యుగావసరోచితంగా సమన్వయించి అతడు నూతన దృక్పథంలో బోధించాడు. అతడు జ్ఞానో దయాన్ని—బోధిని—గూర్చి ప్రస్తావిస్తాడు. అది పరమ సత్యముతోడి ప్రత్యక్ష సంబంధ సంస్పర్శనము. అది వట్టి ఊహామాత్రవాదజ్ఞానంకాదు; పరమసత్యాన్వేషణలో—నిత్యవస్తుతత్త్వజ్ఞాన సముపార్జనలో కలిగే ఫలితం; కామాన్ని, జీవనతృష్ణను సమూలంగా త్రుంచివేసే ఉత్తమజ్ఞానం. అది పరిపూర్ణజ్ఞానజ్యోతి దర్శనమునకైన అచంచలధ్యాన నిష్ఠా ఫలితం.

ప్రవాహసదృశమైన ఈ ప్రపంచంలో ఆత్మ అనేది లేదు. మనము తెలిసికొను దృశ్యమాన ప్రపంచంలోని ప్రతి పదార్థము అనాత్మయే (అనత్తా). దేహము, ఇంద్రియ వ్యాపారము మొదలగునవి అన్నియు అశాశ్వతములే, దుఃఖహేతువులే. అవియన్నియు అనాత్మరూపములే. అయితే, దీని కంతటికి అతీతమై, జీవనతృష్ణ—దుఃఖము—కష్టములకు అతీతమై అఖండసత్యం వున్నది. దానిని పొందడానికి

బాహ్యాకర్మలు ఏవీ సాధనాలుకావు. మానవుడు అజ్ఞాన భావంలో వుండి తన యథార్థస్వరూపాన్ని విస్మరిస్తాడు. దృగ్గోచర ప్రపంచానికి వెనుకనున్న పరమసత్యాన్ని తెలిసికోడానికి అతడు యత్నించాలి; ధర్మదీక్షాపరత పొందాలి. ఆత్మమోక్షము నిరతిశయ సచ్ఛీలంమీద, నిరంతర సత్కార్మాచరణమీద ఆధారపడి వుంటుంది. అదియే మానవునకు దివ్యజ్యోతి; సర్వ శరణ్యం.

ప్రజ్ఞఅనేది శూన్యభావాన్ని ప్రతిబింబించే దశ కాదు. అది పురుషుడు – ప్రకృతి అనే భేదభావానికి అతీతమైన చైతన్యము. అది మాండూక్యోపనిషత్తులో చెప్పబడిన తురీయావస్థ వంటిది. తురీయావస్థ ఏకత్వాన్ని గుర్తిస్తుంది. అది మనస్సుకు గోచరంకాదు. ఆత్మసాధనకు పూర్ణఫలమైన సర్వైక్య భావముయొక్క అనుభూతి అందు కల్గుతుంది.

బౌద్ధమత వాఙ్మయంలో ప్రతీత్యసముత్పాదవాదం కన్పిస్తుంది. కార్యం, కారణం – ఈ రెండింటికీగల గతితార్కిక సంబంధం ప్రపంచ పరిణామానికి మూలం. మనకు నిత్యం క్రొత్తదనం కన్పిస్తున్నా, అది కేవలం క్రొత్తదనంకాదు. నిరంతర పరిణామంలో అనంతమైన క్రమపద్ధతిగూడా యిమిడియున్నది. ఏదో క్రొత్తఘటన ఎప్పుడూ కల్గుతూ వుంటుంది; ఏదో ఒక ఘటన నశిస్తూ కాలగర్భంలో కలిసి పోతూ వుంటుంది. ఆద్యంతాలులేనిది ఈ నిరంతర పరిణామం; ప్రవాహ సదృశమైన ప్రపంచ ధర్మం.

బుద్ధుడు ప్రతిపాదించిన నిర్వాణం నైతికసూత్ర బద్ధమైనది. జీవనతృష్ణ, ద్వేషము, అజ్ఞానము ఉపశాంతి పొందిన ఉత్తమదశయే నిర్వాణం. ఉపనిషత్తుల ధోరణిని

కొంతవఱకు అనుసరించి తథాగతుడుగూడా కేవల మతకర్మల కలాపాన్ని గర్హిస్తాడు. అంతరంగ నైర్మల్యనియమాల ప్రాముఖ్యమును శాసిస్తాడు. బాహ్యాడంబరత ప్రయోజనకరం కాదంటాడు. 'కావిగుడ్డలు కట్టినమాత్రాన కామద్వేషాలు తొలగిపోతవి అంటే, మరి పసిబిడ్డ పుట్టగానే అతనికి కాషాయాంబరాలు కట్టి అతడు రాగద్వేష రహితుడైనాడు అనవచ్చును కదా? అలా అంటే, అది నిజమౌతుందా?' అని ప్రశ్నిస్తాడు. ఖచ్చితంగా 'కాదు'- అని సమాధానమిస్తాడు.

బుద్ధుని సిద్ధాంతాలలో ఉపనిషద్ధర్మాల ఛాయలు కొన్ని కన్పిస్తాయి. ప్రాచీన ధర్మాలను పెక్కింటిని అతడు వివరించి నియమబద్ధంగా నూతన దృక్పథంలో పునర్నిర్మాణం చేశాడు. ప్రపంచం అనిత్యమనియే బుద్ధుని సిద్ధాంతంగూడా, మనం కోరికలను వర్జించాలి అని అతనిప్రబోధం. జీవన తృష్ణకు ఏలాంటి ప్రోత్సాహం కూడదంటాడు. సమిధలు లేకుంటే అగ్ని చల్లారిపోతుందికదా? కామము- ద్వేషము - అవిద్యలనుండి విముక్తియే నిర్వాణం. నిర్వాణప్రాప్తివలన నశించేది తృష్ణకాని జీవితం కాదనాలి. మహాజ్ఞాన ఫలిత మైనట్టి - అనంతము, శాశ్వతము, అఖండ ప్రమోదభరితము నైనట్టి పావన చిత్తశాంతి సుఖదుఃఖాతీతమైన అనిర్వచనీయ మైన దివ్యానందానుభూతి. స్వతంత్ర ధర్మజీవనమును, విచక్షణాన్వితమైన నిర్మలదృష్టిని, అచంచలమైన చిత్తశాంతిని బుద్ధుడు ప్రబోధిస్తాడు.

నిర్వాణం అనేదాన్ని బుద్ధుడు సమగ్రంగా నిర్వచించ నంత మాత్రాన అది శూన్యమనిగాని, అయోగ్యమనిగాని అనరాదు. ఏ నిర్వచనకూ అందని పరమోత్తమపద మది.

'ప్రపంచానికి ఆది యేది? అంతమేది? - ఈ వగైరా ప్రశ్నలు నిరుపయోగాలు; వాటిని కట్టిపెట్టండి; వాటినిగూర్చిన తర్జనభర్జనలవల్ల ముక్తిరాదు; మీధర్మాన్ని మీరు నిర్వర్తించండి,' అంటాడు తథాగతుడు. అతడు తన ధర్మచక్ర ప్రవర్తనలో ఏ సిద్ధాంతమైనా-అందులోని సత్యాన్ని స్వయంగా అన్వేషించి తెలిసికొననిదే - ఆమోదకరంగాని, ప్రయోజన కరంగాని కాదు అంటాడు. అందువలననే, అతడు తన పరినిర్వాణ సమయంలో ప్రియశిష్యుడైన ఆనందునితో అంటాడు: "తథాగతుడు మరణిస్తున్నాడు అనే విచారం కూడదుసుమా. పుట్టినది ప్రతిదీ గిట్టకతప్పదు. నీ ధర్మాన్ని నీవు సక్రమంగా నిర్వర్తించు. నేను తెల్పిన ధర్మాలేకాక ఇంకా తెలిసికోవలసిన ధర్మాలు ఎన్నోవున్నై. అవి అన్నీ మీరే తెలిసికోవాలి. మీకు మీరే మార్గదర్శకులు. సత్యాన్వేషణకు, ధర్మవిచారణకు - నిర్వహణకు ఇతరులమీద ఆధారపడరాదు"- అని.

బౌద్ధమతంలో మహాయానము, హీనయానము అను రెండు శాఖలు బయలుదేరినై. మహాయానమున క్లేశవాసనలు, జ్ఞేయవాసనలు తొలగి గమ్యస్థానం చేరడానికి - తథాగతుని పదవి పొందడానికి - విశ్వాసప్రార్థనలు అవసరమనీ, అందుకు బుద్ధుని కరుణోపదేశాలు అవసరమనీ అంటారు. బౌద్ధములోని అన్ని తెగలలో చిత్తైకాగ్రత సూత్రానికి ప్రాధాన్యంవుంది.

## (7) క్రైస్తవ మతము

ఏసుక్రీస్తు జీవితం - స్వీయానుభవం - దేవుని గూర్చిన ప్రత్యక్షజ్ఞానానికి ప్రబలతార్కాణం. అతని ధర్మవర్తనం, భవ్య

ప్రవచనాలు దైవాంశ సంభరితాలు. జెరూసలెముకు అతడు ప్రయాణించే సన్నాహంలో చూపిన సహనము, ప్రేమాదరములు తొణికిసలాడే నిగర్వభాషణము, ధర్మప్రబోధము అతని ఆత్మయొక్క పరమ పవిత్ర స్వరూపాన్ని వెల్లడిస్తున్నవి. అతడు శిష్యులతో అంటాడు: 'మీలో ఎవడు గొప్పవాడై యుండగోరునో అతడు మీ పరిచారకుడై వుండాలి. ఎవడు ముఖ్యుడై వుండగోరునో అతడు మీ దాసుడై వుండాలి. అదేరీతిగా మనుష్యకుమారుడు పరిచర్య చేయించుకోడానికి రాలేదు; పరిచర్య చేయడానికి, అనేకులకు ప్రతిగా విమోచన క్రయధనంగా తన ప్రాణాన్ని యివ్వడానికి వచ్చాడు'- అని.

సుప్రసిద్ధుడగు సెయింట్ జాన్‌ను గూర్చి ఏసుక్రీస్తు ఇలా అంటాడు: 'అతడు మానవలోకంలో అందరికంటె మిక్కిలి గొప్పవాడు; ప్రతిభావ్యుత్పత్తులుగలవాడు. అయినా, దేవుని రాజ్యంలోని పరిశుద్ధులలో మిక్కిలి తక్కువవాడు కూడా మనుష్యలోకంలోని మిక్కిలి గొప్పవానికంటె అధికుడే.' ఇలా అనడంలో అతనిభావం, దేవునిగూర్చి బహుళంగా భాషించే వానికంటెకూడా ఆత్మ పవిత్రతతో పరమ సత్యాన్నిగూర్చిన ప్రత్యక్షానుభూతి పొందినవాడే ముఖ్యుడు - అని. విషయజ్ఞానావధులను మించి, అంత శ్శుద్ధితో అంతరంగ ప్రపంచాన్ని ప్రవేశించి పారమార్థిక సత్యాన్ని తెలిసికోవాలి. ఇదే ధర్మతత్త్వసారం.

మానవుని అంతరంగంలో మార్పురావాలి అని ఏసు బోధిస్తాడు. స్వర్గరాజ్యమనేది ఈ బాహ్య ప్రపంచానికి భిన్నమై ఎక్కడో మరోచోట వున్న స్థలంకాదు. అది ఒక

ప్రత్యేకమైన - అనిర్వచనీయమైన మానసిక స్థితి. దానిని ఇచ్చుటనే - ఈ లోకంలోనే - ప్రత్యక్షంగా సాధించవచ్చు. వ్యావహారిక జగద్ధర్మాలకు అతీతమైన అంతరంగ పరిణామం - ఆత్మోన్నతి కల్గాలి. అదే మానవుని పరిపూర్ణమైన, యాథార్థమైన పరిణామం. అంతటి చిత్తత్వసాధన వల్లనే గాని స్వర్గరాజ్యప్రాప్తి వుండదు. బాహ్యావస్తు ప్రపంచ పరితాపానుతాపాలలో, ఇంద్రియ వ్యాపారాలలో మగ్నం కాక అజ్ఞానమనే నిద్రలోనుండి మేల్కొని, పసిపిల్లల నిష్కల్మష చిత్తంతో స్వర్గరాజ్యం సాధించాలి. - ఏసుక్రీస్తును ముట్టవలెనని కొందఱు చిన్నపిల్లలను అతనిదగ్గఱకు తీసికొని వస్తారు. శిష్యులు వారిని వారిస్తారు. వారితో అంటాడు ఏసు : "దేవుని రాజ్యం ఇలాంటివారిదే సుమా. పసిబిడ్డవలె దేవునిరాజ్యం అంగీకరింపనివాడు అందు ప్రవేశించలేడు" - అని. క్రోధద్వేషాసూయాదికాలతో తప్తమై నశించే మానవుడు వాటినుండి విముక్తుడై ఆధ్యాత్మిక పునరుజ్జీవనం పొందాలి. అపుడుగాని దేవునిరాజ్యం చేరడానికి అర్హత పొందడు. రాగద్వేషాదికమైన సామాన్య అల్పప్రకృతి విసర్జించి, ఆత్మనిగ్రహంతో స్వర్గరాజ్య సంపాదనకు ఉన్నత పదము పొందాలి.

దేవునిరాజ్యం పొందడానికి కావలసింది భౌతిక పునర్జన్మ కాదు, ఆధ్యాత్మిక పునర్జన్మ. విషయవాంఛలకు దూరమైన ఉత్తమ ఆధ్యాత్మిక సూత్రమది. అందుకే అంటాడు సెయింట్ పాల్ : "దైవ-చోదిత ధర్మాలను ఆత్మతో పాలిస్తాను. అధర్మాలను అనుసరించేది దేహం మాత్రమే.

అంతరంగప్రపంచంలో నాకు అనువైనదీ, అనుష్ఠేయమైనదీ, ఆనందదాయకమైనదీ దైవాజ్ఞయే ''– అని.

ప్రాపంచిక విషయాలు, రాగద్వేషాల నుండి విముక్తి పొందినవాడు ఉత్తమపదవి పొందుతాడు. కాబట్టియే, బైబిల్‌లో అంటాడు: ''విశ్రాంతిదినము మనుష్యులకొఱకే నియమితమైనది; కాని, మనుష్యులు విశ్రాంతిదినము కొఱకు నియమితులు కాలేదు. అందువల్ల మనుష్యకుమారుడు విశ్రాంతి దినమునకుగూడ ప్రభువై యున్నాడు ''– అని.

మతరహస్యం – పరమార్థం – ప్రవక్త చే శిష్యులకు బోధింపబడుతుంది. జ్ఞానమూర్తియైన ఏసుక్రీస్తు పాత్రతలేని దారినబోయే దానయ్యల కందఱకూ జ్ఞానబోధ చేయ నిచ్ఛగించలేదు. కావుననే అతడంటాడు: ''పరిశుద్ధమైన వస్తువులను కుక్కలకు పెట్టరాదు. ముత్యములను పందులకు వేయరాదు. కానిచో అవి వాటిని కాళ్లతో త్రొక్కి మీామీాద పడి మిమ్ములను చీల్చివేయును ''– అని.

ఇంద్రియనిగ్రహముతో, ధ్యాన ప్రార్థనాదికములతో ఆత్మపునరుద్ధరణమే నిజమైన మతము. ఈ సాధనలో ఏసుక్రీస్తు ముప్ప దేడులు ప్రశాంతత నెఱపాడు. అట్లే యెడారిలో మరి నలుబది దినాలు గడిపాడు. అతడు మనుష్య కుమారుడే కాదు, దేవునిబిడ్డకూడా. కాబట్టియే, భౌతిక విషయాలు, ఆధ్యాత్మిక విషయాలుగూడా తెలిసికొనగలిగాడు. మానవమాత్రుడుగా తుదిక్షణంవఱకుగూడా బహు వ్యామోహాలకు గుఱిచేయబడ్డాడు. అందువలననే, శిలువ మీాది కెక్కినపుడు– '' ఓ నాప్రభూ! నన్నెందుకు పరిత్యజిం

చావు ?'' (ఏలీఏలీలామా సబక్తానీ) అంటూ తన మానసిక వ్యధను, ఆవేదనను పెద్దపెట్టున వెళ్లబోశాడు.

మానసిక సంఘర్షణలను, సంశయాలను, వ్యామోహాలను అధఃకరించి. జయించిన దివ్యజ్ఞానమూర్తి ఏసుక్రీస్తు మానవలోకానికి ఆదర్శప్రాయుడు. అత్యధిక శ్రమక్లేశాలకు, సంక్షోభానికి లోనైగాని ఆతడు స్వర్గసోపానాలు ఎక్కలేక పోయినాడు.

దేవదూతయగు ఏసుక్రీస్తు అవతారం అనేది ఎన్నడో రెండువేల ఏండ్లక్రితం జరిగిన కేవల చరిత్రాంశం అనుకొనరాదు. గమ్యస్థానానికి చేరవలసిన ప్రతిమానవుని ధర్మజీవన మార్గంలో లభ్యమయ్యే పవిత్రాంశమది. కావుననే, మీస్టర్ ఎక్‌హార్ట్ పండితుడంటాడు: "మానవుని ఆత్మలో భగవంతుని ఆవిర్భవింపజేయుటయే మతానికి పరమోద్దేశ్య ''మని.

## (8) ఇస్లామ్ : సూఫీ మతము

ఇస్లాము మతమును అనుసరించేవారు ముస్లిములు. ముస్లిము లనగా భక్తులు. సత్యస్వరూపుడగు దేవుడు—అల్లా—సర్వజగతికి అధినాథుడని నమ్మి, అతనిని ధ్యానించి, అతనికై తమ సర్వస్వమును అధీనముచేయుట వీరిమతము. కురాన్ వీరి పవిత్రగ్రంథము. దేవుడొక్కడే; మహమ్మద్ ప్రవక్త—అని వీరి నమ్మకము. ఏకేశ్వరోపాసనను ప్రబోధించే ఇస్లాముకు త్రిమూర్తిత్వాన్ని నమ్మే క్రైస్తవం కొంత విరుద్ధంగా కన్పిస్తుంది. అందువలననే కురాన్ ప్రవచిస్తూన్నది: "దేవునితో ఇతరదైవములను చేర్చువారికి దేవుడు నందనవనంలో చోటీయడు. వారిని అగ్నిలో

పడవేయును. దేవుడు త్రిమూర్తులలో నొకడనువారు దేవ దూషకులు. దేవుడొక్కడే. ఇంకొక దేవుడు లేడు" — అని. త్రిమూర్తిత్వరహస్యం మానవావతార మెత్తడం అనే విషయాలు ఏకేశ్వరత్వానికి భిన్నంగా వున్నై. నిజానికి క్రైస్తవులు సమానత్వంగల దేవుళ్లు ముగ్గురున్నారంటూ ఏసుక్రీస్తును దేవునిబిడ్డగా పరిగణిస్తారు. 'ఏది ఉదయిస్తుందో అది అస్తమిస్తుంది; ఏది పుట్టుతుందో అది గిట్టుతుంది; ఏది దుర్నీతిమిళితమౌతుందో అది నశిస్తుంది' — అంటాడు మహమ్మద్ ప్రవక్త. కావుననే అతడు మానవులను, విగ్రహాలను, గ్రహాలను ఆరాధించగూడ దంటాడు. మహమ్మద్ దృష్టిలో దేవుడు అనంతుడు, నిరాకారుడు, శాశ్వతుడు. దేవుడొక్కడే; అతనినుండి స్వతంత్రంగా వుండునదేదియు లేదు. అతడు పుట్టినవాడు కాడు. అతనికి పుట్టినవారు ఎవ్వరును లేరు. అతడు అసదృశుడు; నిరుపముడు — అని కురాన్ ప్రవచిస్తుంది. మన ఆత్మ దేవుని ఆవాసము. మన నైతిక, ధార్మిక, జ్ఞానసంపదకు అతడే కారణము. చరాచర వస్తుసంతతికి, కాలగతికి అతీతమైన పరమసత్యమే దేవుడు. స్వర్గమర్త్యములకు, తదంతరాళమునకు అతడే అధిపతి. అతడు సర్వాంతర్యామి, సర్వశ్రోత, సర్వజ్ఞుడు — అని మహమ్మద్ ప్రబోధం. మహమ్మద్, అతని అనుచరులు ఏకేశ్వరవాదులు. క్రైస్తవ దేవాలయాలలోని ఆడంబరాలు అన్నీ చూస్తే క్రైస్తవులకు ఏకేశ్వరభావం లేదనిపిస్తుంది — అని వీరంటారు. తమ గురువులను, సన్యాసులను, భగవంతునితో సమానముగ — తమ ప్రభువులుగ — గణిస్తున్న క్రైస్తవమతాచారాన్ని మహమ్మద్ గర్హిస్తాడు. "ఏకేశ్వరునే

ఆరాధించండి అని చెప్పినా, తమగురువులను, యతీశ్వరులను, మేరీకుమారుడైన మెసయాను వారు దేవునితోకూడా ప్రభువులుగా పరిగణిస్తారు; దేవుడు ఒక్కడే; అతనితో ఇతరులను చేర్చుట దేవునిజ్యోతిని నోటితో ఆర్పివేయ జూచుటయే ''- అంటుంది కురాన్, ఏకేశ్వరత్వానికి ప్రతి వాదనగల క్రైస్తవాన్ని ఉద్దేశించి.

వేదాంతవిదుల అభిప్రాయంలో ఏది ఎలావున్నా, ప్రాచీన సంప్రదాయ మతంలో మహమ్మద్ మహాద్రష్ట. మహాద్రష్ట ప్రవచనం కురాన్. సూఫీ మతస్థులు మహమ్మద్‌ను తమ మతస్థాపనాచార్యునిగా పరిగణిస్తారు. భగవంతుని ప్రత్యక్ష అనుభూతికి ప్రాధాన్యం యిస్తారు. సూఫీలు ఏకాంతవాసులు. వారు జనసమ్మర్దములేని దూరప్రదేశాలలో ప్రత్యేకం నివాసం ఏర్పరచుకొంటారు. తమకు భక్తి ప్రణతులు చెల్లించడానికి వచ్చేవారు ఇచ్చే దానధర్మాలతో తమ పోషణ చేసికొంటారు. విశ్వానికంతటికీ ఒకే పరమ సత్యం వున్నది; దాని గుణాలద్వారా, పేర్లద్వారా దానిని అన్వేషించాలి అంటారు. అనిర్వచనీయము, అప్రమేయము నైన పరమాత్మ స్వరూపానికి గుణ నామాలు లేవు. ప్రత్యక్షా వస్థలో గుణ నామ రూపాదికాలు కల్పిస్తారు.

సూఫీలు పరమాత్మను జీలీ అంటారు. సోపాన త్రయంలో దైవత్వం ప్రపంచస్వరూపంలో విశదమౌతుంది. "పరమాత్మయొక్క ఆవిష్కరణమే ఈ విశాలజగతి. కాబట్టియే, మన మనుగడకు దేవుడు ఎంత అవసరమో, తన స్వరూప ప్రకటనకు అతనికి మనంగూడా అంత అవసరమే ''- అని ఇవాన్ అల్ అరబీ అంటాడు.

పరమాత్మ తేజోంశమే మానవుని దేహంలో బంధింపబడిన ఆత్మ. దేహబంధంనుండి విముక్తి పొందితే ఆత్మ తన అసలుచోటికి చేరుతుంది. దృశ్యమాన ప్రపంచం పరమాత్మయొక్క కొన్ని ప్రతిభాంశాలరూపం; మానవుడన్ననో పరమాత్మయొక్క సమస్త ప్రతిభాంశాల సూక్ష్మ సంపుటీకరణం. పరిపూర్ణ మానవునిలో మానవాంశ, దైవాంశ ఐక్యము పొందుతవి. సృష్టికది హేతువు.

సూఫీ సిద్ధాంత బీజాలు కొన్ని కురాన్‌లో కన్పిస్తవి. పరమసత్యమైన అల్లా తప్ప తక్కినవంతా నశించేదే. మర్త్య లోకంలో అందరూ గతిస్తారు. దయాదాక్షిణ్యమూర్తి, మహనీయుడునైన భగవంతుడొక్కడే శాశ్వతుడు. విశాల జగతిలో ఎచట చూచినా అల్లా కన్పించకపోడు. అతడు విశ్వవ్యాపకుడు. మానవాతీతుడై, సర్వశక్తిమంతుడై యున్న అల్లా ప్రతిభాప్రభావం సమస్త జీవకోటిలో ద్యోతకమౌతూన్నది. అహం వదలి పొందే పరవశతలో పరమాత్మ సాక్షాత్కారం సంప్రాప్తమౌతుంది. రాగద్వేషరహితమైన పరిపూర్ణ పరిశుద్ధ చిత్తైకాగ్రత ఇందుకుమార్గం. నిర్వాణం పొందడానికి బుద్ధుడుపదేశించిన మార్గం దీనిని పోలివుందనవచ్చు. సూఫీలు అంతరంగప్రపంచంలో ధ్యాననిష్ఠద్వారా పరమాత్మను తెలిసికోవాలి అంటారు.

సూఫీలలో సుప్రసిద్ధుడైన ఆల్ హల్లాజ్ తక్ఫీద్ అనే పేరిట ఆత్మజ్ఞాన-అనుభూతులను ప్రస్తావిస్తాడు. ఇతర వ్యామోహాలను అన్నిటిని వదలితేగాని ఆత్మను తెలిసికొనలేము. ఆత్మ ఆనందావధినుండి వేఱైనదశను, ఆత్మను భగవంతుడు తనలో ఐక్యంచేసికొనేదశను అతడు

వివరిస్తాడు. శ్రమక్లేశాలు అంటే అతనికి భయంలేదు. ఆత్మ దైవత్వం పొందడానికి అవియే సాధనాలు అంటాడు. 'అహమ్ బ్రహ్మాస్మి'- నేనే పరబ్రహ్మను- అన్న ఉపనిషద్వాక్యం 'నేనే సత్యమును' అన్న ఆల్ హల్లాజ్ సూక్తిలో ప్రతిధ్వను లీనుతున్నది. సూఫీలు ఈ సత్యాన్ని తాత్త్వికప్రసంగ వశమునకంటె ఎక్కువగా స్వానుభవంమీద తెలిసికొన్నారు. ఇస్లామ్ మతాన్ని వారు ఇలా వ్యాఖ్యానించడానికి నవప్లేటో తత్త్వం, హిందూ-బౌద్ధతత్త్వాల ప్రభావం కొంతవఱకు కారణమై వుండవచ్చును.

ధర్మానువర్తనం సూఫీల మతానుష్ఠానంలో భాగం. బాహ్య-అంతర-వర్తనలద్వారా దైవాన్ని అన్వేషించాలి. సత్యమే ధర్మము. దేవుని చేరగల్గితే అతని లీలలలో మునిగి పోతాము. ఇలా భగవంతుని సన్నిధికిచేరి ఐక్యము పొంద గల్గిన ఉత్తమస్థితిలో, ఈ లోకంలోగూడా మనం ధర్మ నిర్వహణకు పూనుకోగల్గుతాము.

## (9) అధునాతన దృష్టి

ఆధ్యాత్మిక తత్త్వానుష్ఠానపరులు-దండిపండితులు వివిధదేశాలలో వున్నారు. వారి భావతరంగిణులనుగూడా గమనిద్దాము. తత్త్వవేత్త యఫ్. హెచ్. బ్రాడ్లీ మహాశయు డంటాడు: ఈ నాటి సందేహాత్ముల నిరీశ్వరవాద ప్రభంజనపు రెపరెపకు మనప్రామాణిక తత్త్వం ఒకప్రక్క, సర్వ సామాన్యమైన శుద్ధ భౌతికవాదం మరోప్రక్క వికావిక లౌతవేమో! అని. నిజానికి మతానుష్ఠానంలో చిక్కే మహనీయతకు మించిన సత్యంలేదు. బాహ్యప్రకృతిని బట్టియే

విషయనిర్ణయం చేయడం నేలవిడచి సాముచేయడం వంటిదే అవుతుంది. ఆత్మచైతన్యంతో అభిలషించే పరమసత్యంకంటె ప్రబలమైనదానిని కోరేవాడు ఏమియు తెలియనివాడే అనాలి - అని. ఆత్మ - అనాత్మలభేద విచారణాదికం కంటెను, ఇతర అనుభవాలు అన్నిటికంటెను ఆతనికి సత్యమే తొలిటి అనుభవం. నిజానికి ఆత్మ - అనాత్మలభేదం అనుభవాల సమీకరణవల్లగాని తెలియదు. సత్యానుభూతి వలసి తృప్తి బహుళము, భవ్యము.

బెర్గ్‌సన్ పండితుడు ఆత్మ పరమేశ్వరునిలో ఐక్యము పొందే విషయాన్ని అభివర్ణిస్తాడు: ఆత్మకు అనిర్వచనీయమైన సాక్షాత్కారం ప్రాప్తిస్తుంది. అంతులేని ఆనందం, పరవశత్వం పరిఢవిల్లుతుంది. పరమేశ్వరునిలో ఆత్మ ఐకభావ్యమౌతుంది. అంతటితో అజ్ఞత అస్తమిస్తుంది; సమస్యలు చక్కబడతై; తమస్సు విచ్చిపోతుంది; సమస్తము దివ్యతేజోవిరాజిత మౌతుంది. లక్ష్యానికి, లక్షణానికి మధ్యనున్న దూరం మాసిపోతుంది. ఆరాధకునకు, ఆరాధ్యునకు మధ్యనున్న అంతరం అంతరిస్తుంది. చిదానందం చిందులు త్రొక్కుతుంది. ఆలోచనలో - అనుభూతిలో ఆత్మకు పరమేశ్వరునిలో ఐక్యము సిద్ధిస్తుంది - అని. ప్రాపంచికాలైన శ్రమక్లేశాలు, దైనందిన జీవితంలోని భయాందోళనలు అంతలో మనకు తెలియకుండానే మటుమాయమౌతవి. పిడివాదంగా మారే ఆస్తిక - నాస్తిక చర్చాభయభారం పటాపంచలౌతుంది. మతం నిర్వీర్యం కాకుండా వుండాలి అంటే చారిత్రకవృత్తాలు, సంప్రదాయాలు ముఖ్యమనుకోకుండా పరమేశ్వరాయత్తంగా ఆత్మను ప్రబోధించాలి. ఈ నూతన దృక్పథం - ఈ నవ్య

భావలత - ప్రపంచమందంతటా అన్ని మతాలలో నన లు సాగుతూన్నది.

యథార్థమతం అంటే మనం బాహ్యప్రపంచంలో గురువులనుండి, గ్రంథాలనుండి, తెలిసికొనేదికాదు; అది మానవుని అంతరంగ ప్రపంచంలో కలిగే చైతన్యం; ఆత్మ దైవోపలబ్ధికిచేసే సాధన. ఈ దృక్పథాన్ని అనుసరించినవారే ద్రష్టలు. ఇలాంటి మహనీయులు ఏజాతివారైనా, ఏ దేశంలో వున్నా -వారందఱూ ఒకే సంఘానికి - వర్గానికి - కుటుంబానికి చెందినవారని చెప్పాలి. ఆ కుటుంబంలోనికి నేల నాలుగు చెఱగులనుండి ఎంతమందియైనా, ఎప్పుడైనావచ్చి చేరవచ్చును. వారు ఈ లోకంలోనే మానవునకు లభ్యంకాగల పరమోత్తమ పదం పొందవచ్చును. వారికి సంకుచితదృష్టి వుండనేవుండదు. వారిజీవితాలు నిత్య సత్య ధర్మబద్ధములై, విశ్వజగతికి ప్రేమాదరపాయసాన్ని ఆమెతలు పెట్టుతూంటై.

---

# 6

## మతములలోని సత్యము - సంకేతపద్ధతి

### (1) ఆధిభౌతిక సిద్ధాంతము

ఆధ్యాత్మిక తత్త్వం విషయంలో వివిధ మతములలోని ద్రష్టల అనుభవాలలో ఒకవిధమైన పోలిక కన్పిస్తూన్నది. దేశభేదాలుగాని, జాతిభేదాలుగాని అందుకు ఏమీ అభ్యంతర కరములు కావు. ప్రత్యక్ష ఆత్మానుభవం ఒక విశిష్టమానసికా వస్థ. అనుభవాన్ని బట్టి ఏర్పడే జడాత్మకభావంతో దానికి

నిమిత్తంలేదు. ఆత్మానుభవంయొక్క యాథార్థ్యం, దానినుండి కలిగే జడాత్మకభావంయొక్క సత్యాసత్యాలపై ఆధారపడదు. అయినా, అనుభవానికి తెలిసికోవలసిన ఒక ప్రత్యేక ప్రాధాన్యం వుంది. దానిలో ప్రపంచం, ఆత్మ, పరమాత్మల స్వభావాన్నిగూర్చిన, పరమాత్మతో ఐక్యము పొందే మార్గాన్నిగూర్చిన జడాత్మకభావం ఇమిడి వుంటుంది. ఈ విషయాన్ని వ్యక్తీకరించే పద్ధతులలో భేదాలు వుండవచ్చు. ఒకే మతానుయాయులలోగూడా ఈ పద్ధతుల వ్యత్యాసం వుండటం కద్దు. అయినా, మొత్తంమీద హైందవ-బౌద్ధమత ప్రబోధకులలో, సాక్రటిస్, ప్లేటో, అరిస్టాటిల్, ప్లాటినస్ మొదలైన గ్రీకు మతతాత్త్వికులలో, క్రైస్తవ మతాచార్యులలో, సూఫీలలో ఈ విషయంలో ఒక విశిష్టమైన పోలిక కన్పిస్తుంది.

పెక్కురు ద్రష్టలు ప్రశాంతధ్యానార్చనలతో సంతుష్టులౌతారు. వాదోపవాదాలకుగాని, ప్రబోధాలకుగాని పూనుకోరు. వారు పరమాత్మను వాక్యాడంబరం లేకుండానే వర్ణిస్తారు. శాంతియే ఆత్మ–'శాంతోయమ్ ఆత్మా'–అంటాడు బ్రహ్మవేత్తయైన బాహ్వుడు బ్రహ్మస్వరూపం ఎట్టిదో తనకు చెప్పుమని అడిగిన శిష్యుడు వాష్కలితో. సెయింట్ ఆగస్టిన్ ఇలాంటి భావాన్నే వెల్లడిస్తాడు: "పరమాత్మ వాచామగోచరుడు అనికూడా అనరాదు. అలా అనినాగూడా ఒకవిధమైన నిర్దిష్టభావం వెల్లడించినట్లే అవుతుంది. అది సుప్రశాంతి; శబ్దరహితమైన శుద్ధశూన్యం"–అని. "నీవు లోపరహితంగా ఉండాలి అంటే భగవంతునిగూర్చి వాగాడంబరం

చూపకుమా "-అన్న ఎల్‌హార్ట్ పండితుని వాక్యాలలో ఇదేభావం వ్యక్తమౌతూన్నది. బ్రహ్మస్వరూపం బుద్ధ్యతీతమైనది. అది అనుభవైక వేద్యమే.

మతానుష్ఠానంలో పారమార్థిక సత్తనుగూర్చిన జ్ఞానమూ, భగవదన్వేషణా-రెండూ వున్నవి. అయితే, ఇవి రెండూ ఒకదానికొకటి భిన్నమైనవి కావు. అద్వైత సిద్ధాంతశిరోమణి యైన శంకరుడు గూడా ఈ ఆధ్యాత్మిక ఐక్యమునుగూర్చి, ప్రత్యక్ష ప్రమాణాన్నిగూర్చి ప్రస్తావిస్తాడు. ప్రాతనిబంధన గ్రంథంలో, క్రొత్తనిబంధన గ్రంథాలలో మూర్తిమత్వవాదనాంశం కన్పిస్తుంది. అందు కొంత ప్రత్యక్ష ప్రమాణవిషయం వున్నా, హైందవ మతం పరబ్రహ్మయే పరమసత్యమని ఉద్ఘోషిస్తూన్నది.

## (2) అదియే నీవు

## (తత్త్వమసి)

పరమాత్మతో సంబంధంవున్నదీ, పరమాత్మయేమైనదీ మానవుని ఆత్మలో ఏదోవున్నదనేమాట వివిధమతాల ద్రష్టలు అందఱూ అంగీకరిస్తారు. అదియే ఆత్మకు అధివాసం. ఆత్మ పరమాత్మతో చేరేస్థానం. సమస్తజ్ఞానానికి-సౌందర్యానికి-సౌజన్యానికి-విశ్వాత్మకభావ సంచయానికి మూలము, ఆధారము. తన అంతరాంతరాలలో దానితో చేరినదే కాబట్టి ఆత్మ పరమార్థసత్యాన్ని తెలిసికోగలదు. తాను తెలిసికొనేదానితో అనన్యత్వం పొందుతుంది. అదే నీవు అన్నభావం ఇదియే.

మానవుని అంతరప్రకృతి (ఆత్మ)కి-బాహ్యప్రకృతిలోని సత్యానికీ తెఱుగని సంబంధ బాంధవ్యమున్నది. అసలు చరాచర ప్రపంచంలోని ఖనిజ-వృక్ష-జంతు-మానవ-ఆధ్యాత్మికాది వివిధ అంతస్తులలో అతని సంబంధం కన్పిస్తుంది. ఈ అన్ని అంతస్తులలో కన్పించే ప్రపంచాయొక్క పరమ సూక్ష్మరూప మతడు; లేక, ప్రపంచం మానవుని స్థూల స్వరూపము అనవచ్చును. ప్రకృతిశక్తులన్నీ అతనిలో ప్రయుక్తమై వున్నవి. అతనిద్వారా ప్రకృతి సృజనాత్మక భావం ప్రదర్శితమౌతుంది. కాబట్టి, అతనిలో ఇమిడివున్న శక్తులను ఉపయోగించుకొని అతడు తనను, ఈ జగత్తును తగురీతి రూపొందించుకోవాలి.

ప్రత్యగాత్మ, పరమాత్మ ఒకటే అనవచ్చు. మానవుని గూఢానుభవమునందే సత్యస్వరూపము ఇమిడివుంది. ప్రతి మానవునిలో దైవత్వ సిద్ధి పొందడానికి అవకాశంవుంది. తగిన కృషితో అది లభిస్తుంది. ఆత్మ పరమాత్మలో లీన మౌతుంది. ఈ జ్ఞానం కలిగితే మోక్షం కరతలామలకం అవుతుంది. అదియే నీవై వున్నావు-'తత్ త్వమ్అసి'-అన్న ఉపనిషత్తుల సత్యసూక్తి; మానవులలో ప్రతివ్యక్తి బుద్ధుని-బోధిసత్త్వుని-పదవి పొందడానికి అవసరమైన శక్తి అతనిలోనే వున్నది-అన్న తథాగతుని ప్రవచనం; మానవుని ఆత్మయే జగత్ప్రభువుయొక్క దివ్యజ్యోతి అనిన జొరాస్ట్రియనుల సిద్ధాంతము; స్వర్గరాజ్యం మీలోనే వున్నదని తన అనుయాయులకు చేసిన ఏసుక్రీస్తు బోధ; భగవంతుడు మనకు అత్యంత సన్నిహితుడు-కంఠధమనికంటె దగ్గఱివాడు-అనిన మహమ్మద్ ప్రబోధ ఇదే భావాన్ని సూచిస్తున్నై. మానవుని

జీవిత పరమార్థం బాహ్యావస్తువులలోగాక మానవుని అంత రంగ ప్రపంచంలో, నిర్మలచిత్తంలో, అనుభూతిలో వున్నదని వీరి తాత్పర్యం.

## (3) మతములలో సంకేత వాదం

భారతీయ తాత్త్వికుల దృష్టిలో శ్రుతులు – వేదాలు – వేఱు; స్మృతులు వేఱు. శ్రుతులు మానవుని తత్త్వజిజ్ఞాసకు మాత్రమే సంబంధించినవి కావు. స్మృతులు సంప్రదాయాన్ని తెల్పుతవి. అవి సహేతుకవాఖ్యానాలతో మిళితమైనవి. ఆత్మయొక్క ప్రత్యక్షజ్ఞానాన్ని తెల్పునవి శ్రుతులు. వాటి ప్రవచనాలు వ్యక్తిగతంగాక విశ్వజనీనములు, దైవసంబంధ ములునై వుంటవి. అవి ప్రత్యక్షజ్ఞానాన్ని తెల్పుతవి. శాశ్వత సత్యాన్నిగూర్చిన అనుభవం వేఱు; దానినిగూర్చిన వట్టి జ్ఞానం వేఱు. వ్యక్తి అంతర్వీక్షణతో పరమసత్యాన్ని దర్శించుటతో దైవత్వం సంప్రాప్తిస్తుంది. అంతరంగంలో మానవుడు తానుకానిది వర్జించి పరమసత్యదర్శనం చేయాలి. కావుననే, అర్జునుడు ఆనాడు సత్యాన్ని దర్శించుటకు తనకు దివ్యదృష్టి దయచేయుమని శ్రీకృష్ణుని అర్థించాడు. తెలిసి కొనేది, తెలిసికొనబడినది – ఆత్మ, పరమాత్మల ఏకత్వం సిద్ధిస్తుంది. ఇదియే వాస్తవమైన జ్ఞానము – మానవేశ్వరైక్యము.

అంతర్ముఖత్వాన్ని, ఆత్మదృష్టిని వికసింపజేసి పొందే ఈ దివ్యజ్ఞానము అనుమాన రహితమై, ఆత్మప్రకాశకమై, శాశ్వతమై వుంటుంది. అపరోక్షజ్ఞానం సంకేతాలద్వారా వస్తువుల వర్ణనలతోగూడి వుంటుంది. నిరాకారము, నిర్గుణము, నిరంజనమునైన పరబ్రహ్మమును వ్యావహారిక దృష్టిలో

సంకేతములద్వారా తెలిసికొనడం జరుగుతుంది. పారమార్థిక దృష్టికి అది మొదటిమెట్టు; అంతియేకాని అది పరమ సత్యంకాదు. ఏరూపమున దేవుని ఉపాసించినను ఫలిత మొకటియే కదా?

పారమార్థిక సత్త శాశ్వతమైనది. వేదాలనుగూర్చిన శాశ్వతత్వభావంలోని తాత్పర్యమిదియే. యూదులు మోసెస్ సంప్రదాయాలు నిరంతరములైనవి, నిరవధికములైనవి అనడంలోగూడా ఈ జ్ఞానము అనంతమైనది అనియే భావము. గ్రీకుతత్త్వజ్ఞుడు మెయిమోనెడ్స్ తోరా పరిపూర్ణ మైనది, శాశ్వతమైనది, అందు దేనినైనచేర్చుటకుగాని, దాని నుండి ఏమియైన తీసివేయుటకుగాని వీలు లేదంటాడు. పరమేశ్వరుడు అన్యథా ఆజ్ఞాపిస్తే తప్ప యుగయుగాంతం వఱకు-స్వర్గము, మర్త్యము వున్నంతకాలం-ఇది శాశ్వతమే అంటారు. మహ్మాద్ ప్రవక్త వచనములు కురాన్ గా వెలసినవి. అవి అతడు ప్రభువుపేర ప్రకటించిన విషయములు; దేవదూత గేబ్రియల్ వలన తెలిసినవి. దేవదూత మహ్మాద్ మనోనయన మునకు కన్పించినపుడెల్ల మహ్మాద్ ఒక విధమైన మూర్ఛావస్థ పొందెడివాడు. దేవదూత దేవుని సందేశమును అతనినోట పలికించెడివాడు. ఆ సందేశముల సంపుటియే కురాన్; దయాదాక్షిణ్యమూర్తియగు అల్లా పేర వెలసినవి. ఇట్టి పవిత్రగ్రంథముల భౌతిక స్వరూపములు గాక అవి తెల్పు సందేశములు శాశ్వతములు, జ్ఞానసంబద్ధములునై యున్నవి.

మతములలోని సంకేతములద్వారా వివిధరీతులలో పారమార్థిక సత్యాన్వేషణం జరిగింది. మన అనుభవాన్ని ఒక రూపంలో-ఒక వర్ణన పద్ధతిలో కల్పనచేసికొంటాము.

అది యెఱుగనివారికి దానిభావాన్ని – అంతర్యాన్ని – వారికి పరిచితమైన మరోవస్తువుగా రూపకల్పనచేసి వివరిస్తాము. సత్యసాధనమార్గాలలో ఇది వ్యావహారిక మార్గం; కాని, ఇదే సత్యంకాదు. నిజమైన రూపము కేవలం స్వప్నంగాని, ఛాయగాని కాదు. అగాధమైన, అనంతమైన విషయానికి శ్రుతి ప్రకాశమది. వేదకాలమునాటి ఆర్యులు, జొరాస్ట్రియన్ మతస్థులు అగ్నిని భగవత్స్వరూపంగా ఆరాధనచేసేవారు. పారమార్థిక సత్యము యొక్క అనితర దివ్య తేజస్సును సూచిస్తుంది జ్వాల. ఉపనిషత్తులు జ్యోతులకెల్ల జ్యోతి – "జ్యోతిషామ్ జ్యోతిః –" అనుటయు ఇట్టి అభివర్ణనమే. బొహిమీ, విలియంలా మున్నగు తత్త్వజ్ఞులు దీనిని దివ్యజ్యోతి అని పేర్కొన్నారు.

భగవంతునితో మానవునకుగల సంబంధాన్ని చెప్పడంలో, సాధారణ మానవధర్మంగా, పితృత్వం ఆపాదిస్తారు. భగవంతుడు తండ్రి అంటూన్నై వేదాలు, ఉపనిషత్తులు. ఇదే విషయాన్ని ఏసుక్రీస్తు ప్రముఖంగా వ్యక్తీకరిస్తాడు: ఆలివ్‌శిఖరం ప్రాంతంలో గెట్‌సెమెన్‌వద్ద తన ఆందోళిత చిత్తాన్ని వెల్లడిస్తూ అతడు "అబ్బా! తండ్రీ" అంటూ దేవుడిని సంబోధిస్తాడు. "తండ్రీ! నన్ను క్షమించు. నా ఆత్మను నీకు అర్పణ చేస్తూన్నాను తండ్రీ!" – అంటాడు అతడు. తన శిష్యులతో ప్రసంగిస్తూ "మీరు భగవంతుని గూర్చి ప్రార్థించేటప్పుడు తండ్రీ! అని మనసార సంబోధించండి" అని ఆదేశిస్తాడు. "పరలోకమందున్న మా తండ్రీ!" అనేది భగవంతునిగూర్చిన క్రైస్తవుల సర్వసాధారణ సంబోధన. చరాచరమైన సమస్తలోకమునకు నీవు తండ్రివి

అంటాడు అర్జునుడు శ్రీ కృష్ణుని ఉద్దేశించి విశ్వరూప సందర్శన యోగంలో. పరమేశ్వరునిగూర్చిన వివిధరూపకల్పనలు ప్రతిభా ప్రభావ సంపన్నము, అనంతము, అప్రతిమానమునైన అతని దివ్య తేజస్సులోని వివిధాంశలను వ్యక్తీకరిస్తవి.

వివిధరూపకల్పనములు జరిగినంతమాత్రాన సత్యానుభూతియు వివిధములుగా నున్నదనరాదు. ఈశ్వరవాదుల స్థానదేశకాలాదికముల యందలి భేదములనుబట్టి ఈ రూప కల్పనలోని భేదములు కల్గుతూన్నవి. ద్రష్టలు తమ దైవ తత్త్వానుభూతిని ఆయామార్గాలలో వెల్లడిస్తూంటారు. అన్ని దేశములకు సూర్యుడొకడే; ఆకాశము ఒకటేకదా? అట్లే ఎన్నిరూపములలో భావించినను, ఎన్ని పేర్లతో పిల్చినను అందఱకు దేవుడొక్కడే. గూఢమై, నామరూపగుణ రహితమైన పరమ సత్యాన్ని కవులు, పండితులు బహువిధ వాక్యాలలో గానంచేస్తారు. కవిశేఖరుడు షెల్లీ అంటాడు:

జీవితం బహువర్ణ సంశోభితమైనకాచ
కలశం వలెండి, స్వర్గపు ధవళకాంతుల
ధగధగను మసకగొల్పుతూన్నది — అని.

ఇదే ధోరణిలోవుంది మరో కవికుమారుని మంజులోక్తి:

ప్రాచీన ప్రవక్తలు, వేదాంతకవులు
భగవంతునిగూర్చి గానంచేస్తూ
ఆనందపారవశ్యంలో తమతమ వాద్యాలకు
అనుకూలంగా ఒక్కొక్క రొక్కొక్క ఫణితి
దిద్దారు — అని.

ఇతడు చెప్పే వాద్యాలు, తీగలు వారివారి అనుభూతియొక్క వివరణలోని సంకేతాల భేదమే.

వివిధ కాలములలో ఏర్పడిన ఈ సిద్ధాంతాల ముఖ్య సందేశంలో ప్రధానమైన సన్నిహితత్వాన్ని, సామ్యాన్ని సరకుగొనకుండా, వాటి స్థూల రూపాలలో వున్న భేదాలను ఉత్ప్రేక్షించి అతిశయోక్తులతో చెప్పడంకూడదు. ఆధ్యాత్మిక తత్త్వచింతనలో పైమెట్టుకు పోయినకొద్దీ వివిధసిద్ధాంత ములలోని విభిన్నత దిగజాటి పోతూంటుంది. వారి అప్రధాన వ్యాఖ్యానాలను అవతలపెట్టితే, పారమార్థిక సత్యస్వరూపాన్ని గూర్చి వివిధద్రష్టలు ఇంచుమించు ఒకేవిధంగా ప్రవచించారు అని చెప్పగలము.

సిద్ధాంతాలుగాని, రూపకల్పనకైన సంకేతాలుగాని ఖచ్చితమైనవి కావు. అవియే సత్యము కావు. ప్రేషణపొందే స్వచ్ఛము, వర్ణరహితము నైన ప్రకాశము వర్ణములలోని భేదమువలన మార్పుపొందనట్లే, దాని వివరణలోని విభేదాల వల్ల సర్వాంగీకృతమైన పారమార్థిక సత్యము ఏమాత్రమూ కుంచింపబడదని ప్రాగ్దేశీయుల మతదృష్టి. అయితే, ఒక్క నిర్వచనమే యథార్థము, కడపటిది; తక్కిన వివరణలు - నిర్వచనములు అసత్యములు అనేది పాశ్చాత్యుల మతదృష్టి. భారతదేశంలో ఒక్కొక్క నిర్వచనం ఒక్కొక్క దర్శనాన్ని - భావాన్ని తెల్పుతుంది. అయితే, అవి పరస్పర విరుద్ధాలు కావు. అవి అన్నీ గూడా బ్రహ్మదర్శనంపొందే మార్గాన్ని సూచించే విభిన్న రీతులు మాత్రమే. వివిధమతవర్గాలు వివిధరీతులలో బ్రహ్మమార్గాన్ని అన్వేషించి దర్శించినా కడకు పరబ్రహ్మము ఒకటే అనేదే సత్యము. కొన్ని మతముల

రీతులలో భేదంవున్నా అది సర్వజగదధినేతయైన పరమేశ్వరుడు వివిధరీతులలో విభిన్నమార్గాలలో తన దివ్యాంశమును ప్రచురితముచేస్తూ వాటినన్నిటిని తుదకు ఒకటిగా మేళవిస్తూన్న విధానాన్నే సూచిస్తుంది. మతవిషయాలలో విజ్ఞానులు, పవిత్రధర్మవర్తనులునైన మహనీయుల భాషణములు సత్యభాషణములు కదా? పరమేశ్వరుడు అందరిలో నున్నట్టి ఆత్మస్వరూపుడు. అందువల్ల సత్యాన్ని తెలిసికోడానికి అందరూ అర్హులే. హిందూమతంలో పరమాత్మనుగూర్చి తెలిసికొను అర్హతనుగూర్చి చెప్పబడింది. ఈ అర్హత-అధికారము-వ్యక్తియొక్క శక్తియోగ్యతలు, అతని ఆత్మాభివృద్ధి ననుసరించి వుంటుంది అనే సూత్రాన్నిబట్టి యేర్పడిందే కాని మరేమీ కాదు. ఇష్టదేవతా నిర్ణయ సూత్రంగూడా ఇలాంటిదే.

ఋగ్వేదము, ఉపనిషత్తులు, భగవద్గీతగూడా మనకు ఏ రూపంలో భగవంతుని ఉపాసించడం ఇష్టమో ఆ రూపంలోనే ఆరాధించవచ్చు నంటూన్నై. శ్రీకృష్ణ భగవానుడు సెలవిస్తాడు గీతలో: "ధనంజయా! ఎవడు ఎట్టి రూపమును శ్రద్ధతో ఉపాసింపగోరునో వానికి ఆ శ్రద్ధ నేనేయిచ్చుచున్నాను"-అని. మతముల పారమార్థికదృష్టి-లక్ష్యము ఒకటే కావడం ఇందుకు కారణం. వివిధమార్గాలు ఆ ఉన్నత శిఖరానికే చేర్చుతవి. ఎవరు ఏవిధంగా భగవంతుని ఆశ్రయిస్తారో వారి నతడు ఆవిధంగానే అంగీకరిస్తాడు. "ఎవరు నన్ను ఎట్లు పూజింతురో వారికి నేనట్లు దర్శనమిస్తాను; మనుష్యులు అందరూ నా మార్గాన్నే అనుసరించుచున్నారు"-

అనే దివ్యసూక్తి ఇదేభావాన్ని సూచిస్తున్నది. మానవు లందఱికి గమ్యస్థానం ఒకటే. దానిని చేరడానికైన వారి జీవనయాత్రలో వారిని వివిధమార్గాలలో నడిపిస్తాడు భగవంతుడు. ముక్తిమార్గానికి మానవులందఱికీ ద్రవ్యసాధనాలు ఒకటే అయినా వారు అందఱూ వాటిని ఒకే పరిమాణంలో వినియోగించుకొనరు. భగవంతునికి కొందఱు ఇష్టులు, కొందఱు అనిష్టులు లేరు. అతడు అందఱకు సమానుడు. "సమస్త భూతములు నాకొకటే; నేనెవ్వరిని ద్వేషింపను; కొందఱు అప్రియులుకారు, కొందఱు ప్రియులుకారు; అయితే ఎవ్వరు నన్ను మనసార ఆరాధిస్తారో వారిలో నేను, నాలో వారు ఉందురు"– అంటాడు శ్రీకృష్ణ భగవానుడు రాజవిద్యారాజగుహ్యయోగం వివరిస్తూ. "ఎవడు మత్పరాయణుడై నన్ను ధ్యానించి ఉపాసిస్తాడో అతనిని నేను ఉద్ధరిస్తాను; పార్థా! నీమనోబుద్ధులను నాయందుంచిన-చో నీవు నాయందే నివసిస్తావు సుమీ"– అనిన్నీ అంటాడు అతడు భక్తియోగం ప్రవచిస్తూ. వివిధమతవర్గాలను సంపుటీకరించే దైవసాహచర్యవిధానం వుంది. ఈ విషయంలోని హైందవ మతభావం సత్యగౌరవాన్ని సంపూర్ణంగా వ్యక్తంచేస్తున్నది.

నిరాకారము, నిర్గుణమునైన పరమాత్మయొక్క యాథార్థ్యమును తెలిసికొనలేక తమ తమ మనోభావానుగుణంగా రూపకల్పన చేసికొనేవారు తమభావమే పరమసత్యమనుకొంటే వారు పొరబడినవారే అవుతారు. వివిధ మతాలను భగవంతుడు మానవునకు ఆత్మసందేశమిచ్చే వివిధభాషలుగా పరిగణించాలి.

---

# 7

## మోక్ష మార్గము

### (1) పునర్జన్మ

ప్రాగ్దేశములలోని మతాలు ప్రమాణంకంటె అనుభవం ముఖ్యమని చెప్పుతూన్నవి. వాటిలో పౌరాణిక సంప్రదాయాలు, మతకర్మలు వివిధాలుగా వున్నా, వాటి అన్నిటికీ చిత్తత్వ పునరుజ్జీవనమే ప్రధానలక్ష్యం. నిజానికి పారంపర్యంగా వస్తూన్న సిద్ధాంతాలను అనుసరించడం మాత్రమే గాని, లేక మతకర్మలను నిర్వర్తించుకొంటూ వుండడం మాత్రమేగాని, మతానికి లక్ష్యంకాదు. కేవల జడాత్మక పరిణామాన్నే గాక, ఆధ్యాత్మిక పరిణామాన్ని సమకూర్చడం మతానికి ముఖ్యకర్తవ్యం. విద్యతో జ్ఞానసముపార్జనతో అవిద్యను అజ్ఞానాన్ని పారద్రోలాలి. విద్య బోధ విజ్ఞానం లభిస్తే ఆత్మశక్తి, ఉన్నతి ప్రాప్తిస్తుంది. అంతటితో సాధారణ మానవ ప్రకృతి మారిపోయి వినూతన ఆత్మచైతన్యం—అంతరంగ ప్రపంచపు పునర్నిర్మాణం—కల్గుతుంది. అది అనుకూలము, శాంతిప్రదమునైన అవస్థ. మోక్షము—నిర్వాణము—దేవుని రాజ్యము అనేవి ఈ ఉత్తమ మానసికావస్థను సూచిస్తవి. మతలక్ష్యం సాధించినవారి మనస్సు, హృదయం, ఆత్మ నూతన దివ్యతేజోవిరాజితమౌతవి. జీవనం క్రొత్త పంథాలో సాగుతుంది; ప్రకృతి అంతా నవ్యదివ్యభావం పొందుతుంది. ఇదియే పునర్జన్మ. అంతరంగ ప్రపంచంలో జరిగే ఈ నవ్యసృష్టితో ప్రతివస్తువు నూత

సత్వం పొందుతుంది. మనం రాగద్వేషాది ఇంద్రియలోలత్వం నుండి ఉద్ధరింపబడి ఈ అత్యున్నతపదము పొందే సాధనను - పరమాత్మ సందర్శనమునకు అర్పించే నివాళిని - హైందవ బౌద్ధ సంప్రదాయాలప్రకారం పద్మంగా రూపకల్పన చేయడంకద్దు.

ఈ వినూతన ప్రపంచానికి మూలము పైన, శాఖలు క్రింద. పురుషోత్తమప్రాప్తియోగం విశదంచేస్తూ శ్రీకృష్ణ భగవానుడు ఇదేభావాన్ని స్పష్టంచేస్తాడు: "అర్జునా! నాశంలేని బ్రహ్మమనే ఈ అశ్వత్థవృక్షానికి ప్రకాండం మీద వుండును; శాఖలుక్రింద వుండును. ఈ వృక్షశాఖలు సత్వరజస్తమోగుణాలచే వృద్ధిపొందుచుండును. కర్మాను బంధములైన దాని క్రిందివేళ్లు మానవలోకాన్ని బంధించి వున్నవి"- అని. ఐహిక విషయాలను వర్జించి, ఆత్మనిష్ఠతో మానవుడు సత్యసందర్శనం పొందవచ్చునని దీనిభావం. ఈ వృక్షాన్ని నిస్సంగత్వమనే శస్త్రంతో ఛేదిస్తే పురాతనము, పవిత్రమునైన ప్రవృత్తి వెలువడుచున్న ఆది పూరుషుని పొందవచ్చును; మానమోహాములు, విషయ వాంఛలు లేని జ్ఞానులకే ఇది సాధ్యము - అంటుంది గీత. ఈ పరమోన్నతపదం సాధించడమే మానవునకు జీవితలక్ష్యం. ఇదే శాశ్వతము. జీవనతృష్ణకు, భౌతిక విషయవాంఛలకు చిక్కివున్నంతకాలం మానవునకు ఇది అసాధ్యం. లోక మంతయు నిద్రలోనుండ, విషయవాంఛలలో మునిగియుండ ఆత్మనిష్ఠగలవాడు ఈ సాధనకు దొరకొనునని గీతా ప్రవచనం. బాహ్యప్రపంచం మానవుని ఆకర్షించుచున్నంత కాలం, అతడు విషయవాంఛలలో మునిగి యున్నంతకాలం

అతడు అజ్ఞానియే; అతడు నిద్రలో మునిగియున్నట్లే. అయితే, దైనందిన జీవితం – సంసారచక్రం – యాంత్రికంగా సాగుతూనే వుంటుంది. భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు ఏర్పడు తూనే వుంటవి. లౌకిక వ్యవహారాలు జరుగుతూనే వుంటవి. ఏండ్లుగడుస్తవి. ముదిమి ప్రాప్తిస్తుంది. మృత్యుదేవతయింట ఆతిథ్యం కల్గుతుంది. ఇలా జరిగితే ప్రయోజనం? ఇదేనా లక్ష్యం? మరి? ఔను; ఆత్మనిష్ఠగలవారు మాత్రమే సంసారచక్రములో సతమతమౌతున్నా – ఆ అజ్ఞానమనే తమస్సును జ్ఞానదీపంచే నశింపజేసి, సత్యమార్గాన పరబ్రహ్మ సాక్షాత్కారం పొందుతారు.

క్రైస్తవ మతబోధలో ఒక నిగూఢ రహస్యం – ఒక వినూత్న వికాసం – తోస్తున్నది. దైవజ్ఞానం అంటే ఏసును చారిత్రక పురుషుడుగా తెలిసికోవడం, సువార్తలలో చెప్ప బడినట్లు అతనిని దేవునిదూతగా విశ్వసించడం కాదు. క్రీస్తు చారిత్రక పురుషుడైన మేరీ కుమారుడు ఏసే అనడం సమం జసంకాదు. దేవునిరాజ్యభావానికి క్రీస్తు చిహ్నం. చారిత్రక పురుషుడైన ఏసుకు భిన్నుడైన క్రీస్తుద్వారా మోక్షం – స్వర్గ రాజ్యం – సంప్రాప్తిస్తుంది. ఈ సత్యాన్ని గమనించి అనుస రించిన వారికి నాటికి, నేటికి – ఏనాటికైనా – క్రీస్తు తత్త్వ మహనీయత సువిదితమౌతుంది.

## (2) భక్తిమార్గము

చిత్తమును ఈశ్వరాయత్తము చేయడానికి అనువైన మార్గాలలో నొకటి భక్తిమార్గం. భాగ్యవంతులు – పేదవారు, అక్షరాస్యులు – నిరక్షరులు, గొప్పవారు – కొద్దివారు అనే

భేదం లేకుండా ఇది సర్వజనులకు అందుబాటులో వుంటుంది. పరమేశ్వరునియందు చిత్తం కేంద్రీకరించి సర్వం అతని అధీనం చేయాలి. పరమేశ్వరుడు హృదయాధిష్ఠితుడౌతాడు. అంతరంగ ప్రార్థనవల్ల అతనితో ఐక్యము సాధించవచ్చును. "పార్థా! మనోబుద్ధులను ఎవరు నాయందుంచి నిత్యాభియుక్తులై అత్యంత శ్రద్ధతో ఉపాసింతురో వారే ఉత్తమయోగులు"- అంటాడు కృష్ణపరమాత్మ భక్తియోగ ప్రబోధంలో. ఇస్లాము మతస్థులు తమ సర్వస్వము భగవదధీనముచేసి, విశ్వకళ్యాణ మునకై స్వార్థప్రయోజనములు వదలవలె నని కురాన్ ప్రబోధము. అల్లాయందు నమ్మకముతో బాటు ప్రార్థన వీరి ముఖ్యధర్మము. నా ప్రార్థన, నా త్యాగము, నా ప్రాణము, నా మృత్యువు - సర్వము అల్లాకే అర్పించుచున్నాను - అంటాడు ఇస్లామ్ మతాచార సంపన్నుడు. అచంచలమైన భక్తి ప్రార్థనలలో భౌతిక వాసనలు పోకక ఆత్మ పరమేశ్వరునితో ఐక్యము సాధించగల ఉత్తమ మానసికావస్థ ఏర్పడు తుంది. భక్తిలో ప్రేమవిశ్వాసాలు ఇమిడివుంటై.

మోక్షసాధనకైన భక్తికి ప్రపత్తి ముఖ్యమంటారు. భగవంతుని నామ సంకీర్తనము, ఆవాహనము చేయాలి అంటారు. హిందువుల జపము, బౌద్ధుల బుద్ధానుస్మృతి, ముస్లిముల ధికర్ ఇలాంటివే. భగవంతుని నామము బలమైన దుర్గము వంటిది; సత్యధర్మవర్తనులకే అందు ప్రవేశమున్నది; వారక్కడ సురక్షితులు - అంటారు యూదులు. భగవంతుని నామ సంకీర్తన చేసినవారు ముక్తి పొందుదురు అని ప్రవచిస్తాడు జోయల్ ప్రవక్త. సెయింట్ బెర్నార్డ్ అంటాడు: "ఏసుక్రీస్తు నామము జ్యోతిర్లత మాత్రమే కాదు, పోషక పదార్థము

కూడా. ఈ సంబారమును ముందుగా అందుచేర్చకపోతే అత్యుత్తమమైన ఆహారపదార్థమంతా చప్పగా వుంటుంది. ఈ రుచి అందులో కలియకపోతే అది అసలు రుచ్యమే కాదు. ఈ పవిత్రనామం కన్పించని రచనలు నాకు ఆసక్తి గొల్పవు. ఈ భవ్యనామం ప్రతిధ్వనులీనని ప్రసంగంమీద నాకు మోజు లేదు. ఈ దివ్యనామం నాజిహ్వకు జుంటితేనియ; నా కర్ణములకు శ్రావ్యమంజులగీతి. ఈపేరు వింటే నా హృదయం ఆనందంతో చిందులు త్రొక్కుతుంది. మధురాతి మధురమైన ఈ పరిశుద్ధనామం నాకు దివ్యౌషధము. శోక తప్తులు ఎవరైనావుంటే ఏసుక్రీస్తు పవిత్రనామం మనసార ఉచ్చరించండి - అంతటితో అంతా తేజోమయ మౌతుంది. అరుణోదయంతో మేఘాలు విచ్చిపోయినట్లు మీ శోకభారం తీరిపోతుంది. మీ హృదయాకాశం నిర్మలమౌతుంది. ఎవరైనా నీతిపథం తప్పి నైరాశ్యంలో నవసిపోతుంటే ఏసుక్రీస్తు ప్రశస్తనామ సంస్మరణచేయండి; మీ హృదయవారాశిలో ఆనందవీచికలు పెల్లుబ్బుతవి; నవజీవనానికి నాణ్యమైనబాట కన్పిస్తుంది''-అని. విశ్వాసంతో తన నామసంకీర్తన చేసేవారిపై భగవంతుడు కరుణామృత సేచన చేస్తాడంటాడు మహాత్మ గాంధి రామధున్ ప్రార్థనాగీత ప్రభావాన్ని ప్రస్తావిస్తూ.

అచంచలమైన భగవద్భక్తి విశ్వాసాలతో అమూల్యమైన మోక్షాన్ని సాధించవచ్చును.

క్రైస్తవంలో భక్తిమార్గానికి ప్రాధాన్యం ఈయబడింది. మహాయాన బౌద్ధులయొక్కయు, హైందవులలో భక్తిమత ప్రచారకులయొక్కయు ప్రబోధాలు దీనికి సామ్యము - సన్నిహితత్వము కల్గివున్నై.

ఇస్లామ్ మతస్థాపనాచార్యుడు మహమ్మద్ ముస్లిములకు ప్రార్థన, ఉపవాసము, దానము, తీర్థయాత్రలు, స్నాన ప్రక్షాళనములు విధించాడు. ప్రార్థనతో దేవుని సన్నిధికి చేర్చేమార్గంలో సగంవఱకు పోవచ్చు; ఉపవాసంవల్ల దేవాగార ప్రాంగణంచేరవచ్చు; దానంవల్ల లోనికి ప్రవేశించే యోగ్యత కల్గుతుంది-అంటాడు. ముస్లిములలో ఎవరికి వారే ప్రార్థనాదికాలు జరుపుకోవచ్చును. ప్రత్యేకం ఇమామ్ అక్కఱలేదు. వీరు దినమునకు ఐదుపర్యాయములు ప్రార్థన చేయవలెనని నియమము-ఉదయము (సలాతుల్-ఫజర్), మధ్యాహ్నమునకు ముందు (సలాతుజ్-జుహూర్), మధ్యాహ్నము తరువాత (సలాతుల్-అసర్), సాయంత్రము (సలాతుల్-మగ్రిబ్), రాత్రి (సలాతుల్-ఇషా) ప్రార్థనలు జరుపాలి. అన్ని ప్రదేశములు పవిత్రములేయైనను ముస్లిములు ప్రార్థనా సమయంలో తమదృష్టిని, తలపులను మక్కాలోని పవిత్రగృహమైన కాబా వైపుకు మళ్లించవలెనని విధింపబడింది. ప్రతిదినము ప్రార్థనకు యోగ్యమే. అయినను, శుక్రవారము ప్రార్థనకు ప్రత్యేక ప్రాశస్త్యము పొందింది. మసీదులలో శుక్రవారమునాడు ఫర్ద్ జరుగుట ఆచారము. సదాచారులగు ముస్లిములు ప్రార్థన వేళకాగానే తాము ఎక్కడవుంటే అక్కడే ప్రార్థన చేయుట చూచుచుందుము.

## (3) కర్మమార్గము

మానవుని ప్రకృతి కడువిచిత్రమైనది. అతడు పరస్పర విరుద్ధగుణముల ప్రోవు. ఆ గుణాల పరస్పర వైరుధ్యాన్ని సమన్వయించడం అవసరం. మానవుడు ఎంతకైనాదక్షుడే-

అతనిలో ఒకప్రక్క అత్యంత సౌజన్యం, మరోప్రక్క అమితశాఠ్యము; ఒకవైపు భూరి ధార్మికత, ఇంకొకవైపు బహుళ ద్వేషము; ఒక చక్కి చక్కని భూతదయ, వేఱొక చక్కి మిక్కిలి క్రౌర్యము కన్పిస్తవి. అతని హృదయకర్కశత్వము, నియమాతిక్రమణము అతని అవగుణాలకు, పాపాలకు కారణం. నాకు ధర్మమేమిటో తెలుసును, కాని దానిని ఆచరింపబోను; అధర్మమేమిటో తెలియును, కాని దానిని మానలేను - అంటాడు మహాభారతంలో. ఇదేరీతి అనుభవాన్ని విపులీకరిస్తాడు సెయింట్ పాల్: నేను చేయవలసిన సత్కృతినేమో మానుతాను; దుష్కృతినేమో అభ్యసిస్తాను - అన్న మాటలను ఉదాహరిస్తూ. ఇలా మానవ ప్రకృతి ద్వివిధంగా వున్నదనే విషయం అనుభవంమీాద తెలిసిన సత్యమే. మానవునిది కేవలం దుస్స్వభావంకాదు. అలా అయివుంటే, దానినిమార్చి, మంచితనం కూర్చగల ఆశ, అవకాశం ఉండనే యుండదు. భగవద్గీత అర్జున విషాద యోగంతో ప్రారంభ మౌతుంది. అతడు దైన్యంతో హతస్వభావుడై ధర్మసమ్మూఢ చిత్తుడౌతాడు. దైవసందేశాన్ని అర్థిస్తాడు. పరమాత్మకు అంజలి ఘటిస్తాడు. పరమాత్మయగు శ్రీకృష్ణుడు తనరథమగు దేహములోనే వుండెనుగదా? అర్థించిన దివ్య - ధర్మ సందేశం వినిపిస్తుంది. క్రైస్తవులు చెప్పేప్రకారం ఇలాంటి దివ్యసందేశమే ఆనాడు ఆడమ్ ఈవ్‌ల జన్మస్థానంలో వినిపించింది. దుష్కార్యప్రేరణలో పాపము, పాపమువలన అవమానము కల్గినపుడు "నీవు చేసిన ఈ పనియేమిటి?" అన్న ప్రశ్న - దివ్యవాణి ఆదాముకు వినిపించింది.

జీవితంలో ఎప్పుడూ దుష్కార్యప్రేరేపణతో సంఘర్షణ జరుగుతూనే వుంటుంది. ఆ ప్రేరేపణను ఎంత ఎక్కువగా తప్పించుకోగల్గితే అంత అధికంగా చిత్తశాంతి, సంతృప్తి, సౌఖ్యం లభిస్తవి. క్రమబద్ధవర్తనము, ఇంద్రియనిగ్రహము వలననే ఈ దుష్కార్యప్రేరేపణకు చిక్కక తప్పించుకోగలము. దైహికమైన ఇంద్రియలోలతకు, ఆత్మకు మధ్య యేర్పడే బలాబలాలపోటీ నూతన నిబంధన గ్రంథంలో ఎక్కువగా ప్రస్తావింప బడుతుంది. ఒకదాని నొకటి మించాలి అని పోటీపడతై. కాని, ఆత్మచైతన్యం సంతరించుకొంటే, దైహిక విషయాలు వలగొనవు. దేహమనేది మానవజీవితానికి అవసరమైన భౌతికరూపం. దానికొక నియమితకార్యం—ప్రయోజనం వుంది. మానవుని మానసికప్రవృత్తి—ఆధ్యాత్మికేతరప్రవృత్తి—అంతా చెడుగే అనడానికి వీలులేదు. దేహం తటస్థం. ఆత్మబలాన్ని అభివృద్ధి చేసికొని విషయవాంఛలను నిగ్రహించాలి. ఆధ్యాత్మిక తత్త్వంగలవ్యక్తి ఆత్మోన్నతి పొందడానికి ఉపయోగించే ముడిపదార్థం దేహం. ప్రాపంచిక సుఖకాంక్షగలవారు మాత్రం దేహాన్ని దుర్వినియోగం చేసికొంటారు. ఇలా మానవుడు ద్వైతమూర్తి అనవచ్చును. మానవుడు ఐహిక విషయాసక్తినుండి ఎంతదూరంగా జరిగితే తన గమ్యస్థానానికి అంతదగ్గిరివాడౌతాడు.

బ్రహ్మచర్యం ఒక ఉత్తమధర్మం. దైహికసుఖాల విసర్జనవల్ల ఇది సాధ్య మౌతుంది. అభ్యాసంవల్ల ఏర్పడిన విషయవాంఛలను వీడడానికి గట్టియత్నం, దీక్ష అవసరం. అంతేకాదు. ఈ అలవాట్లు—ఈ ఐహిక విషయాసక్తి—

తిరిగి తలయెత్తకుండా జాగ్రత వహించాలి. నిజానికి, వాటి అభ్యాసం సులభసాధ్యం; విసర్జన కష్టసాధ్యం.

మానవుని జీవితపు వన్నె నిర్ణయించడానికి గీటురాయి అతని వస్తుసంచయంకాదు. యాంత్రికాలైన వివిధ సాధన సామగ్రులతో మానవుడు భౌతిక జీవనంలో సౌకర్యం, సౌఖ్యం పొందుతున్నాడేగాని, ఆధ్యాత్మిక జీవనంలో అతడు ఎంత తక్కువస్థాయిలో వున్నాడో తెలిసికోవడం లేదు. త్యాగము, నిస్సంగత్వము అలవడితే ఆత్మనైర్మల్యం సిద్ధిస్తుంది. ధర్మదీక్షావర్తనులము కావచ్చు. ఋజుప్రవర్తన వలన జీవితానికి సౌరభం కల్గుతుంది. శాంతి సంప్రాప్తిస్తుంది. భోగభాగ్యాలవల్లగాని, తామరతంపరగా పెరిగే సంతానం వల్లగాని, తీఱికలేని కృషివల్లగాని కాక, సర్వసంగత్యాగ శీలం వల్లనే మోక్షం సాధ్యమౌతుంది. కూటదంతసుత్తలో చెప్ప బడినట్లు – జంతుబలికంటె ఆత్మబలి హెచ్చైనది. పాపహేతు వులగు కోరికలను భగవంతునకు తెల్పుకొనువారు జంతుబలి వృథాయని గ్రహింపగలరు. రక్తతర్పణంవల్ల హృదయ నైర్మల్యం కలుగదు. తృష్ణను సమూలంగా తీసివేస్తేనేగాని ఆత్మ పరిశుద్ధముకాదు. గుడిగంటలు వాయించడంకంటె ధర్మదీక్షా కంకణం ధరించడం శ్రేయస్కరం – అని బుద్ధుని ప్రవచనం. సెయింట్ పాల్ అంటాడు: "ప్రాపంచిక సుఖా సక్తుడవైతే నీజీవితానికి మరణం ధ్రువం. ఆత్మిక జీవనంలో నీవు ప్రాపంచిక సుఖాసక్తికి మరణం కల్పిస్తే నీ జీవితం శాశ్వతం"–అని. "క్రీస్తువలె విశ్వకళ్యాణానికై త్యాగం ప్రదర్శిస్తే అతనికి సన్నిహితులము, దేవునకు హితులము ఔతాము. కావున, సోదరులారా! కరుణామయమూర్తి

మైన దేవునకు మీ దేహాలు అపవిత్రం కాకుండా అర్పించి, మీ ఆధ్యాత్మిక ప్రార్థనా పాటవాన్ని ప్రదర్శించండి"- అంటాడు అపొస్తిలు.

ఆత్మనిగ్రహావకాశం అధికంగా కల్పించుకోడానికై కొందఱు ప్రాపంచిక వ్యవహారాలు పూర్తిగా వదలివేసి- సంసారం విడచి-సన్యసిస్తారు. అనాదిగా మనకు హైందవ- బౌద్ధ సన్యాసాశ్రమాలు వుంటూన్నై. అపొస్తిలుల నుండి ఈలాంటి ఆచారం క్రైస్తవులలోగూడ ఏర్పడింది. సిస్టెరన్ సంప్రదాయంవారు శాంతియుతమైన ఏకాంత ప్రదేశాలలో ఇలాంటి ఆశ్రమాలు నిర్మించారు. వీని తొలిమఠం బర్గండీలో క్రీ. శ. 1098-వ సంవత్సరంలో వెలసింది. ఆశ్రమవాసులు నిరాడంబర శుద్ధ ధర్మజీవనం అభ్యసించేవారు. ఇలాంటి ప్రముఖులలో సుప్రసిద్ధుడు సెయింట్ బెర్నార్డ్. సెయింట్ బెనెడిక్ట్ మాటలలో చెప్పాలంటే. ఇలాంటి ఆశ్రమజీవితం మతనిష్ఠకు నాంది. ఆశ్రమ జీవితంలో మతగురువుల ధర్మ ప్రబోధాన్ని తు. చ. తప్పకుండా అనుసరించేవారు మత లక్ష్యాన్ని సాధించగలరు; గమ్యస్థానాన్ని చేరగలరు. ఆశ్రమ జీవితం మాత్రమే ఆధ్యాత్మికజీవన పరిణతి కాదు. దేహాన్ని, ఆత్మను పరిశుద్ధి చేసికోడానికి మహమ్మద్ సంవత్సరాని కొకమాసం-రంజాన్-ఉపవాసం విధించాడు. దీనివల్ల దేహం కట్టుబాటులోనికివచ్చి దార్ఢ్యం తొలగుతుంది. ఆరోగ్యం కలుగుతుంది. ఆహార విసర్జనంతోబాటు చెడుతలంపులు, చేతలు విడవటంగూడా ఉపవాసమే-అంటుంది కురాన్.

ధ్యాననిష్ఠను అభ్యసించడం అంటే ప్రాపంచిక వ్యవ హారాలనుండి పూర్తిగా దూరమగుటకాదు. చిత్తత్వ

విభూతికి ప్రపంచ వస్తువులనుగూడా సాధనంగా ఉపయోగించడం జరుగుతుంది. దేహావసరాలను పూర్తిగా కాదనడు. ఆత్మోన్నతికి దేహాన్నిగూడా ఒక సాధనమార్గంగా ఉపయోగిస్తుంది. ఇంద్రియాలలో వేటినిగూడా కావలెనని చెడగొట్టనవసరంలేదు. వాటిని అదుపులో పెట్టాలి. మనోవికారాలకు, ప్రపంచ సుఖాసక్తికి—చిక్కక ఆత్మనిగ్రహాశక్తిని వృద్ధిచేసికోవాలి.

సంఘంలో ఏ అంతస్తులలో వున్నా మానవులందఱూ భగవంతునకు ప్రియులే. ధ్యానయోగంలో దైవభక్తి, ధర్మనిష్ఠాపరత ఏర్పడుతవి. వీనివల్ల సంఘంలో అందఱికి సమానంగా న్యాయం, ధర్మం లభించే కృషికి త్రికరణశుద్ధిగా పూనుకొని సంఘాభ్యుదయానికి, లోకకళ్యాణానికి ప్రోది చేయవచ్చును. ప్రతివ్యక్తి యిది తనవిధి అనితలచి నిర్వర్తించాలి. న్యాయం విధి. ధర్మనిరతి అందుకు అనువైన యోగ్యత. "చెడుతలంపులు, చెడుపనులు మానండి. మంచి చేయుట నియమంగా అనుష్ఠించండి. న్యాయాన్ని నిలుపండి. పీడకులను అణచివేయండి. పితృహీనులకు, అనాథలకు బాసటగా నిలువండి"—అని దేవుని సందేశంగా ప్రవక్త ఉద్బోధిస్తాడు.

బుద్ధుడు సమస్త జీవకోటియందు కారుణ్యం ప్రబోధిస్తాడు: మనో నిశ్చయం వుండాలి. నీచప్రసంగం కూడదు. ఏకోశానా ద్వేషం ఉండరాదు. సమస్త భూతములయందు ప్రేమ, కారుణ్యం వహించాలి. అసూయ, పాపచిత్తం వీడి సమస్తజగతిని దయారసంతో ముంచియెత్తాలి—అంటాడు. తనశిశువుక్షేమంకోసం, రక్షణకోసం తన జీవితాన్నైనా బలి

పెట్ట సిద్ధపడే తల్లిలాగా ప్రాణికోటియందు నిస్తుల ప్రేమ ప్రకటించాలి - అంటాడు. బుద్ధపదవి పొందినవారిలో సుప్రసిద్ధుడైన అమితాభుడు ఒకప్పుడు పరాశరి. అతడు జీవకారుణ్యబద్ధజీవనుడై అందుకై నలుబదియారు శపథాలు చేశాడు. తనశక్తి విజ్ఞాన ప్రతిభలను మానవకోటి సముద్ధరణకై వినియోగించడానికి నిశ్చయించాడు. అతనినిగూర్చి ధ్యానించేవారికి అతని మహత్తర జ్ఞానంలో పాలుదొరకి మోక్షమార్గం లభిస్తుంది. ఇలా ఒకరి మహాత్మ్యము ఇంకొకరి ఉద్ధరణకు వినియోగించే పరివర్తన సిద్ధాంతం జీవకోటిలోని అన్యోన్యాధారాన్ని సూచిస్తుంది.

స్వర్గానికి ప్రతిరూపం మర్త్యం. విశ్వమానవ సంఘం ఆస్తికతత్వంమీద, సమష్టిక్షేమంమీద ఆధారపడి వున్నది. ఈ భావ ప్రభావం విశ్వకళ్యాణానికి దోహదమిస్తుంది.

## (4) జ్ఞానమార్గము

తర్కజ్ఞానంవల్ల పారమార్థికసత్త ప్రాంగణంవటకే చేరగలము. అంతమాత్రాన దానిని పొందలేము. మానవస్వభావంలోని లోపాలనన్నిటినీ దాటితేగాని అది సాధ్యం కాదు. అందుకై దేహము, మనస్సు, ఆత్మ ఉత్తమగుణాలను అలవరచుకోవాలి. దేహేంద్రియాలవలన కలిగే కాలుష్యాన్ని తుడిచివేసి ఆత్మదృష్టిని వికసింపజేయాలి. దేహమే పాపానికి, అవినీతికి నిలయమనడం పిశాచాధిపతికి - సైతాన్ కు - శాశ్వతత్వం ఆరోపించడం ఔతుంది. ఏదియో ఇతర ప్రపంచంలోవున్న క్రొత్తవానిలా ఆత్మికుడైన మానవుడు తాత్కాలికంగా దేహంలో బంధింపబడినాడనరాదు.

దేహం ఆత్మకు బంటు; చెఱసాలకాదు. మానవుడు బ్రహ్మ శక్తి పూరితమైన చరాచర ప్రపంచంలో ఒక సృష్టికి ఆశయం జీవనం. అది మానవుని శాధ్యత. దేహానికి ఆత్మ ఎట్టిదో, విశ్వజగతికి బ్రహ్మలోక మట్టిది. మానవుడు పరిపూర్ణత పొందడానికి అభ్యాంతరం దుష్కార్య ప్రేరేపకమైన బుద్ధియేగాని దేహంకాదు. దేహం దేవునకు ఆలయంవంటిది.

మానవుడు తన మనోవికారాలను, హృదయ వాంఛలను అదుపులోపెట్టి వాటిని ఆధ్యాత్మికతత్త్వమార్గానికి త్రిప్పాలి. ఈ శరీరంతోడనే, ఇపుడే, ఈ లోకంలోననే ఆధ్యాత్మిక జీవనం పొందవచ్చు. పునీతుడు ఈ జీవితంలోననే, ఈ దేహంతోడనే బ్రహ్మసాక్షాత్కారం పొందగలడు.

ప్రతివ్యక్తిలో బ్రహ్మతత్త్వ బీజం వున్నది. దానిని పెరుగనీయాలి. తగిన దోహదమిస్తే అది పెరిగి, చిగిర్చి, పుష్పిస్తుంది. మనం తెలిసికొన్న దానికంటె ఎక్కువజ్ఞానం కన్పిస్తూవుంటుంది. ఎంత చీకటిలోనైనా కాంతికిరణం కన్పిస్తుంది; చీకటి దానిని దాచిపెట్టలేదు. బీజగర్భాన్ని చూడాలి అంటే పైగుల్లను బ్రద్దలుకొట్టాలి. ఆలాగే వెలుగును చూడాలి అంటే తమస్సును పోగొట్టాలి.

ప్రశాంతతతో అంతరాంతరాలలో ఆత్మధ్యాన దృష్టి ద్వారా పరమ సత్యాన్ని దర్శించవచ్చును. మానవుని శక్తుల నన్నిటినీ ఈ సాధనకు కేంద్రీకరించాలి. ధ్యానమంటే మనసులో, తలపులో, భావములో శూన్యత కాదు. ప్రాపంచిక వ్యవహారాలనుండి, శ్రమక్లేశ భారాలనుండి తప్పించి మనసును నిరవద్యము, నిరవధికమునైన ప్రశాంతతతో పరమ సత్య

సందర్శనానికి కేంద్రీకరించాలి. ఈ సమధిక సమసమాధి బహుళసాధన వలనగాని సంప్రాప్తించదు.

యోగమునకు లక్ష్యము ఆత్మకు పరిపూర్ణత సాధించుట. నిస్తులమైన ఆత్మచైతన్య సమీకరణ వలన ఇది సాధ్యమౌతుంది. యోగనియమాలు, సూత్రాలు వివిధమతాలలో వేర్వేరు అంతస్తులలో చెప్పబడినై. మానసిక చంచలతను నిరోధించడమే, చిత్తవృత్తినిరోధమే యోగము. మనో వ్యాపార నిరోధనమూలకంగా అసలు మనసును, ఈ వ్యాపారాదికాలకు మూలమైన మనసును తెలియగలము. మామూలు మనసుకంటె అడుగున మానవునిలో నిక్షిప్తమైన నిధి-శ్రేష్ఠతమమైన ఇంకొక మనసు-వున్నది. మనసు యొక్క పైభాగంలో మన వివిధాలోచనలు తీగలు సాగుతవి. దానిక్రింద ధ్యానయోగ్యమైన స్థానమున్నది. ఈశ్వర ప్రేరితజ్ఞానం మనకు ఆత్మలో జనిస్తుంది. ఆ స్థానాన్ని తెలియడానికి ప్రశాంతధ్యానం అవసరం. ఈ ఏకాంత సాధనలోగూడా మనకు తోడువుంటుంది. మనకు ఆత్మ విశ్వాసాన్ని కల్గించే ఒకశక్తి తోడువుంది. ధ్యానయోగాన్ని బహుకాలం సాగించడం కొంత కష్టమే.

పరమేశ్వరునియందు చిత్తైకాగ్రత నెలకొల్పేమార్గం చూపుతుంది యోగశాస్త్రం. మనము చిత్తవృత్తిని నిరోధించి, సంఘర్షణ నుజ్జగించి, అంతర్జ్యోతి ప్రకాశించడానికి అదను చేకూర్చాలి అని ఆదేశిస్తుంది. దేహం ఆత్మకు ఏవిధంగా యానమో, ఆ విధంగా ఆత్మ పరమాత్మకు యానమంటుంది యోగశాస్త్రం.

చంచలత్వం లేకుండా వుండుటకు బుద్ధిని దుఃఖాతీతమైన అంతర్జ్యోతిమీదగాని, రాగ ద్వేష రహితమైన హృదయకమలం మీదగాని, మూర్ధ్న జ్యోతిపైగాని, ముక్కుపైగాని, నాలుక చివరగాని, మఱియే యితర యోగ్యభాగమున గాని నిలుపవచ్చును. పారవశ్యంగాని, మూర్ఛగాని చిత్తైకాగ్రత కాదు. అది అచంచలమైన, నిశితమైన శ్రద్ధ, ధ్యానము. ప్లాటినస్ అంటాడు: "అంతర్దృష్టిని పొంది, దైవ సంబంధం లేని వాని నన్నిటిని వదలి, సమస్తవస్తువులకు ఆధారమైనట్టి, జగత్తు కంతటికి జ్ఞేయము, ధ్యేయమునైనట్టి, సర్వజీవాధారము, జ్ఞానమూలకము, స్థితిమూలకమునైనట్టి, ప్రత్యేకంగా, ప్రశాంతంగా, పరిశుద్ధంగా వున్నట్టి పరమాత్మను దర్శింపవలెను" అని.

ఒకశ్లోకమో, మంత్రమో తీసికొని ధ్యానిస్తే చంచలత్వంతొలగి ప్రశాంతంగా ఆత్మధ్యాన సమాధిలో ప్రవేశించి, పరమేశ్వరునికి అనుకూలమైన ఆగారమై ఆవాహన చేస్తుంది. సమస్తజీవాధారమైన పరమేశ్వరుని సాక్షాత్కారం కలుగగానే, మానవసాధారణమైన అసత్య ప్రకృతి అంతరిస్తుంది. ఆ అనంత ప్రభలో వర్ణనాతీతమైన పరమేశ్వరుని అర్చనానందంలో మునిగిపోతాము.

ప్రాపంచిక బంధాలనుండి తొలగి పోనే ధ్యానయోగం సాధ్యమౌతుంది. దైనందిన జీవితావసరాలకు, శ్రమక్లేశాలకు అతీతమైన ఆత్మకు అది చక్కని నిదర్శనం. బాహ్యశక్తుల విజృంభణ ఎంత బలవత్తరమైనా, ఆత్మకు ఈ స్వాతంత్ర్యం, విముక్తి అంతరంగంలో లభిస్తవి. పరమ సత్యాన్వేషణమే జీవితాదర్శంగా వర్తిస్తే సామ్రాజ్యారామములో భవబంధ

విమోచనం, అసాధారణమైన అంతర్దృష్టి, ఆత్మశక్తియొక్క నవ్యానుభూతి కల్గి, జీవితం ఈశ్వర ప్రేరణాత్మకమై వెలుగుబాటలో విరాజిల్లుతుంది. తర్కం నిశ్చయాన్ని నెలకొల్పితే, అనుభవం వాస్తవికతను వర్ధిల్లజేస్తుంది. యోగసాధనతో దేహం, చిత్తవృత్తి, ఆత్మప్రేరణాదికములకు ఒద్దిక కల్గుతుంది. అంతటితో పరిపూర్ణత్వం, సమత్వం లభిస్తుంది. అంతర్నిహితమైన బ్రహ్మశక్తి నిరాటంకంగా తనవెల్గును వెదచల్లుతుంది.

## (5) సత్యము, ప్రేమ

స్థితి, గతి విభిన్నములుగా లేవు. ఆధ్యాత్మిక జీవనంలో అనుకంప సమధికమౌతుంది. పరమసత్యమును తెలిసి, ఒకరినొకరు అర్థముచేసికొని అభిమానించుకోవచ్చును. మన ఆలోచనలలో, మాటలలో, చేతలలో మనమెఱిగిన పరమసత్యస్వరూపాన్ని వివరించవచ్చును. ఈ భూలోక జీవితమే పరమార్థంకాదు. మృత్యుదేవత కన్నెత్తిచూడలేని సంబంధబాంధవ్యాల అనుభోగం సంభవమే. మనలోనున్న అంతర్జ్యోతి విశ్వజనీనమైంది. అది ప్రతివ్యక్తిలో వుంటుంది. భగవంతుని రూపచిత్రాన్ని తాత్కాలికంగా కొంత చెనకవచ్చునేమోగాని, మానవుని నిర్మాణంలోనే వున్నట్టి, శాశ్వతమైనట్టి ఆ దైవత్వాన్ని పూర్తిగా తుడిచివేయడం జరుగదు; జరుగలేదు. పాపులలో పాపి, దుష్టులలో దుష్టుడు కూడా కైవల్యంపొందే ఆశ, అవకాశం వుంటుంది. నరకమంటూ ప్రత్యేకంగా లేదు. కొందఱు వ్యక్తులను దేవుడు శాశ్వతంగా నరక కూపంలో పడవేస్తాడంటే నమ్మలేము. అంతర్జ్యోతి ప్రతివ్యక్తికి శాంతి, నైర్మల్యం, సంతోషం సాధించిపెడుతుంది.

మోక్షానికి కొందఱే అర్హులు అనేభావం సరికాదు. అంతర్జ్యోతిని ఆశ్రయించి అనుసరించేవారు అందఱూ మోక్షాన్ని సాధించినవారే. శక్తిగలవారు ఆ సాధనకు పూనుకోవాలి; అంతేగాని వారికెన్నటికీ ఆ అవకాశమే లేదన రాదు. ప్రతివ్యక్తిలోనున్న సత్యపరతవల్ల సృష్టిలోని ప్రతిజీవియెడ ప్రేమాదరాలు ప్రభవిల్లుతవి. అన్నిమతాలు స్వర్ణాక్షరాలలో చెక్కిపెట్టిన ఉత్తమ సూత్రమిది.

సంతోషంలో, దుఃఖంలో, భోగంలో, దుర్యోగంలో, సుఖంలో, కష్టంలో, అన్ని వేళల, అన్ని పరిస్థితులలో ఇతరులు నీపట్ల ఎట్లు వర్తించవలెనని నీవు కోరుతావో, నీవు ఇతరుల పట్ల అట్లు ప్రవర్తింపుమీ — అని మహాభారత ప్రవచనం. "ఆత్మవత్ సర్వభూతాని" అన్న సూత్రం ఇలాంటి ధర్మరహస్యాన్నే అనుబోధిస్తుంది. తనయందు నిఖిలభూతములందు ప్రవర్తించుడు సమహితత్వము నెలపడం ఏవంగుణ విశిష్టుడగుట చేతనే. లతలు పుష్పిస్తున్నె; తరువులు ఫలభారము వహిస్తున్నె; నదీనదాలు స్వచ్ఛజలాన్ని అందిస్తున్నె; గోవులు క్షీరాన్ని యిస్తున్నె; — ఏ ప్రయోజనాన్ని కోరి? పరహితతత్పరతయే కారణంకదా? స్వార్థపరత లేదే; స్వప్రయోజనం లేదే? సుజనులపద్ధతి యిట్టిదే సుమా. ఇతరుల క్షేమంకోసమే వారిమనుగడగా వర్తిస్తారు. దినకరుడు నిత్యం తన తేజస్సుతో ప్రాణికోటికి హితం కూర్చుతున్నాడు; కాసారంలో పద్మాలు వికసిస్తున్నె; కలువలఱేడు చల్లని వెన్నెల నిరచల్లుతున్నాడు; — ఎవరికోసం? విశ్వజగతి క్షేమానికేగదా? స్వలాభం ఎక్కడవున్నది? మహనీయుల నైజమిదియే.

కన్ ఫ్యూజియన్ మతస్థాపనాచార్యుని ప్రశ్నిస్తాడొక శిష్యుడు: "జ్ఞానమూర్తీ! జీవితానికి వరవడి కాగల్గిన ఒక్క సూత్రం సెలవిస్తారా?" అని. వెంటనే వచ్చింది సమాధానం; "సత్యనిధానం: తన విషయంలో తానెట్లు వర్తిస్తాడో, ఇతరుల విషయంలోగూడా అలాగే వర్తించడం" అని. ఇదే సూత్రాన్ని అతని శిష్యుడు జెంగ్ జీ వివరిస్తాడు: ప్రతివ్యక్తి తన దేహాత్మలను తానెంతగా ప్రేమించుకొంటాడో, ఇతరులనుగూడా అంతగా ప్రేమించాలి – అని. ఇలాగే ఆదేశమిస్తాడు జాన్ వెస్లీ పండితుడు: సమస్త జనులకు సర్వవేళల నీవు చేయగల్గినంత మేలు చేయుచుండుము – అని.

పొరుగువానిని నీవలె ప్రేమించుమిూ – అన్న సర్వోత్కృష్టసందేశం బైబిల్ గ్రంథంలోని సందేశహారానికి మణిపూసగా వెలుగొందుతూంది. కరుణాయత్త చిత్తులకు భగవత్కృప లభిస్తుంది. అందఱియందు ప్రేమ, కారుణ్యం, క్షమాబుద్ధి వుండాలి – అంటాడు ప్రవక్తయైన హూసీ. అతనిభార్య అధర్మవర్తనియైనా, తాను ప్రేమించాడు కాబట్టి క్షమిస్తాడు. ఇలాగే మానవులందఱూ ప్రియులే కాబట్టి దేవుడు వారికి క్షమాభిక్ష ప్రసాదిస్తాడని అతని దృఢవిశ్వాసం. స్వజనులకు, పరజనులకు, అందఱికు ఒకే న్యాయం, ధర్మం ఉండాలి అంటాడు మోసెస్. మనకందఱికు దేవుడొక్కడే తండ్రి; అతడే ఈ విశ్వాన్ని అంతటిని సృష్టించాడు – అన్న సూక్తి ప్రాతనిబంధన గ్రంథంలో పరిష్కృతమైంది. నీకైతే ఏది నచ్చదో దానిని సహజీవులకు కలుగనీయకుమా – అని వచిస్తాడు హిల్లెల్.

అహింస – భూతదయ – జైనసిద్ధాంత రత్నాలలో నాయకరత్నం. గౌతముడు బుద్ధుడైన పిదప ప్రజలకు నిర్వాణ సాధనమార్గాన్ని ఉపదేశించడంలో తన జీవితాన్ని గడిపాడు. మాతృసిత మాటలలో బుద్ధుని సౌజన్యం, సౌశీల్యం, విశాలహృదయం, కారుణ్యాపరత్వం ఇలా అభివర్ణిత మైంది: "అతడు చెడుచేయవచ్చిన వైరికి హితుడై మంచి చేస్తాడు. అనుదినం అవినీతి వర్తనులైన వారిలోగూడా మంచి కోసం కంచు కాగడా పెట్టి గాలిస్తాడు" అని.

బోధిసత్త్వుని పరమాదర్శాన్ని శాంతిదేవుడు ఇలా గానం చేస్తాడు:

నేను నెఱపిన ధర్మపరత్వానికి ప్రతిఫలంగా సమస్త
భూతకోటికి గల దుఃఖాన్ని తుడిచివేయ నుంకిస్తాను.

నేను రోగులకు ఔషధాన్ని, వైద్యుడిని, పరిచారకుడనై
వారి కెన్నడు మళ్లీ రుగ్మత కలుగకుండా చేయుదునుగాక!

జలము, ఆహారము వర్షించి, ఆర్తుల ఆకలి దప్పులను
తీర్చుదును గాక! యుగాంతంలో క్షామం కలిగినప్పుడు
నేను అందఱకు అన్నపానములై వారి వ్యధతీర్చుదునుగాక!

పేదలకు అక్షయమైన పెన్నిధినై, వారికివలసిన
సమస్త వస్తువులు సమకూర్చుదునుగాక!

సమస్తభూతకోటి తనగమ్యస్థానాన్ని చేర
గలందులకై నా జీవితం, సుఖాలు, భూత
భవిష్యద్వర్తమానములలో నేను సంతరించిన
ధర్మశీలములను ధారవోయుదును గాక!

సమస్త వస్తు సంచయ సమర్పణలో ప్రశాంతత
సంప్రాప్తిస్తుంది, కాబట్టి ఆ ప్రశాంతత కై
నేను అర్పణచేస్తే, అర్పణ నా తోడి
జీవులకే చేయుదునుగాక !

భూతకోటికి నేను దాసోహమంటాను. వారు
నన్ను కొట్టినా, తిట్టినా సరే. నాపై దుమ్మెపోసినా,

నా కాయంతో బొంగరాలాడినా ఫరవా లేదు.
నన్ను ఛీత్కరించినా, గేలిచేసినా వారి యిష్టమే.
ఔను, నాదేహాన్ని వారికి అప్పగించిన పిదప
వారేమిచేస్తే నాకేమి?
నన్ను దూషించువారు, నాకు అపకారము చేయువారు.
నన్ను అపహసించువారు, అసూయ పడువారుగూడా
జ్ఞానబోధామృతమును త్రావి త్రేన్చుదురుగాక !

నేను నిరాధారులకు సహాయకుడను; పాంథులకు
మార్గదర్శకుడను; సంసారసాగరమును తరించ
గోరువారికి నావను, వంతెనను అయ్యెదనుగాక !
వెలుగు కావలసిన వారికి దివ్వెను, పడక కావలసిన
వారికి పడకను, సేవకుడు కావలసిన వారికి
సేవకుడను అగుదును గాక ! — అని.

మత్తయి సువార్తలో అంటాడు. ఇతరులు నీకుప
కృతి సేయగోరెదవో, నీ వితరులకు అదే యుపకృతి సేయుము.
నిన్ను ప్రేమించిన వారిని ప్రేమించుటేమిగొప్ప? నిన్ను

వంచించిన వైరులను ప్రేమించుము. నిన్ను ద్వేషించినవారికి ఉపకారమొనర్పుము. నిన్ను బాధించి వేధించువారి క్షేమమునకుగూడ దేవుని ప్రార్థింపుము – అని.

సాది చక్కని ప్రవచనంలో ఒక్కమాట :
దేవుని దయా దాక్షిణ్యములు ఎంత
మహత్తరమైనవో గమనింపుము :
పాపము చేసినదేమో బానిస ;
బాధ అవమానములు భరించినదేమో

భగవంతుడు !
ఫరీద్ ! నిన్నెవ్వడైనా, కొట్టినా
అతనిని తిరిగి కొట్టవద్దు ; అతని కాళ్లకు మ్రొక్కు.

ఫరీద్ ! నీవుసమస్తజగదధినాథుడైన దేవుని దర్శింపగోరితివా, నలుగురునడచు బాటలో పూరి వగుటకు పూనుకో.

ఫరీద్ ! నిన్నెవ్వడైనా విఱుగగొట్టి పడవేస్తాడనుకో,
మఱియొక్కడు నిన్ను కాళ్లక్రింద మట్టుతాడనుకో,
ఫరవాలేదు ; నీవు దేవుని న్యాయ – ధర్మ – ఆగారానికి
అపుడే తరలి పోతావు !

విశ్వవాఙ్మయ మహోదధిలో ఇలాంటి అనర్ఘరత్నాలు అశేషంగా వున్నై. వాటిని అరసి, అనుభవించి, ఆనందించాలి.

## (6) పవిత్రజీవనము

పవిత్రజీవనం చక్కని మతానుష్ఠానానికి నిక్కమైన తార్కాణం. ఈ విషయం ఏకాలంలోనైనా, ఏమతంలోనైనా కన్పిస్తుంది. సాధారణ మానవులు, లౌకికవ్యవహార

గౌరవప్రతిష్ఠలని భావించేవానితో ఆత్మ సంస్కృతిపొందిన పవిత్రజీవనులకు పనిలేదు. వారి లోకమేవేఱు. వారివారి ఆదేశాలలో, అభిరుచులలో, దృక్పథాలలో కొన్ని భేధాలు వున్నా సెయింట్ ఫ్రాన్సిస్, రామకృష్ణ పరమహంస, గాంధిమహాత్ములకు ఈ విషయంలో ఎంతో సన్నిహితత్వం కన్పిస్తుంది. వారు మానవతత్త్వసాగరాన్ని మథించి దైవ-సోదరమానవ-ప్రేమామృతాన్ని యెత్తి జుర్రిన మహనీయులు. మానవ జీవితపు సత్యసారభాన్ని నేల నాలుగుమూలలకు వ్యాపింపజేసిన గంధవాహులు.

పవిత్రజీవనులు ప్రపంచవ్యవహారములను అసలు పట్టించుకొనకపోరు. వస్తుమయ ప్రపంచాన్ని పూర్తిగా వదలివేయరు. కేవలం భగవద్ధ్యానంలోనే కాలంగడుపరు. వారు ప్రపంచంలో ఒకభాగం మాత్రమేకాక, అందుకు మూలమౌతారు. దేహధారులే కాబట్టి వారికి మంచి చెడుగులభేదాలు గమనించవలసిన పనిలేకపోలేదు. పరబ్రహ్మ వ్యక్తిగతరూపంలో ఆవిష్కరణ పొందుతుందిగాని, వ్యక్తిని పూర్తిగా కబళించివేయదు. చిత్తత్త్వవిజ్ఞాతల ప్రతిరూపం జ్ఞానులనైతికనిష్ఠలో ద్యోతకమౌతుంది. అందువలననే పవిత్ర జీవనులు ఎప్పుడూ ఆర్తులను ఆదరించడానికి సన్నద్ధులుగా వుంటారు. లోకంలో ఏమూల శోకం కల్గినా మాన్పడానికి — అలనాడు గజేంద్రుని కుయ్యాలించివెళ్లిన విష్ణుమూర్తిలాగా — తత్క్షణమే తయారౌతారు. విశ్వాన్ని తనలా ఎంచుకొని ఎప్పుడు ఏ అవకాశంకల్గినా పతితదీన మానవోద్ధరణకు పరుగులిడుతారు. ఇదేమాట అంటాడు ట్రాహెర్న్ : ఈ విశ్వ సాగరము మనరక్తనాళాలలోనేవుంది. నక్షత్రాలు అందలి

రత్నాలు - అని. సమస్తవస్తువులను పవిత్రములుగా పరిగణించే భవ్యతత్త్వ పరిరంభణలో అహంకార మమకారాలకు, అధికారభోగాలకు, అనిత్య విషయవాంఛలకు తావుండదు.

ఆధ్యాత్మికతత్త్వంలో బాహ్యవస్తువులను విసర్జించినా, అవి శ్రోత్రదృక్పథంలో వుంటాయి. వాటితో ఒక విధమైన అసంగత్వ మేర్పడుతుంది. అందులో ఆనందంతోస్తుంది. పునర్జన్మపొందిన ఆత్మ ప్రశాంతితో, ఇంద్రియనిగ్రహంతో విలసిల్లుతుంది. అట్టి ఉన్నతపదము పొందినవారు ధర్మో ద్ధరణకు, జగత్కల్యాణానికి పూనుకొంటారు. వారికది సహజ ప్రవృత్తి అవుతుంది. ప్రసూనం సువాసన లీనుతుంది; మధుపం తీయతేనియకూడబెట్టుతుంది; సాలీడు సన్ననిదారం తీస్తుంది; - ఎందువల్ల ? ఎవరికోసము ?- మహాత్ముల చరితము లిట్టివే. మహాత్ములకు వారి కుటుంబమని, వర్గమని, మతమని, జాతియని, దేశమని ప్రత్యేకాభిమానం వుండదు. విశ్వమంతా వారి సమాదరణ పొందుతుంది. వారి అంతరాంతరంలో వుండి, బాహ్యదృష్టికి గోచరంకానట్టి శాశ్వత మహనీయతకు వారిజీవితం ఒక చిహ్నంమాత్రమే. మానవ సంఘోద్ధరణము వారి నిత్యకృత్యం. సత్యం వారి ఇలవేలుపు. ధర్మం వారి ప్రకృతి. మహాయాన మతధర్మం ప్రకారం బోధిసత్త్వుడు కర్మసిద్ధాంత బద్ధుడుకాకపోయినా, దుఃఖితజీవులను ఉద్ధరించ రించడానికి నిరంతరము కృషిచేస్తాడు. అఖిలభూతములు మహాత్ములకు ఆత్మతుల్యములే. సెయింట్ పాల్ ఇలాగే అంటాడు: ఔను, ఈ బాధ్యత, ఈ అవసరం నాతలపైనున్నది - అని. ఇదే నాకర్తవ్యం, నాకితరమెందుకు ?- అన్న సెయింట్ లూథర్ ఉదాత్తవచనంలో ఇదే ధర్మసూత్రం తొణికిసలాడు

తుంది. ఏతాదృశ ధర్మవర్తనకై ఒక పరమశక్తి వారినాడీ మండలంలో అహరహం తంబుర మీటుతూ ఉంటుంది.

సామాన్య జీవితానికి, ధ్యానవృత్తికి ప్రత్యేకమైన హద్దులు లేవు. ప్రశాంతమతులు లాభనష్టాలతో, సుఖ దుఃఖాలతో భయాందోళనలతో మిళితమైన సామాన్యజీవిత సంరంభంలో పాల్గొనకపోయినా, వారు సర్వంవదలి సన్యసించారనరాదు. సంఘానికి వారి ఆత్మబలప్రభావం సంక్రమిస్తుంది ; ఉత్తేజం కల్గుతుంది. లౌకిక వ్యవహారాలలో కష్టనష్టాలు కల్గుతవి అనేభయంతో వ్యావహారికజగత్తు నుండి విరమించడంకూడదు; కాని, ఆంతరంగిక ప్రబోధం కల్గితే అలా విరమించవచ్చును.

అప్పుడప్పుడు కొద్దికాలంపాటు ప్రశాంతంగా ఏకాంత వాసం జరుపడం ఆత్మాభివృద్ధికి అనుకూలిస్తుంది. వారాని కొకరోజు విశ్రాంతి తీసికోవడం, ప్రతిదినం కొన్నినిముసాలు ప్రశాంతంగా ధ్యానంచేయడం చాలమంచి నియమాలు. ఇందుకు సన్యాసం అగత్యంకాదు. జ్ఞానులుకాని సామాన్యులు గూడా ఇలాంటి ధర్మాలను అరసి అనువర్తించడం అవసరం.

కోట్లకుపడగెత్తిన శ్రీమంతుడు అనాథపిండకుడు ఒక సారి బుద్ధుని దర్శించాడు. బుద్ధదేవా! నేను సన్యసించ దలచాను, ధర్మదీక్ష ఇప్పించు – అని అడిగాడు. బిడ్డా! నీకెందుకాపని? నీవృత్తిని సక్రమంగా జరుపుకో. మానవుని బానిసగా చేసేది జీవితం, భాగ్యం, అధికారం కాదు ; వాటిని అంటిపెట్టుకొన్న తృష్ణయే. నశించవలసినది జీవితం కాదు, అహంభావము. తామరాకుపై నీటిబొట్టువంటిది అశాశ్వతమైన ఈ ప్రపంచంలో మానవుని ఆత్మ. మానవుడు

తృష్ణ, అజ్ఞానములనుండి విముక్తిపొందితే కారుణ్యం, ఆనందం అవతరిస్తవి. రాగద్వేషరహితుడైన ప్రశాంత చిత్తుని హృదయం కారుణ్యరసపూరితమై, సత్కార్యాచరణను ప్రబోధిస్తుంది. ఇట్టి కర్మకౌశలమే యోగము.

యోగి సామాన్యజీవితానికి సాక్షి మాత్రమే. అందు మగ్నం కాకుండా, తన ఆధ్యాత్మిక జీవనాన్ని నడపుకొంటాడు. సామాన్యమానవులు ద్రష్టలై, కర్మపరులైతే నాగరకత పరిణతిపొందినట్లే, సెయింట్ థెరెస్సా చెప్పినట్లు ఇట్టి విశ్వాసము, ఇట్టి సత్కార్యాచరణమే ఆధ్యాత్మిక సంయోగమునకు సత్ఫలితము.

## (7) దైవమానవులు

గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు మొదలగువారు దైవమానవులు. వారి పేళ్లనుబట్టియే వారిద్వంద్వ ప్రవృత్తి తెలుస్తుంది. వారు ఆకారంలోమాత్రం సామాన్య మానవులు ; ఆచరణలో దైవసములు. జ్ఞానమూర్తులైన బుద్ధుడు, క్రీస్తుద్వారా దైవతత్వం వెల్లడియాతుంది. జొరాస్టర్ పదంగూడా ఇలానే ఒక బిరుదు. అతని అసలుపేరు స్పీటమా. బుద్ధుడు క్రీస్తులాగా మానవరూపంలో పరమసత్యాన్ని ప్రకటిస్తాడు. అయితే, వారిలో సామాన్య మానవతకు, నిరవద్యమైన దైవత్వానికిగల సంబంధం ఎట్టిది ? పరమసత్యం ఇలా సాన్వయరూపంలో ఆవిష్కరణ పొందుతుంది. ఈ ఆవిష్కరణ దేనికదే ప్రత్యేకమైనది ; నిరుపమానమైనది. మానవుడు పరిపూర్ణత పొందడంలో దైవత్వం ప్రాప్తిస్తుంది. బంధ విమోచనంతో మోక్షం పొందుతాడు. అది పరమసత్య

సందర్శనం; వ్యక్తికి సంఘానికి మధ్యవుండే సంఘర్షణలేని అత్యుత్తమ పదము.

యథార్థ మానవతయొక్క పరిణతి దేవమానవత. మామూలు రాజకుమారుడైన గౌతముడు, అతి సామాన్యుడైన ఏసు పొందిన ఉత్తమ పదము ప్రతివ్యక్తి పొందుటకు వీలున్నది. మానవుని ప్రవృత్తి అచట పరిపూర్ణత పొందింది. గౌతమ బుద్ధుడు, ఏసుక్రీస్తు మనకు జ్యేష్ఠ సోదరులు; మార్గదర్శకులు, ఆదర్శ ప్రాయులు. వారి మాటలు వరాల మూటలు. వారు చూపిన బాటలు వెలుగు తీవల తోటలు. అచటి అమృత ఫలాలు అనేకము. వాటిని ఆస్వాదించడంలో కలిగే ఆనందం అనంతము, అనిర్వచనీయము. గౌతముడు, ఏసు సాధించిన దైవతత్త్వం వారిని ఈ లోకంనుండి వేఱు చేయదు. ఏసు పవిత్రుడే; అయినా అతనిలో మానవత రూపుమాయలేదు. నిజానికి మానవ ప్రకృతికి పాపమే పని కాదు. అది మానవ ప్రకృతియొక్క దుష్ట పరివర్తనం. సామాన్య మానవులలో దైవాంశ, అస్పష్టంగా, నిగూఢంగా, అపరిపూర్ణంగా వుంటుంది. సత్య సాధనవల్ల అది పెరిగి, అమిత శక్తిమంతమై ప్రజ్వరిలుతుంది. తన దివ్యకాంతులతో మిఱుమిట్లు గొల్పుతుంది. గౌతముడు బుద్ధుడైనాడు. ఏసు క్రీస్తయినాడు.

లోకంలో జన్మించిన ప్రతివ్యక్తిలో అంతర్జ్యోతి వుంటుంది. హృదయంలోని దైవాంశ, లేక బీజం వ్యక్తికంతటికి పునరుజ్జీవనం కల్పిస్తుంది. హృదయాధిష్ఠితమైన దైవాంశలో నిశ్చల విశ్వాసం సమధికమైతే బంధవిమోచనం కల్గుతుంది. దీనికి అవరోధమే వుండదు.

దైవ సాక్షాత్కారం పొందిన మహాత్ముడు దేవుడే అని తోచునట్లు వర్తిస్తాడు. దేవునితో ఐక్యము సాధించిన మహానీయులు కరుణచే భగవంతునితో సములౌతారు. ఏసు స్వభావముచేత క్రీస్తుగా పరిగణింపబడి దేవునితో సముడైనాడు. ఔను, ఎఱ్ఱగా కాలిన ఇనుము అగ్నిగా మారుతుంది.

అతడెంత గొప్పవాడైనను ఏ వ్యక్తియు భగవంతుని సంపూర్ణ స్వభావమును వ్యక్తీకరింపలేరు, భగవంతునిస్థితిలోని ఒక్కొక్క అంశను ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క రూపమున వ్యక్తీకరిస్తాడు. ఈ వ్యక్తులలో ఒక్కొక్కడు ఒక్కొక్క అవసరానికి అనురూపంగా వెలుస్తాడు. జీవిత స్థితిలో నిబిడమై యున్నట్టి, అపారము, అనంతమునైనట్టి పరమసత్త వివిధ ప్రయోజనాల సాధకంగా ద్యోతకమౌతుంది. ప్రతి మానవునకు స్వతస్సిద్ధమైన ప్రత్యేక వ్యక్తిత్వమున్నది. అతడు తన వర్గంయొక్కగాని, పొరుగువానియొక్కగాని కేవల ప్రతిబింబంకాదు. ప్రతివ్యక్తి తన మార్గాన్ని తానే యెంచుకొని అనుగమించాలి. వ్యక్తులు ఉన్నత స్థాయికి పోయినకొలదీ, వారి గుణభావాలు సువ్యక్తమౌతవి. ఏ ఒక్క వ్యక్తిలోను భగవంతుని స్వభావ సర్వస్వము వ్యక్తమౌతుంది అనడానికి వీలులేదు.

ప్రాగ్దేశాలలో, పాశ్చాత్య దేశాలలోగూడా ఈ దేవ మానవులను భగవదవతారములుగా వర్ణించే అచారం కన్పిస్తూన్నది. శ్రీరాముడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు ఇలా పరిగణింపబడ్డారు. అయితే రామాయణకర్త వాల్మీకి మహర్షి ఏమంటున్నాడు? శ్రీరాముని చేతనే చెప్పిస్తున్నాడు: నేను సామాన్య మానవుడను; దశరథతనూజుడను – అని. శ్రీమ

క్లేశాలు అన్నీ అనుభవించి, తరించి అతడు దైవపదము పొందాడు. శ్రీరాముడు విష్ణుమూర్తి అవతారమని హైందవుల సంప్రదాయం. రావణునితో మాల్యవంతుడంటాడు: శ్రీరాముడు సామాన్యుడు కాడు, శ్రీ మహావిష్ణువు సుమా – అని. ఒక సందర్భంలో రావణుడుగూడా రాముని దైవాంశ సంభూతునిగా పరిగణిస్తాడు. ఋషులందఱూ శ్రీరాముని భగవత్స్వరూపునిగా భజించి ఆనందిస్తారు. మానవలోక సాధారణమైన కష్టనష్టాలతో, సుఖదుఃఖాలతో సంబంధం లేక భగవదవతారం అవతారంగానేవుంటే మానవులకు ఏమి ప్రయోజనం? వారు లక్ష్యించి, అనుసరించి నేర్చుకొనేది ఏమి వుంటుంది? అతడు దేవుడు అయితే అనుకరణకు అసలే వీలులేదు. అతడుగూడా మనవలె సామాన్య మానవుడై అనుదిన జీవితసంఘటనలు అన్నీ అనుసరించి, జయించి, తరించితే, అదిమనకు చక్కని గుణపాఠము, ఆదర్శము ఔతుంది.

లోకంలో ధర్మం నశించి అధర్మం తలయెత్తినపుడు ధర్మ సంస్థాపనమునకై భగవంతుడు ఏప్రవక్తరూపముననో అవతరిస్తాడని హైందవ మతానుష్ఠాతల నమ్మిక. జ్ఞాన యోగాన్ని ప్రవచిస్తూ శ్రీ కృష్ణ భగవానుడు సెలవిస్తాడు గీతలో: "ధనంజయా! ధర్మమునకు ఎపుడు భంగము కల్గునో అపుడు అధర్మమును అణచివేయుటకై నేను భూమిపై అవతరించుచుందును. సాధురక్షణమునకు, దుష్ట శిక్షణమునకు, ధర్మ సంస్థాపనమునకు నేను ప్రతియుగమునందు జన్మించుచున్నాను" – అని. తమ మతాచార్యుడగు జొరాస్టర్

ఇలాగే భూదేవి ప్రార్థనా ఫలితంగా అవతరించాడని జొరాస్త్రి యను మతస్థుల విశ్వాసం. క్రీ. శ. 1-వ శతాబ్దంలో ప్రచారం పొందిన క్రైస్తవ మతశాఖీయులైన నజరేనులు, 2-4 శతాబ్దులలో ప్రసిద్ధిపొందిన యూదుల క్రైస్తవశాఖవారు ఏసు క్రీస్తును మహా ప్రవక్తగా మాత్రమే గణిస్తారు. అతడు దేవ సముడని వారువప్పుకోరు.

క్రైస్తవులు చారిత్రక పురుషుడైన ఏసుకు దైవత్వమారోపించారు. ఏసుక్రీస్తు రక్షకుడన్నారు. అట్లే బౌద్ధులలో నొకశాఖ గౌతమ బుద్ధుని భగవానుడనీ, లోకరక్షకుడనీ ఆరాధించారు. క్రైస్తవంలో ఏర్పడిన త్రిమూర్తిత్వ సిద్ధాంతమువలెనే బౌద్ధములో త్రికాయ సిద్ధాంతం వెలసింది. వీరు కాయము త్రివిధములంటారు: పరమసత్తరూపము, జ్ఞాన, కారుణ్య సంకలితమునైన ధర్మకాయము; విజ్ఞాన భరితము, చిదానంద రూపమునైన సంభోగకాయము; ఆకారంలో, ఆచరణలో సామాన్య మానవత గల్గి గౌతముని రూపమున బుద్ధుడైననిర్మాణకాయము. గౌతమ బుద్ధుడొకడే; అవి మూడును ఒకే సత్యముయొక్క మూడు భావములు.

గీతలో చెప్పబడిన హైందవ సంప్రదాయమును పోలి మహాయాన బౌద్ధముగూడా అధర్మము పొడసూపినపుడు పతిత జనోద్ధరణకు బుద్ధుడు భూమిపై అవతరించు చుండునని వచిస్తున్నది. జనులకు నిర్వాణము, ఆనందము ప్రసాదించుటకు, భూతకోటిపై కారుణ్యాం వహించి, దేవతలు – మానవులు హర్షింప, తథాగతుడు భూలోకమున అవతరించు చుండును – అని అంటుంది.

# (8) వివిధ మత సౌమనస్యము

## (1) సమధిక సమైక్యము

వివిధ మతములలో ద్రష్టలు ఏకేశ్వరోపాసననే అదే శిస్తున్నారు. ఏ పేర్లతో పిలువబడినా భగవంతుడొకడే; అతడు నిరాకరుడు, నిర్గుణుడు, అనుభవైక వేద్యుడు. అతడు అఖిలభూతకోటికి జీవనశక్తిప్రదాత; చరాచర ప్రపంచానికి మూలము - అంటారు. బాహ్యరూపాలలో భేదాలువున్న వివిధమతాల సమశ్రుతికి ఈ మహత్తర ప్రబోధం ప్రబల తార్కాణం.

మతముల మూలసత్యాన్ని మనం గ్రహించకపోవడం వల్లనే ఒకమతానికి ఇంకొకమతం విరుద్ధం అనుకొంటున్నాము. ప్రతిమతంలో ఇంచుమించు ఒకేరకపు ముఖ్య అనుభవం, విశ్వాసం, ప్రాతిపదిక కన్పిస్తుంది. పునాది ఒకటేనైనా దానిపై జరిగిన వివిధమత నిర్మాణాలు వ్యక్తులనుబట్టి భిన్నంగా రూపొందుతున్నై. భగవంతుని నిర్మాణకౌశలానికి అంతటికీ ఒకేమూసవుండదు. వివిధమత ద్రష్టలజీవితాలు ఈ విష యాన్ని సువ్యక్తంచేస్తున్నవి. వ్యక్తులనుబట్టి భగవంతుడు ప్రసాదించేశక్తిలోగూడా భేదం కన్పిస్తుంది. భగవదిచ్ఛను బట్టి భిన్నవ్యక్తులకు భిన్నశక్తులు ప్రసాదింపబడుతవి అంటాడు సెయింట్ పాల్. ఒక్కొక్క వ్యక్తియొక్క అనుభవం అనన్యంగా వుంటుంది. ప్రతివ్యక్తి తనకుతాను పరమసత్యా న్వేషణకు పూనుకోవాలి. అయితే సమష్టి విజ్ఞానంలో ప్రతి యొక్కరి అనుభూతి ఒక భాగమౌతుంది. ఈ వివిధాను

భూతులవలన మానవసంఘపు ఆధ్యాత్మిక విజ్ఞానసంపద పెరుగుతుంది.

బాహ్యరూపంలో మతముల సమ్మ్రుతి సాధింపలేము. ఏ మతరూపమును గూర్చియు అసూయ, ద్వేషములేని విశాలహృదయంతో మతసహనం ప్రకటించి వివిధమతముల సమత్వభావాన్ని ఆత్మరంగంలో ఉపలక్షించవచ్చును. హైందవమత ద్రష్టలకు పరమతద్వేషంలేదు. భగవత్ తత్త్వ పరిశోధకులు వివిధమతములు వివిధమార్గములుగ – సాధనలుగ పరిగణిస్తారు. ఆయా మార్గాలలో పరమసత్యం ఆవిష్కరణ పొందుతుంది అంటారు. మోక్షసాధనకు ఏ ఒక్కమతంగాని ఏకైకమార్గమనరు. భగవంతునకు అందఱూ ఒకటే. అతని ప్రేమాదరాలు, కారుణ్యకటాక్షాలు పొందడానికి అందఱూ అర్హులే. ఏ మతమువారైనా, ఏ జాతివారైనా, ఏ దేశము వారైనా తనను అర్థిస్తే భగవంతుడు అనుగ్రహిస్తాడు.

భగవంతునిగూర్చిన వివిధసిద్ధాంతాలలో – భగవత్ సాక్షాత్కారానికి అనుసరించవలసిన వివిధమార్గాలలో – ఒక విశిష్టమైన సన్నిహితత్వం ఉన్నదని సత్యవిదుల నిశ్చితాభిప్రాయం. మాటలలో వర్ణించుటకు వీలుకాని పరమేశ్వరుని హైందవ మతగ్రంథాలు విశేషంగా వర్ణించినై. మతానుభూతి అందఱకు ఒకే కమ్మచ్చున తీసినట్లుంది అన్నది హైందవ సంప్రదాయంకాదు. పరమసత్యాన్ని తెలిసికోగలిగినశక్తి మానవునిలో అంతర్యాతమైవుంది; తన సాధనచేత అతడా మహనీయతను ప్రజ్వరిలజేసికోవచ్చునన్నది హైందవ తాత్త్విక భావం అసలు ఈ భౌతిక ప్రపంచావసరాలనుబట్టియే ఆలోచించితే అది వేదాంతశాస్త్రానికి పొసగక పోవచ్చు-

సత్యమనేది బుద్ధికల్పనం అనే హేతువాదం. సృష్టిరహస్యాన్ని గాని, సత్యము - భగవత్ స్వరూప ఆవిష్కరణము నొకటే అన్న విషయాన్ని గాని తెలియకపోవడమే. ఇలాంటివారు నాస్తికమతానికీ, సక్రమ బ్రహ్మజ్ఞాన విభూతినెఱుగక ఆస్తిక మతానికీగూడా దూరమౌతారు.

బ్రహ్మప్రాప్తి వేదద్రష్టలలో మాత్రమేకాక ఆర్యులలో - అనార్యులలో కన్పిస్తున్నది - ఋషి ఆర్యమ్లేచ్ఛానామ్ సమానమ్ లక్షణమ్ - అంటాడు న్యాయసూత్ర వ్యాఖ్యాతయైన వాత్స్యాయనుడు. వీరు తమభాష - తమ సంస్కృతి - తమ సంప్రదాయాలే సత్యములనే సంకుచిత హృదయులుకారు. ప్రపంచంలో ఇతర దేశాలలో జరిగే వివిధ సంఘటనలకుగూడా మనపై కొంతప్రభావం వుంటుంది. పరమసత్యాన్ని గూర్చి ఎవరుచెప్పినా అది అంతా దైవ చోదితమే - అంటాడు సెయింట్ ఎమ్‌బ్రోజ్. మతానుయాయులను ధర్మపథానువర్తనులుగా చేయడం మతసంస్థల బాధ్యత.

హిందూ - మహమ్మదీయ ఐక్యమును ప్రబోధించిన వారిలో కబీర్ (క్రీ. శ. 15-వ శతాబ్దం) ప్రముఖుడు. హిందువులు తమదేవుడు కాశీలో వున్నాడంటారు. మహమ్మదీయులు తమదేవుడు మక్కాలో వున్నాడంటారు. అయితే ఈ సమస్త జగత్తును సృష్టించిన భగవంతుడు భూమిమీద మానవులు కట్టిన పట్టణాలలో వుండడు. హిందువులకు, మహమ్మదీయులకు అందఱకు తండ్రి - భగవంతుడొక్కడే - అని అతని మహత్తర ప్రబోధం.

సత్య-ధర్మజిజ్ఞాస ఉండాలి; జ్ఞానాన్ని పొందడానికి సాధనవుండాలి; ముందుగానే ఏదో నిర్ణయంచేసికొని కూర్చోకూడదు. మనకుముందే ఏవియో నిశ్చిత భావాలుంటే వాటిని సమర్థించుకోవాలి అనిపిస్తుంది. దీనితో ఇతర సిద్ధాంతాలను గూర్చిన వ్యతిరేకత; నాభావమే, నా సిద్ధాంతమే వాటికంటె శ్రేష్ఠతరము అనే అహంభావము కల్గుతవి. సరియైన ద్రష్టకు ఇలాంటి భావాలు ఉండవు. అందువలననే అతనికి అది ఎలాంటిదైనా ప్రతిసిద్ధాంతాన్ని సమర్థించాలి అనే భావం, పట్టుదల ఉండదు. ఇతర సిద్ధాంతాలనుగూర్చి ద్వేషము ఉండదు. జ్ఞానం పొందడానికి బహుళోపాయములు-మార్గములు-వున్నవి అంటుంది మహాయాన బౌద్ధము. మన అవిద్యను పోగొట్టి జ్ఞానజ్యోతిని వెల్గించేమార్గం ఏదైనా మంచిదే. పరమసత్యాన్వేషణలో మతాచార్యుల ప్రవచనాలు నదీ ప్రవాహాన్ని దాటడానికి ఉపయోగించే తెప్పకొయ్యల్లా ఒక ఆధారంమాత్రమే. అందుకే అంటారు: మతాలయంలో పుట్టడం మంచిదేకాని అందులోనే మరణంమాత్రం పనికి రాదు అని. అయితే అనాదిగావచ్చే సంప్రదాయాలను అనుసరించడం సులభమే. కాని, దీనివల్ల వ్యక్తి కాలోచితం కాని పాతబాటలోనే చిక్కుకొని, "నలుగురితో బాటు నారాయణ"గా తయారై, తనవ్యక్తిత్వాన్ని-ప్రాధాన్యమును కోల్పోతాడు.

ఇస్లామ్‌ను సత్యమతము-దీన్ ఉల్ హాల్-అంటారు. అంతమాత్రాన ఆ మతం సత్యమంతా తనసొత్తే అనదు. దేవునిలో మాకు అచంచల విశ్వాసమున్నది. దేవునివాక్యాలు మాకు ప్రమాణాలు. ఈ దైవానుభూతిలో ఇలాగే

అబ్రహామ్, ఇస్మాయిల్, ఇసాక్, జాకబ్, మోసెస్, ఏసు మొదలగు దేవదూతలకు కలిగిన అవానుభూతిలో మాకు విశ్వాసమున్నది—అని కురాన్‌లో ప్రస్తావించబడుతుంది. ప్రతిజాతికి దైవసందేశం లభిస్తుంది అని కురాన్ అంటుంది. అందుకే ఇతరమత ప్రవక్తలయందుగూడా గణ్యత చూపు మంటుంది. ఏ జాతిగాని, ఏ వర్గముగాని కలకాలం అజ్ఞానాంధకారంలో మగ్గడం జరుగదు. ఇదికాదనడం సర్వసముడు, ప్రేమమయుడు, దయాప్రపూర్ణుడునైన భగవంతునకు పక్షపాతబుద్ధి ఆరోపించడమే.

భిన్నమతభావాలున్ననూ అవి అన్నీ ఒకే పరమ సత్యాన్ని ప్రతిపాదిస్తున్నై. అయితే, ఆభావాలు—ఆచారాలు దేశకాల పాత్రలనుబట్టి వేర్వేరుగా వుండటంకద్దు. ఇలా వుండటముగూడా వాటికి దోహదమే.

దేవత్వాన్నిగూర్చిన మనభావాలే భగవంతుడు కాదు. దేవత్వాన్ని అర్థంచేసికోడానికి, ఆరాధించడానికి, అనుభూతి పొందడానికి ఇలాంటి మనోచిత్రణలు కొంతవఱకు అవసరమే. అయితే, ఈ మనోచిత్రణలు తగుమాత్రంకాని తాత్కాలిక చిహ్నాలు మాత్రమే. మతసిద్ధాంతాలు మనకు గుణాగుణ విమర్శకల్గించే భావాలు. పరమసత్యాన్ని తెలిసికోడానికి అవి అనువైన సూచనలు మాత్రమే అంటాడు తాత్త్విక వేత్త కాంట్.

యథార్థమతనైష్ఠికులు నిరహంకారులు, శాంతస్వభావులుగా వుంటారు. వారిగుణం మతవిశ్వాసమేకాని వెఱ్ఱి మతావేశంకాదు. వారు తాముకనుగొన్న సత్యాన్ని విశ్వసిస్తారు. తమభావములే సమగ్రములనరు. మతోన్మత్తత

కలవారు దీనికి భిన్నులు. శాంతచిత్తులకు మతం శరణ్యం. అహంకారులకు మతావేశం నైజం. ఏ వ్యక్తియైనా తాను పొందిన సత్యానుభూతి సమగ్రమైనది అంటే అనవచ్చును; కాని, దానికి భిన్నమైన అనుభూతి ఎవ్వరికీ ఎన్నడూ సాధ్యం కాదనడం సమంజసంకాదు. భూత భవిష్యద్వర్తమానములలో తానొక్కడే వతత్త్వమంతా తెలిసికొన్న ఘనుడు అని ఎవ్వరైనా చెప్పితే అది మతోన్మత్తతయే ఔతుంది.

## (2) సమైక్య భావము

మతంలోగాని, రాజకీయాలలోగాని "బలవంత మాఘ స్నానం" పనికిరాదు. సృష్టిలోని సామరస్యమును చూడ గల్గిన దృక్పథాన్ని కల్పిస్తుంది మతం. అంతేగాని, తన నిశ్చిత సిద్ధాంతాలనే మానవలోకమంతా తలదాల్చాలి అనదు. మతసిద్ధాంతాలూ, మతకర్మలూ మానవుని గమ్య స్థానంకావు. భగవద్విలాసాన్ని తెలిసికొనడంలో అవి మానవునకు ఉపయుక్తములైన కొన్ని సాధనలు మాత్రమే. అవి ఏదోఒక వర్గానికి, దేశానికి, జాతికి మాత్రమే కట్టుపడి వుండవు. వేల సంవత్సరాలుగా నిలిచి గెలిచిన సంప్ర దాయాలను, తరతరాలుగా ఆ ముష్మికభావలహరిని అందించి తత్త్వబ్రహ్మలను, జ్ఞానమూర్తులను వెలయించిన సంస్కృతిని త్రోసి రాజనరాదు. పదనైన నేలలో పాదుకొని వుండినన్ని నాళ్లు ననలుసాగే లతలవంటివి ఈ భావాలు.

మంచి యెక్కడవున్నా అరస్గ్రహించాలి అనేది శ్రేయోదాయకమైన సూత్రం. ఈ సూత్రం మతవిషయాలలో కూడా హెచ్చుగా నచ్చుతుంది. ఇతరమతాల సాంగత్యంతో

ఎంత నవకం పెంచుకొన్నా సమస్తమానవుల ఆధ్యాత్మిక సమైక్యమునకు ఏ ఒక్కమతమూ చాలుతుందనలేము. అయినా, వెనుకటికంటె ఎక్కువగా ఈ నాడు మతాలు అన్యోన్య విశిష్టతను అంది పుచ్చుకోవలసిన అవసరంవుంది. వాటి ధర్మోపదేశాలను, మౌలికమైన ఆధ్యాత్మికభావ సంపదను పరిశీలిస్తే పెద్దమతాల కన్నిటికీ ఒకేవిధమైనలక్ష్యం కన్పిస్తుంది. మనము జ్ఞానామృతాన్ని అస్వాదించవలసింది ఏదో ఒక్క మతంలోనే అనే నియమంలేదు. ఇంతకూ మనకీనాడు క్రొత్త మతం అవసరంకాదు; ప్రాతమతాలనే క్రొత్తదృక్పథంలో అర్థంచేసికొని అనుసరించడమే అవసరం. ఒక మతాన్నే మానవులందఱూ అనుసరించడంవల్లగాని, మతాల పరస్పర వైషమ్య ప్రసంగాలవల్లగాని, అసంబద్ధమైన బహుమత సమ్మేళనంవల్లగాని మతానికి పురోవృద్ధికలుగదు. మతాలు భిన్నంగావున్నా, వాటిలో ఇమిడివున్న ప్రధాన ఐక్యభావ మును మనంగుర్తించగల్గితే మతానికి భావి భాగ్యోదయం వుంటుంది.

ఐక్యభావము అనేది హృదయానికి, ఆత్మకు సంబంధించింది. బాహ్యరూపాలలో భిన్నత్వంవున్నా, అవి అన్నీ ఆత్మిక జీవనంలోని సమైక్యమును సూచిస్తూనేవుంటవి. వివిధ దేశాలలో, వివిధకాలాలలో, వివిధమతధర్మ విజ్ఞాతలు వివరించిందే ఈ ధర్మసూత్రం. ఈ సత్య-ధర్మసూత్ర సముద్ధరణం మన ప్రశస్తవారసత్వ పునరార్జనమే.

పరమతములయందు అసూయాద్వేషాలు అజ్ఞానమూలకములే. పరమతాలను సరియైన దృష్టితో పరామర్శించితే అన్నిమతాలు ఆదరణపాత్రములే అని తేటతెల్లమౌతుంది.

మానవాభ్యుదయ కరములైన మహత్తరావకాశములు కొన్ని మతవైషమ్యాలలో జారిపోయిన ఘట్టాలు చరిత్రలో లేకపోలేదు.

మతాలు అన్యోన్య సన్నిహితత్వాం, సామరస్యం సాధించి విశ్వమానవ సౌభ్రాత్రం నెలకొల్పాలి. భారతీయ తత్త్వసూత్రాలుగాని – పాశ్చాత్య తత్త్వసూత్రాలుగాని తమ తమ ఆధిక్యాలనుగూర్చి వాదించుకోవడంతో తృప్తిపడరాదు; ఈ ఉభయభావ తరంగిణులు సమస్తమానవకోటిని ఆకర్షించే ఉత్తమ ఏకైకమార్గాన ప్రవహించే ప్రయత్నం కొనసాగించాలి – అంటాడు డాక్టర్ ఆల్బర్ట్ ష్వైచర్. వీరు ఉభయులు ఆధ్యాత్మికక్షేత్రంలో సత్యదర్శన వ్యాపారంలో సహచరులు; భాగస్వాములు. మతాలు అన్నీ శాంతి, ధర్మ, స్వాతంత్ర్యముల మహోద్ధరణకై కంకణం కట్టుకోవాలి. స్వజనులపై చూపే ప్రేమ పరజనులపైగూడా ప్రసరించాలి. ఆధ్యాత్మిక సహజీవనభావం అభివృద్ధియై పెంపొందాలి.

స్వతఃగా కాకున్నా పరమతసాహచర్యంవల్ల ప్రతి ముఖ్యమతం ఇంచుమించు ఒకేరకపు ధర్మసందేశాలను అందిస్తూన్నది.

భారతరాజ్యానికి మతప్రసక్తి లేదు. అంతమాత్రాన భారతపౌరులు నాస్తికులనిగాని, వారు జీవితంతో మతానికి గల సంబంధాన్ని తెలియనివారనిగాని అనరాదు. దేవుడు లేడని ప్రభుత్వం దైవాధికారాలు కైవసం చేసికొంటూన్నది అనరాదు. అనాదిగాగల భారత సంప్రదాయం ఆస్తికతయే. అయినా, భారతప్రభుత్వం ఏమతానికీ చెందిందికాదు; ఏమతానికీ ప్రత్యేకప్రాధాన్య మీయదు. జాతీయజీవనంలో,

అంతర్జాతీయ వ్యవహారాలలో ఏమతంతోడనూ ముడిపెట్టు కోదు. అలాకాకుంటే, ప్రజాస్వామ్యంలోని ప్రధాన సూత్రా లకే భంగం వాటిల్లుతుంది; మతానికి ప్రభుత్వానికి కూడా నష్టంకల్గుతుంది. మతవిషయంలో ఈ తాటస్థ్యవిధానం బహు ప్రయోజనకరమైనది. జాతీయ – అంతర్జాతీయ విషయాలలో శ్రేయోదాయకమైనది; శుభంకరమైనది. పౌరులలో ఏ వర్గానికీ ప్రత్యేక హక్కులు – సౌకర్యాలు ఉండకూడదు. అతని మతం కారణంగా ఏ పౌరునికీ ఏ విధమైన అనర్హత ఆపాదించకూడదు. ఏ మతాన్ని అనుష్ఠించినా, సాంఘిక జీవనంలో అందఱూ సమానంగా పాల్గొనే హక్కువుండాలి. మతాన్ని రాజ్యాంగంనుండి వేఱుపఱచడంలోని ముఖ్యో ద్దేశ్యాలివి. భారతరాజ్యాంగంలోని మతతాటస్థ్యాన్ని నాస్తిక వాదమనిగాని, కేవల లౌకికవాదమనిగాని భ్రమించరాదు. ప్రాచీన భారత సంప్రదాయానికి విరుద్ధంకాని ఫక్కీలోనే ఈ మతతాటస్థ్య విధానం జరుగుతూన్నది. ఆస్తికులలో సామరస్యాన్ని, స్నేహాన్ని సాధించడమే దీని పరమలక్ష్యం. ఏకతలో వ్యక్తిస్వాతంత్ర్యాన్ని జోడించిన సన్నివేశమిది. ఈ పరమసూత్రం సంఘోన్నతికి జీవగఱ్ఱ; ప్రజాస్వామికానికి పట్టుకొమ్మ.

వివిధమతాలను పరామర్శించి చూచితే వాటిలో అపారమైన వేదాంతభావం, దైవతత్త్వజ్ఞానం, మానవప్రేమ కన్పిస్తవి. పవిత్రత, పరిశుద్ధత, ధర్మపరత, దాతృత్వము ప్రపంచంలోని అన్ని మతాలలోనూ వున్నై.

ఈ నాడు ప్రతిమతంలోను పరమత సహనమున్న విశాల హృదయులు కొందఱున్నారు. వీరు పరమసత్య

పదము పొందడానికైన సత్యాన్వేషణ మార్గంలో వివిధ మతానుయాయులు సోదరయాత్రికులే అని గుర్తిస్తారు. వారందఱూ ధర్మజీవనాభిరతులే; వారిలో సహనం, సహచర్యం, ఔదార్యం, సౌభ్రాత్రం సాధ్యమౌతుంది అంటారు. సత్యానుభూతికై తహతహలాడే ఆధ్యాత్మిక జీవన ప్రవక్తలకు మతసంస్థలతో పనిలేదు. మానవమనోభావాలను ప్రేమ రసంతో రంగరించి లోక కళ్యాణం సంతరించడమే వీరి ఆకాంక్ష. భావిభాగ్యోదయానికి బంగారు మొలక!

## ముగింపు

మతానికి సరియైన అర్థం గ్రహించడం ఈనాడు చాల వఱకు తగ్గిపోయింది. అయినా, మతం ఇవ్వగలిగిన మహా ప్రసాదానికి ఇపుడు ఎంతైనా అవసరమున్నది. శాశ్వతము, సర్వోత్కృష్టమునైన పరమసత్య సందర్శనం – ఆవిష్కరణ – మానవజాతి సమైక్యము ముఖ్యమతాల కన్నిటికీ మూల సూత్రాలు. ఆధ్యాత్మతత్త్వజిజ్ఞాస సత్యాన్వేషణకు మార్గం. పెద్దసిద్ధాంతాలు, మతకర్మలు అంతముఖ్యం కాదు. కాలానికి అనుగుణమైన నవీకరణమే లేక, ప్రాతదనమే యోగ్యతగా ప్రేలాడుచున్న బడుగు ఆచారాలకు ప్రాకులాడని నూతన దృక్పథం కావాలి. మత – సాంఘికాచారాలలో సహనము, ఔదార్యము సంతరించాలి. మన ఈ ప్రస్తావనలో మతాన్ని – ఈ శాశ్వత పరమధర్మాన్ని సనాతనధర్మము అనవచ్చు. ఇది ఒక ప్రత్యేక మతం కాదు; ప్రాత మతాలలో నూతన దృక్పథంమాత్రమే. ప్రాతక్రొత్తల మేలుకలయిక! అన్ని జాతులకు, అన్ని దేశాలకు, అన్ని మతాలకు అనువర్తించు

ధర్మోద్ధరణమిది! ఇది జాఱిపోతూన్న వాటిని ఏఱితెచ్చి ముచ్చటగా గ్రుచ్చుకొను ముత్యాలసరము! ఆందోళన – సంఘర్షణ – భయ – క్లేశాదివ్యాధులను మాన్పు దివ్యాంజనమిది! ఇది మానవజాతికి మహనీయపదమును. విశ్వజగతికి శాంతి భద్రతలను ప్రసాదించు మహోన్నత ధర్మసూత్రము.

ఓమ్ తత్సత్